# లేఖిలు

## వ్యాస ప్రపంచం - 8

రచన

**కొడవటిగంటి కుటుంబరావు**

కూర్పు

**కృష్ణాబాయి, ప్రసాద్**




**విప్లవ రచయితల సంఘం**

**ఆంధ్రప్రదేశ్**

వ్యాసప్రపంచం - 8
**లేఖలు**
**కొడవటిగంటి కుటుంబరావు,**



ప్రచురణ
**విప్లవ రచయితల సంఘం**
ఆంధ్రప్రదేశ్

మొదటి ముద్రణ
ఏప్రిల్ **2002**

కవర్ డిజైన్
**మోహన్**

కంపోజింగ్, ప్రింటింగ్
నాగేంద్ర ప్రెస్, విజయవాడ

సోల్ డిస్ట్రిబ్యూషన్
నవోదయ బుక్ హౌస్,
కాచిగూడ, హైదరాబాద్ - 500 027

వెల రూ **75/-**

# కృతజ్ఞతలు

ఇన్నాళ్ళూ ఎంతో పదిలంగా దాచుకున్న లేఖలన్నీ ఈ సంపుటి కోసం మాకు అందజేసిన అందరికీ పేరు పేరునా కృతజ్ఞతలు.

కొడవటిగంటి వరూధినిగారి సహకారం, ప్రోత్సాహం మాకెంతో ఉత్తేజాన్నిస్తున్నాయి.

**- విరసం**

# ఉభయకుశలోపరి

కుటుంబరావుగారి 'వ్యాస ప్రపంచం'లో 'లేఖలు' ఆఖరి సంపుటం వ్యాసం లాగానే లేఖ కూడా సాహిత్య స్థాయికి చేరుకుంది ఇందుకు తోడ్పడిన తెలుగు రచయితలలో కుటుంబరావుగారొకరు అయితే లేఖల మాటకొస్తే చలంగారి గురించి ముందుగా చెప్పుకోవాలి చలం 'ప్రేమలేఖలు' తెలుగు సాహిత్యంలో ఆరిపోని జ్యోతులు అంతేగాక పర్సనల్ ఉత్తరాలు బోలెడు రాశారాయన అవి కూడా చాలా వరకు అచ్చు అయాయి చలంగారి అభిమానులు దేశం నలుమూలలా ఉన్నారు వారు తామరతంపరగా ఆయనకి ఉత్తరాలు రాసేవారు ఓపిగ్గా జవాబులు రాయడం చలం దినచర్యలో భాగం (శ్రీశ్రీ దినికి భిన్నం తిరుగుటపాలో జవాబు రాయకపోతే ఇక ఎప్పటికీ జవాబు రాసేవాడు కాదాయన !) చలంగారి ఉత్తరాలలో ఆర్ద్రత, ఆత్మీయత, ఆప్యాయత తొణికిసలాడేవి చలం అభిమానులకవి గొప్ప ఊరట ఆయన జాబుల్లో సాహిత్యం మీదా, సాహిత్య వ్యక్తుల మీదా కామెంట్స్ కూడా ఎక్కువగానే ఉండేవి

ఉత్తరాలు అనగానే వెంటనే తలుచుకోవలసిన సాహితీవేత్తలు ముఖ్యంగా ఇద్దరు గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు ఒకరు (1898-1982), అనేక జీవిత చరిత్రలు, చరిత్ర పుస్తకాలతోపాటు 'అక్షరాభిషేకం' రాశారు ఇది తెలుగులో తొలి కథా సాహిత్య సమీక్షా గ్రంథం ఇంకొకరు సంజీవదేవ్‌గారు (1914-99) సాహిత్య, సాంస్కృత రంగాల్లో పేరు మోసిన కళాజీవి ఉత్తరాల ద్వారా వీరు తమ స్నేహసంపదని తామరతంపరగా వృద్ధి చేసుకున్నారు మూడు, నాలుగు తరాలవారిలో మానవ సంబంధాలకు సేతువులు నిర్మించారు

కుటుంబరావుగారి దారి వేరు ఆయన ఉత్తరాలు చాలా ఆబ్జెక్టివ్‌గానూ, ఎడ్యుకేటివ్‌గాను ఉంటాయి సాహిత్య ఔత్సాహికులు ఆయన్ని ఎన్నెన్నో వివరాలు అడిగేవారు నిజానికి వారి ఉత్తరాలు కూడా సాహిత్య విమర్శనా వ్యాసంగమే సాహిత్య సంఘాల నిర్మాణం గురించీ, ఉద్యమాల ఆటుపోట్ల గురించీ, పోరాటాల ఒడిదుడుకుల గురించి అచ్చమైన మార్క్సిస్టు విమర్శకుడిగా ఉత్తరాల్లో విశ్లేషించారాయన వీటన్నింటితో పాటు, అనేకానేక చారిత్రక రాజకీయ అంశాల మీద కుటుంబరావుగారి అంచనా మనకీ లేఖల్లో దొరుకుతుంది నిశిత పరిశీలన, ప్రయోజనాత్మక విశ్లేషణ స్పష్టమవుతాయి

అందుకనే ఇవి మరింత విలువని సంతరించుకున్నాయి పనిగట్టుకుని వీటిని పోగుచేసి ఒకచోట కూర్చడంలోని ఉద్దేశం కూడా అదే

అయితే కుటుంబరావుగారి వ్యాసాల్లాగా లేఖలు మొత్తం సేకరించగలిగామని మేం అనుకోవడం లేదు మా ప్రయత్న లోపం లేదని మాత్రమే చెప్పగలం ఎన్నో ఏళ్ళుగా ఈ పనికి పూనుకోబట్టే ఈ మాత్రమైనా దొరికాయి మా అన్వేషణలో మాకు దోహదం చేసిన వారినెవ్వరినీ మరవలేం ఎవరెవరి ఉత్తరాలు వారు ఇవ్వడమేగాక, కారణాంతరాలవల్ల ఎవరెవరి ఉత్తరాలో మరెవరెవరి దగ్గరో మాకు దొరికాయి అందరికీ మరోసారి మా కృతజ్ఞత

ఒక చిన్న గమనిక కుటుంబరావుగారు బుద్ధికొలత సిద్ధాంతం ప్రతిపాదించారు అది చాలా వివాదాస్పదమైనది దానిమీద ఎందరెందరితోనో ఆయన లేఖాసంభాషణ కొనసాగించారు ఆ లేఖలన్నిటినీ తాత్త్వికవ్యాసాలు (కొ కు వ్యాసప్రపంచం-7) లో పొందుపరిచాం వాటిని అక్కడ అమర్చడమే ఆ విషయానికి అనుగుణంగా వుంటుందని అలా చేశాం

విశాఖపట్నం,
17-8-2001

**కృష్ణాబాయి, ప్రసాద్**

# పోస్టు చేసిన ఉత్తరాలు

# కొకు వ్యాస ప్రపంచం

* **సైన్సు వ్యాసాలు**

  మొదటి ముద్రణ - జనవరి 1989

  రెండవ ముద్రణ - జనవరి 1997

* **చరిత్ర వ్యాసాలు**

  అక్టోబర్ 1999

* **సంస్కృతి వ్యాసాలు**

  అక్టోబర్ 1999

* **సినిమా వ్యాసాలు** 1, 2 భాగాలు

  డిసెంబరు 2000

* **సాహిత్యవ్యాసాలు**

  మే 2001

* **రాజకీయ వ్యాసాలు**

  ఆగస్టు 2001

* **లేఖలు**

  ఫిబ్రవరి 2002

త్వరలో **తాత్విక వ్యాసాలు**

20, Kachaleswara Agraharam,
G T , Madras,
9-4-40

*Dear Mr Rama Rao,*

Yesterday K Venkatramaiah Garu met me and talked to me regarding publicity work for your picture I said I was ready He said he had no idea of what a publicity man ought to be given Ofcourse I also had no idea But I told him that you will be having to meet some incidental expenditure towards maintaining an office, hiring a bit of furniture, paying a servant boy to go about and so forth Ofcourse I don't advise you to pay for the show of these things You can stick to the barest necessities but I am afraid it will come up to not less than Rs 25 a month Regarding salary for the man in charge, Mr Nilamraju Seshaiah tells me that he was taking Rs 50 a month So I suppose I ought to take that This I learnt after Mr Venkatramaiah left here So please inform him of the figures I gave you as soon as he goes over there He told me that he would be coming back here in a week or so By then, I hope you would have settled everything in a definite way

If I am to look to your publicity, I want to have a first hand knowledge of the story, scenario and dialogues and rushes of the work atleast, a thorough list of the artistes and technicians Averse as I am to noisy publicity, I shall be quite willing to act upon any special instructions

Convey my compliments to Mr A V Subba Rao Tell him I got his letter but felt too lazy to answer it I am glad to learn that you are going to be at Kolhapur end of publicity I should like to have a diffuse and gauze put upon the unlayer in producing prints for publicity Artist Mr Sarma said the same thing independantly So what I felt must have been right A diffuse will do for groups but for individual portraits gauze must be added

మద్రాసు,
27-10-45

ఆరుద్రగారూ,

మీ ఉత్తరం ఆలస్యంగా, ఇవాళే, శ్రీశ్రీ సమక్షంలో అందింది ఇటీవల శ్రీశ్రీ చేసి వచ్చిన సాహిత్య ప్రస్థానం తుఫాను వల్ల చెడిపోయింది ఇక్కడ అభ్యుదయ రచయితల కేంద్రం ఏర్పాట్లు ఓ విధంగా సాగిపోతున్నాయి శ్రీశ్రీ కూడా active గానే పనిచేస్తున్నాడు

మీరడిగిన దానికి సలహా ఏం చెప్పను ? ఓపిక ఉంటే చదువు సాగించటం మంచిదేమో ! జర్నలిజంలో పడే అవకాశాలు ఉంటే పోనివ్వరాదు కాని రెండు విషయాలు మరువ రాదు జర్నలిజంలో బతుకు తెరువు మించి డబ్బు లేదు దొబ్బులు జాస్తి జర్నలిజంలో పైన తప్ప ఖాళీలు లేవు Top కి పోవాలని ఆశ ఉన్నవాడే అందులో అడుగు పెట్టటం మంచిది ఈ విషయంలో ఇది లిటరేచర్‌కు అపహాస్యంగా ఉంటుంది లిటరేచర్‌లో డబ్బు మృగ్యమైనా ఎక్కడికక్కడే కీర్తి ఉంది జన సామాన్యంలో ఒక శ్రీశ్రీకి ఉండే పలుకుబడి ఒక ఖాసా సుబ్బారావుకుండదు

సినీరంగంలో మనవంటి వాళ్ళకు చోటు లేదు అది క్లోజ్‌డ్ ప్రొఫెషన్స్‌లో ఒకటి ఆ పద్మవ్యూహంలో అడుగుపెట్టలేం పెడితే బయటికి రాలేం

గవర్నమెంటు వారివ్వబోయే ఉద్యోగాల గురించి నాకేమీ తెలీదు సామాన్యంగా గవర్నమెంటు శాఖకి అంటే వార్ధక్య మన్నమాట దీనికి ఎక్సెప్షన్స్ ఉంటే ఉండొచ్చు ఫలాని రకం ఉద్యోగం చెయ్యాలా ? కూడదా ? అనేది ఉద్యోగం మీద కూడా ఆధారపడదు అందులో వున్న ఎడ్వెంచర్ వాల్యూ కూడా చూసుకోవాలి ఎక్కడికైనా వెళ్ళి బోడి మాస్టరు ఉద్యోగం చెయ్యడంలో ఉండే అనుభవం ఉన్న ఊళ్ళో చేస్తే లేదు తెనాలి బియ్యం ఫ్యాక్టరీల్లో నేను పని చేసి వుందునా ? ఏ పని చేసినా అందులో అనుభవమూ, ఎడ్వెంచర్ వాల్యూ చూసుకొని చేయమని నా సలహా ఉంటాను

*

పెదపూడి,
28-5-46

మీ ఉత్తరం అందింది నేను బిళ్ళలంటించిన కవరులోనే ఉత్తరం పంపాను ఇక్కడో, అక్కడో ఎవరో కాజేసి ఉంటారు మీకు మూడణాల బచ్చా తగల్లేదు కదా ? ఇక్కడ పాఠశాలకి ఈ పాటికే సగంపైగా పంతుళ్ళు చేరి వుండవలసింది మూడో వంతయినా గట్టిగా చేరలేదు నలుగురైదుగురిని మినహాయిస్తూ అంతా వచ్చారనుకోండి అంతా ఒక్కసారే దిగినా ఇబ్బందే ప్రస్తుతం వృధా కాలయాపన అయిపోతున్నది ముందు తొక్కిసలాడవలసొస్తుంది అంతకంటే మరేమీ లేదు ఇక్కడ లైబ్రరీ వగైరా ఏర్పాట్లు కూడా అనుకున్నంతగా జరగలేదు దిబ్బ శర్మకీ, శ్రీశ్రీకి మధ్య నడిచిన ఘర్షణను శ్రీశ్రీ వేపు నుంచి ఆపుకుంటేనే మంచిది ఇద్దరికీ ఊడే

కీర్తి ఏమీ లేదు వాడు కొర్టు ఫూల్ వాడెమన్నా, నవ్వేవాళ్ళు నవ్వుతూనే వుంటారు సాహిత్య కళకీ, వాడికీ ఏ విధమైన దోస్తీ కూడా లేదు వాడు చస్తే పిడికెడు బూడిద తప్ప మిగలదు శ్రీశ్రీ బతికుండే మనిషి మీరు శ్రీశ్రీకి రాసిన దాన్లో రాయప్రోలు గారిని గురించి అన్నముక్కలే నేనా మధ్య రేడియో ఉపన్యాసంలో అన్నాను "లేదురా ఇటువంటి భూదేవి యెందు" అనగానే మిగతా భూదేవుల మీద చిన్న చూపు కలగడమే తప్ప మరేం లేదు

కథ అందింది కోపంతో రాసినట్టుంది కథగా చూస్తే అట్టే పాకం లేదు ప్రజాశక్తికి పంపిస్తున్నాను

'కులం లేని మనిషి' కాపీ కోసం చక్రపాణికి రాస్తే వెంటనే అంది ఉండును కృతులు గురించి నేను నా అభిప్రాయం విపులంగా చెప్పలేదు వెనకటి కాలంలో చరిత్ర కూడా పద్యాల్లోనే రాసినట్టు, సంగీతం సాహిత్యం వెంట వినే వాళ్ళం అచ్చం నాదం ద్వారానే ఎంతో ఎమోషన్, ఇంకా అందులో వైచిత్రాలు కూడా చూపవచ్చుననేది తెలుసుకోడానికి కృతుల్లో ఉండే సాహిత్యం అడ్డొస్తుంది కృతులు వెళ్ళి Pure Music అంటూ పాడితే తప్ప మనకి అచ్చమైన సంగీత కళ అనుభవంలోకి రాదు ఈ విషయం వెనక నేను ఒప్పుకోలేదు కాని Foreign Music అంతా ఏమిటి ? పెద్ద పెద్ద సింఫనీలన్నీ ఏమిటి ? సాహిత్యం ఇంకా ఒక వెలుగు వెలుగుతూండగానే మనం సంగీతం తాలూకు టెక్నిక్ - ఆర్కెస్ట్రేషన్ - దించుకుంటే సాహిత్యం దానంతట అదే దొడ్డిదారిన జారుకుంటుంది ఇది గతంలో రావలసిన New Synthesis

రుధిర జ్యోతిష్కుపి శాఖ పట్నంలోనే ఉన్నాడు గంటి మద్రాసు వచ్చి 'ఆంధ్ర'లో చేరాట్ట కాని వాళ్ళ ఫారమ్‌లోకి పోతాట్ట - శ్రీశ్రీ ఉవాచ

మద్రాసు,
7-6-60

ప్రియమైన రాజేంద్రగారికి,

నమస్కారాలు మీ కార్డుతో బాటే weekly కూడా అందింది ఇంకా చూడలేదు Illustrated Weekly Editor A S Raman గారు నన్ను, కొన్ని కథలు నావి ఇంగ్లీషులో రాయించి పంపమన్నారు నేనే 6 రాసి పంపుతూ, ఇంగ్లీషు వారినే సరిచూడమన్నాను అందులో రెండు ఉంచుకుని 4 తిప్పి పంపారు వారు తిప్పి పంపిన వాటిలో రెంటిని రెండు ఇతర ఇంగ్లీషు పత్రికలకు పంపి చూశాను అది తిరిగి వచ్చినై English పత్రికలలో మన కథలు పడడం చాలా కష్టం పేరు తెచ్చుకుంటేగాని కథ పడదు, కథలు పడుతుంటేగాని పేరు రాదు అందుచేత ప్రస్తుతం నాకు ఇంగ్లీషు పత్రికల్లో ప్రవేశించాలని ఆశలేదు రామన్‌గారు (ఆయన తెలుగువారే !) పూనుకోకపోతే ఇవి కూడా పడవు (ఇంకో కథ కూడా కాలక్రమాన పడుతుంది) మీరు ఎప్పుడు వస్తున్నదీ తెలియజేయండి ఉంటాను

*

17-10-61

నమస్కారాలు నిన్నటి మీ కార్డు అందింది అంతకు పూర్వం మీరు పంపిన పుస్తకాలు రెండూ అందాయి ఇవాళ నా పుస్తకాలు (పునర్ముద్రణలు) మీకు book-post గా పంపుతున్నాను విశాలాంధ్రలో నా శీర్షిక కొంతమందికి నచ్చినట్టు ఉత్తరాలు వస్తున్నాయి మీరు చెప్పిన వ్యాసం కృష్ణాబాయిగారనే ఆమె ఉత్తరం ద్వారా కోరిన మీదట రాశాను పాఠకులు నన్నడిగి తమకు కావలిసినది రాయించుకోవటం ఇదే మొదలు మీకు బదిలీలు తరుచు జరుగుతున్నట్టున్నది ఉంటాను

29-9-61

*శ్రీ విశ్వనాథశాస్త్రి గారికి*

నమస్కారాలు మీ కార్డు అందింది ఈ రోజు తేదీ వేసి నిన్న రాత్రే మీకు ఉత్తరం రాసి మా ఇంటిపక్క పోస్టు బాక్సులో పడేశాను నేను 'కానూన్' చూసి ఉన్నాను మీ నాటకం చదువుతూ ఉంటే నాకది జ్ఞాపకం రానేలేదు 'కానూన్' గొడవ వేరు నాటకం గురించి నా అభిప్రాయం రాసేశాను దాన్ని సీరియల్‌గా పబ్లిష్ చేయాలంటే విశాలాంధ్ర వేయడమే మంచిది పుస్తకం కూడా వాళ్ళే వేయాలంటే వేయవచ్చు నాటకం గురించి నేనొక సందేహం వెలిబుచ్చాను దాన్ని గురించి మీ ఉద్దేశం రాయండి

మద్రాసు,
3-10-61

శ్రీమతి కృష్ణాబాయిగారికి,

నమస్కారాలు గత నెల 30న మీరు రాసిన ఉత్తరం ఇప్పుడే అందింది ఒక్క ప్రళయం గురించేగాక దేశమంతటా ఎన్నోరకాల మూఢ విశ్వాసాలు వ్యాప్తమవుతున్నట్టు విన్నప్పుడల్లా నాకు చాలా బాధ కలుగుతుంది నిజానికి జనం పొందే ఈ ఆందోళన పైనుంచి వచ్చేదికాదు అది జీవితంలో నుంచే వస్తున్నది జనానికి వర్తమానం అర్థం కావటం లేదు భవిష్యత్తు మసకగానైనా కనిపించటం లేదు ఈ లోపం ప్రభుత్వానిదంటాను ప్రజా జీవితపు రోడ్లమీద ప్రభుత్వం బారలు చాచి కూర్చున్నదే తప్ప ఆ జీవితాన్ని తీర్చిదిద్దే ప్రయత్నం లేదు తీరిక కూడా లేదు ఎంత మంచి ప్రభుత్వమైనా ఇంత పెద్ద దేశాన్నీ, ఇన్ని కోట్ల ప్రజలనీ ఎంతకాలం సాయంపట్టి నడిపిస్తుంది ? ఎవరి కాళ్ళమీద వాళ్ళు నిలబడటానికి ప్రోత్సాహం లేకపోగా, నిలబడే వాళ్ళ కాళ్ళమీద కొట్టటానికి కూడా ప్రభుత్వం మార్గాలు ఆలోచిస్తున్నదా అనిపిస్తుంది

పై ఆదివారం సంచికకు వ్యాసం రాసి పంపాను మీరు సూచించినట్టు ప్రళయం మీద కూడా ఏదైనా రాయటానికి ప్రయత్నం చేస్తాను ఉంటాను

❋

30-10-62

నమస్కారం మీ 26వ తేదీ ఉత్తరం అందింది "చిత్ర జగత్తు"లో నేను రాసిన దానిపై వచ్చిన విమర్శలలో విమర్శకుల మానసిక వ్యాధులు తప్ప నాకేమీ కనిపించలేదు చిత్ర జగత్తు శీర్షిక సినిమా విమర్శలకు కాదు - జీవిత విమర్శకు నేను తీసుకున్న విషయం సినిమాలలో సంఘర్షణ అయినప్పటికీ దాన్ని సినిమాల విమర్శగా తీసుకున్నారు ఈ అయోమయంలో నుంచి చిలవలూ, పలవలూ వచ్చాయి ఒకటి - నేనన్నది తప్పు, రెండు - నిజమైనా నాకు అనటానికి అర్హత లేదు, ఎందుకంటే నాది పక్షపాతంతో కూడిన దృష్టి, మూడు - బోలెడంత డబ్బు risk చేసి తీసే పిక్చర్లను గురించి ఈ విమర్శలన్నీ ఏమిటి ? చెప్పటానికేం? చేసి చూస్తే తెలుస్తుంది ! ఇవేవీ చిత్ర జగత్తు శీర్షికయొక్క ఆశయానికి అంటే వాదనలు కావు

మరొక సంగతేమిటంటే నేను సినిమాలకి రాశాను, సినిమా విమర్శలు రాశాను సినిమాలకు పబ్లిసిస్టుగా పనిచేశాను "మాలపిల్ల" ఎంత విప్లవాత్మక చిత్రమైనా మాలపిల్ల పాత్ర సృష్టిలో చాలా గందరగోళం జరిగింది చలంగారి రచనలో శాస్త్రిగారి అబ్బాయి మాలపిల్ల సంస్కృతిచేత ఆకర్షించబడడు - దేహ సౌందర్యంచేత ఆకర్షించబడతాడు గూడవల్లివారు సరియైన సాంఘిక పరిజ్ఞానంతో ఆమెకు సంస్కృతి జోడించారు సంస్కార సామ్యం లేనిదే ప్రేమ ఏమిటి ? చలంగారి మాలపిల్లా, రామబ్రహ్మంగారి మాలపిల్లా ఒకే వ్యక్తిలో మూర్తీభవించి పాత్ర సృష్టి దెబ్బతిన్నది ఈ మాట నేను రామబ్రహ్మంగారితో అన్నాను ఆయన అభ్యంతరం

చెప్పలేదు అదే పిక్చరుకు రామబ్రహ్మంగారి కోరికపై నేను పబ్లిసిటీ విమర్శ రాశాను ఇందులో మోసంగాని పక్షపాతం గాని ఏమీలేదు పబ్లిసిటీకోసం రాసినప్పుడు కూడా నేనెన్నడూ పిక్చరులో లేని విషయాన్ని ఎగదోసి రాయలేదు ఈ పబ్లిసిటీ రచనలకు నేనెన్నడూ చిల్లిగవ్వ తీసుకోలేదు

'కులగోత్రాలు'లో గల సంఘర్షణగానీ, మరో చిత్రంలో గల సంఘర్షణ గాని వాస్తవం అయి ఉండి కూడా, దాని చిత్రణ "వాస్తవికంగా" ఉండకపోవచ్చు వాస్తవానికీ వాస్తవికత్వానికీ గల తేడా ప్రసాద్‌గారు కూడా గమనించినట్టు లేదు ఆయన "వాస్తవం" అనేమాట వాడారుగాని "వాస్తవికం" అన్నది వాడలేదు 'కులగోత్రాలు'లో తండ్రి సంప్రదాయం ఏమిటో ఊహించటం నాకు సాధ్యం కాలేదు అతను నాకు ధనమదాంధుడల్లే కనిపించాడు సినిమా ప్రొడ్యూసర్లలో ఒక తరగతికి ప్రతినిధిగా ఉన్నట్టున్నాడు ఏ పత్రికల్లో గాని తమమీద ఈగ వాలితే చాలు ఆ పత్రికకు ప్రకటనలివ్వమని ఎంత విలయతాండవం చేస్తారో మీకు తెలిసే ఉండవచ్చు ఇలా రంకెలు పెట్టటానికి ఒక సంస్కారమూ, సంప్రదాయమూ ఉండక్కర్లేదు కొన్ని లక్షలు స్వయంగా గడించినవాడు కొడుకును పెళ్ళి విషయంలో నిగ్గదీస్తాడు (అది స్వార్జితం అయి వుండాలి లేకపోతే కొడుకును ఎలా వెళ్ళగొడతాడు ?) Scientific గా ఆలోచిస్తే సినిమా లంటే భయం వేస్తున్నది అందుకే నేను చాలా లోపాలకు margin ఇస్తున్నాను ఉంటాను

*

29-10-64

నమస్కారాలు మీ 25వ తేదీ ఉత్తరం ఇవాళే అందింది చందమామ విషయం - చందమామకు కథలు బయట నుంచి కూడా వస్తాయి కొన్ని మాత్రమే నేను మా లైబ్రరీ పుస్తకాలలో నుంచి ఏరుతాను అన్ని కథలూ చక్రపాణిగారు చూసి ఆమోదించటం జరుగుతుంది నేను చేసేది కథలను తిరగరాయటం

చందమామలో భక్తిని రేకెత్తించే కథలు గాని, మతప్రచారం చేసే కథలుగాని వెయ్యము చక్రపాణిగారి పాలసీ కూడా అదే అయితే శాస్త్రీయ భావాలను పెంచే కథలు కూడా వెయ్యటం లేదు శాస్త్రవిజ్ఞానం పట్ల నాకెంత నమ్మకమో చక్రపాణిగారికి అంత అనుమానం - చదివేవాళ్ళు అర్థం చేసుకోలేరని అప్పటికీ చాలా రోజులు శాస్త్ర విషయాలకు కొన్ని పేజీలు కేటాయిస్తూ వచ్చాను దాన్ని నిలిపి వెయ్యవలసి వచ్చింది

జానపద సాహిత్యంలో వాస్తవికత ఎప్పుడూ ఉండదు అది మనిషిలో ఒక spirit పెంపొందించటానికి మాత్రమే పనికి వస్తుంది అందులో అద్భుత రసానికి చాలా తావున్నది చీనా కమ్యూనిస్టు ప్రభుత్వం ప్రచురించిన జానపద కథల పుస్తకాలు చూసినట్టయితే దాని range బాగా తెలుస్తుంది అచ్చగా దయ్యాలకు సంబంధించిన కథలే ఏరి వాళ్ళొక చిన్న పుస్తకంగా ప్రచురించారు చందమామలో పిల్లల మనస్సులను నీరసపరిచేవి, నిర్వీర్యం చేసేవీ అయిన కథలు రాకుండా సాధ్యమైనంత శ్రద్ధ తీసుకుంటూనే ఉన్నాం ప్రత్యేకంగా ఏ కథ అయినా అటువంటి ధోరణిలో ఉన్నదనిపిస్తే శ్రమ అనుకోక నాకొక కార్డుముక్క రాయండి

నా సొంత రచనలు ఉండకపోవటం లేదు గడిచిన సంవత్సరన్నర కాలంలో నాలుగు పెద్ద కథలూ, రెండు చిన్న నవలలూ రాశాను అన్నీ ప్రచురణ కాలేదు అవిగాక అయిదారు శాస్త్రగ్రంథాలు అనువదించాను నెహ్రూ పుస్తకం ఒకటి అనువదించాను అయిదారు బెంగాలీ నవలలు 'యువ'కు సంగ్రహపరచి ఇచ్చాను వాటిలో కొన్ని ఇంకా అచ్చు కాలేదు అందుచేత నా రాతపని ఏమీ తగ్గలేదు, పెరిగింది కూడానూ విశాలాంధ్ర, జనశక్తి పత్రికలు ప్రస్తుతం రాజకీయాలలో మునిగి తేలుతున్నాయి చిత్రజగత్తు ఆపినందుకు విశాలాంధ్ర వాళ్ళు కష్టపడ్డారు కాని దాన్ని వారం వారం నిర్వహించాలంటే చాలా విశ్రాంతి, కేంద్రీకరణా కావాలి పై పనులు జాస్తి అయి అది మానవలసి వచ్చింది ఉంటాను

*

26-10-65

నమస్కారాలు మీ 22 ఉత్తరం ఇవాళే అందింది నేను భారతి చూడటం లేదు ఏమైనా "భారతి"కి నేను వ్యాసాలు పంపను ఆంధ్రపత్రిక సంస్థ బొత్తిగా అరాజక స్థితిలో వుంది అంతకన్న విరోధ భావమేమీ లేదు

"ఐశ్వర్యం" ఏ నాలుగైదు మాసాలలోనో పూర్తిచెయ్యక నాన్చి, విసుగెత్తిస్తున్నారు డాక్టరు Idealistic పాత్ర కాదు ఒక దృష్టిలో ఆయనకు కూడా లోపం వుంది ఉదాహరణకు ఆయన కూతురి దృష్టి నుంచి స్నేహితులలో కూడా వాళ్ళందరూ ఆదర్శ స్నేహితులు కారు చిన్నప్పుడు బాగా కలిసి తిరిగినవాళ్ళకు అవకాశం దొరికినప్పుడు nostalgia పైకి తంతుంది అందులోనూ జరుగుబాటు కలవాళ్ళకి ఆ స్నేహితులలో ఒక్కడే idealist అతనే తన స్నేహితుడి కూతుర్ని తన కొడుక్కు చేసుకుంటాడు ఆ కొడుకైనా తండ్రి ఎవర్ని చేసుకోమన్నా చేసుకునే రకం 'యువ' నవలల సంగ్రహాలు చక్రపాణిగారి idea పాత నవలలే అయినా వాటిలో దాదాపు ఏవీ యువ చదివే ఆడవాళ్ళకు తెలిసినట్టు లేవు మీకు రాయాలనిపించి నప్పుడల్లా రాస్తూండండి నాకేమీ విసుగులేదు సంతోషమే ఉంటాను

*

9-1-67

నమస్కారాలు మీరు 6న రాసిన ఉత్తరమూ, వరంగల్లు మిత్రులు రాసిన ఉత్తరమూ ఇప్పుడే అందాయి నేను 1931 ఆఖరులో ఆరు నెలలు హైద్రాబాదులో ఉన్నప్పుడు ఒకసారి రామప్పకు వెళ్ళాను ఆ ప్రదేశం 36 ఏళ్ళ అనంతరం మళ్ళా చూడాలని నాకు సరదాగానే వున్నది కాని 10 రోజులు ముందుగా టిక్కెట్టు కొంటే గాని ప్రయాణం చెయ్యటానికి లేదు 6, 7 తేదీలలో హైదరాబాదు సాహిత్యసభకు రమ్మని 3వ తేదీన డబ్బు పంపారు విచారిస్తే 13 తేదీదాకా ఫస్ట్‌క్లాస్ రిజర్వేషనులు ముగిసినట్టు తెలిసింది ! అందుచేత నేను రామప్ప రావటం అసంభవం ఈ మాట వరంగల్లు మిత్రులకు రాద్దామంటే, ఉత్తరంలో వారి అడ్రసు ఏమీలేదు అందుచేత మీకు రాస్తున్నాను మీరు రామప్ప నుంచి తిరిగివచ్చాక ఈ ఉత్తరం చూసుకుంటారేమో ! ఆలస్యమైనా సరే వారందరికీ నా క్షమాపణలు తెలపండి

ఈ నెలాఖరున నేను విశాఖపట్నం వచ్చే ఆలోచన వున్నది వచ్చినట్టయితే అక్కడ మిమ్మల్ని కలుసుకోగలుగుతానని ఆశిస్తున్నాను

రచయితలలో ఏదో ఒక చైతన్యం లేకపోలేదు కాని దాన్ని రచనలలో వ్యక్తం చెయ్యలేక మామూలు "పామరుల" లెవెల్‌లోనే ఉండిపోతున్నారు అభ్యుదయ రచయితల సంఘం అన్నేళ్ళు పనిచేసినా రచనలో విప్లవకరమైన మార్పులు రాలేదు వస్తువు అభ్యుదయకరంగా వుండటమే చాలుననుకున్నారు ఏది అభ్యుదయకరమన్న విషయం గురించి కూడా సరిగా చర్చలు జరగలేదు దాని ఫలితం ఈనాడు కనిపిస్తున్నది

"కేయాస్" కథలను నేనేమంత ఆసక్తితో రాయటం లేదు నిజం చెప్పాలంటే నాకు కేయాస్, భద్రం, గవరయ్య మామ పాత్రలమీద చాలా సానుభూతి ఉన్నది వాళ్ళను అడ్డం పెట్టుకుని మన జీవితంలోని కుళ్ళును పారడీ చెయ్యటం నాకంత గొప్పగా కనబడటం లేదు పాఠకులకు ఆ కథల్లో ఉండే వ్యంగ్యం అంతగా అర్థం కాదనే నా నమ్మకం కూడా

ఇప్పటి పత్రికల ధోరణి చూస్తూంటే నాకేమీ రాయబుద్ధి పుట్టటం లేదు 'యువ' కూడా ఏవైనా వ్యాసాలు రాసినా ఈ పత్రికలు వెయ్యవు ఈ ఎన్నికల అడావుడిలో దినపత్రికలో చోటు ఆశ్రయించటం మనస్కరించకుండా ఉన్నది ఉంటాను

*

20-1-67

మీ ఉత్తరం అందింది తెలంగాణా వాళ్ళ సాహితీరతకూ, సర్కారు జిల్లాల వాళ్ళ భేషజానికీ ఉండే తేడా నేను దాదాపు 30 ఏళ్ళక్రితమే గుర్తించాను ఆ తేడా ఇంకా అలాగే వుండిపోయింది కాబోలు మద్రాసులో ఉండే రచయితలు కలవను కూడా లేరు మీరు నవనాగరికత అన్నది కేవలం డబ్బు వేటగా తయారయింది ఇక్కడ మాకు "సారస" అనే సారస్వత సంస్థ ఒకటున్నది అందులో 20 లోపు మందిమి ఉన్నాం ఎవరి ఇంట్లోనన్నా కలుసుకుంటే ఒక గంటసేపు మాట్లాడుకునే విషయాలు కూడా ఉండవు పిక్నిక్‌ల మాట దేవుడెరుగు మీ వరంగల్లు మిత్రులను తప్పక అభినందించాలి

నేను విశాఖపట్నం ఏ తేదీన వస్తున్నదీ నాకింతదాకా తెలియదు టిక్కెట్లు ముందు కొనుక్కోవలసి వుంటుందనుకుంటాను నన్ను ఏ విషయం మాట్లాడమంటారో కూడా నాకు తెలియదు మీరన్నట్టు, ఓపిక ఉన్నంతవరకూ మాట్లాడి తరవాత గోష్ఠి కింద మారిస్తే నాకూ, వినేవాళ్ళకూ కూడా సౌకర్యంగా వుంటుంది ఏ విధమైన ప్రశ్నలు వేసినా ఫరవాలేదు నాకు తెలియని విషయాలు తెలియవని చెప్పటానికి బిడియపడను

రచయితల ఫోరం లాంటిది నిర్వహించటానికి నాకు తీరిక ఎక్కడుంటుంది ? అన్ని ఉద్యోగాల వాళ్ళూ ఏడాదికొక నెల సెలవు తీసుకుంటారు నేను 10 రోజులు శలవు పెడ్తే 11 వ రోజుకు ఆ పదిరోజుల పని నాకోసం ఎదురుచూస్తూ వుంటుంది చందమామ పని అటువంటి పని

మిమ్మల్నందరినీ చూసే అవకాశం కోసమే ప్రధానంగా నేను విశాఖపట్నం వస్తున్నాను ఉత్తరాల ద్వారా పరిచయమైనవారు చాలామంది ఉన్నారు తెలిసినవారు చాలా కొద్దిమంది ఉంటాను

❋

2-2-67

నేను నిన్న ఉదయం సకాలంలో మద్రాసుకు చేరాను వీలు చూసుకుని నేను ఈసారి విశాఖపట్టణం రాగలిగినందుకు నాకు చాలా సంతోషంగా వున్నది ఉత్తరాల ద్వారా పరిచయం గల వారినందరినీ కలుసుకోగలిగాను అదివరకు కలుసుకున్నవారు కూడా ఈసారి బాగా దగ్గర అయ్యారు శ్రమపడి నన్ను పిలిచినవారికి నేను న్యాయం చెయ్యలేదని నాకు తెలుసు కాని నేను ముందే మీకు రాసినట్టు నాకు గల శక్తి చాలా అల్పం విద్యార్థులను విసిగించనందుకు నన్ను నేను thank చేసుకున్నాను ఈ విషయంలో నాకు ఒక్కటే విచారం ఇంకో రెండు రోజులు ఉండగలిగితే చాలామందికి తృప్తి కలిగి ఉండేది రైలు బయలుదేరబోయేటప్పుడు కూడా, నేను అప్పుడే వెళ్ళిపోతున్నానని కుర్రాళ్ళు నొచ్చుకున్నారు ఎక్కడికి వెళ్ళినా వెళ్లకపోయినా రెండు మూడేళ్ళ కొకసారి విశాఖపట్నం వెళ్ళి తీరాలి అని ఇప్పటి నా mood !

అన్నిటికన్నా నాకు మీ ఇంట్లో జరిగిన గోష్ఠి మరవరానిది అటువంటి వాతావరణంలో రచయితలు కలుసుకుంటే ఒకరి ప్రభావం ఒకరిమీద బాగా వుంటుంది భావాలు ఏకోన్ముఖం అయ్యే అవకాశం ఉంటుంది ఈ కారణం చేతనే నేను శ్రీ వేణుగోపాలరావుగారికీ, మీకూ ఎంతైనా కృతజ్ఞుణ్ణి మీ వారినీ, పిల్లలనూ అడిగానని చెప్పండి ఉంటాను

❋

17-2-67

నమస్కారాలు మీ 14 ఉత్తరం అందింది 30 నాటి కార్యక్రమం మీకు సంతోషం కలిగించటం నాకు ఆశ్చర్యంగా వుంది నాకది చాలా లాంఛనప్రాయంగా జరిగిందనే అనిపించింది అంతమంది విద్యార్థుల్ని బోరెత్తించడానికి భయపడి చప్పున ముగించాను ఏకపక్ష ప్రసంగాలంటే నాకే విసుగు కలిసి కూర్చుని మాట్లాడుకుంటే ఎన్ని గంటలైనా మాట్లాడుకోవచ్చు రచన కూడా ఒక విధంగా ఏకపక్ష ప్రసంగమే గనక రచనలతో బోరు కొట్టిస్తాననే భయం నాకెప్పుడూ ఉంటూనే వుంటుంది అందుకే నా నవలలు 100 పేజీలు మించి వుండవు

వాల్తేరులో ఇంకో రోజుంటే నాకు వచ్చే నష్టం లేదుగాని అందరి టైం పాడు చేస్తాననే భయం కూడా పట్టుకుంది

నా సిద్ధాంతం ప్రకారం రచయిత తెలుసుకోకూడనిది ఏమీలేదు ముప్పాళ రంగనాయకమ్మగారి లాంటి చెయ్యి తిరిగిన రచయితకు అనేక విషయాలు బొత్తిగా తెలియని కారణం చేత ఆమె రచనలో లోపం కనిపిస్తుంది

ఇక ఆఖరు విషయం నేను నా రచనలన్నిటా మధ్యతరగతి ఆడవాళ్ళను చాలా కసిగా తిడతానా ? ఈ సంగతి నాకే తెలియదు అసలు మధ్యతరగతి సగటు మగవాడే నాసి ఆడవాళ్ళు మరింత నాసి పాత విలవలూ, ప్రమాణాలూ, పద్ధతులూ నష్టదాయకంగా వున్నాయని తెలిసి కూడా మగవాడు వదులుకోలేకుండా ఉంటే, నష్టదాయకంగా ఉన్నాయని తెలియనైనా తెలియని స్థితిలో ఉన్నది ఆడది కాని అందుకు నేను మధ్య తరగతి ఆడవాళ్ళను తిట్టలేదు నేను ఎక్కువగా రాసేది మద్రాసు వంటి నగరంలో ఉండే మధ్యతరగతి కుటుంబాలను గురించి వీళ్ళు పల్లెటూళ్ళ నుంచీ, చిన్న బస్తీలనుంచీ పట్నవాసానికి వచ్చిన మొదటి తరంవాళ్ళు పాతిక ముప్ఫై ఏళ్ళుగా మద్రాసులో వున్నవాళ్ళ ఆత్మలు - మాయల పకీరు ప్రాణంలాగా తమ తమ పల్లెటూళ్ళలోనే, చిన్న బస్తీలలోనే ఉంటున్నాయి వీళ్ళనూ, వీళ్ళ మూర్ఖాన్నీ, దాన్ని ఎదిరించలేని భర్తల అసహాయ స్థితినీ నేను కళ్ళారా చూస్తున్నాను కాని తిట్టటం మటుకులేదు అయినా నేను ఏ రచనల్లో ఆడవాళ్ళను తిట్టానో చెబితే కొంచెం ఆత్మవిమర్శ చేసుకుంటాను

వేణుగోపాలరావు గారినీ, మిగతా మిత్రులనూ, అందరినీ అడిగానని చెప్పండి ఉంటాను

PS మీ విశాఖ రచయితలలో కొన్ని వర్గాలు గమనించాను ఒకరి ప్రభావం ఒకరిమీద అంతగా లేకపోవట్లానికి ఇదే కారణం రావిశాస్త్రిగారూ, కాళీపట్నం రామారావులాంటివారు ఒక రకం వివేకానందమూర్తి, తంబు వగైరాలు మరొకరకం వాళ్ళు రచనలో కొత్త ఫాషన్లు తడివే వాళ్ళు రాజకీయ విజ్ఞానం గలిగి, సాహిత్యతత్వం సరిగా తెలియని అతన్ని కూడా అక్కడ చూశాను వీళ్ళంతా ఒక కూటమిలో ఇమిడారు మంచి గోష్ఠిలాంటిది ఏర్పాటు చేయదలిస్తే సాహిత్య స్వరూప జ్ఞానమూ, రాజకీయ జ్ఞానమూ గల కొద్దిమందితో ఆరంభించండి ఇతరులు నింపాదిగా అటుకేసి వచ్చే అవకాశం వుంటుంది

*

30-3-67

నమస్కారం మీ 25 ఉత్తరం అందింది 'బ్రతుకు భయం' నాటిక నాకు అంతగా నచ్చలేదు కొండల్రావుగారు తన పోర్షన్ మరీ వేగంగా చదివాడని రేడియోవాళ్ళ ఆరోపణ సీతప్ప పోర్షన్ జాస్తి అయింది సీతప్ప కారెక్టరు (అంటే, నా మనస్సులో ఉన్నది) ఒకటి రెండుచోట్ల గాడి తప్పింది అదీకాక, ఆ నవల నాటకంగా మార్చటానికి వీలైనది కూడా కాదు నన్నే నాటకంగా రాయమంటే నేను రాయననేశాను ఆ పని కొండలరావుగారు చేశారు నాకు ఒకటే తృప్తి - ఈ నాటకం లో ఏడుపులూ, ఎగబీల్పులూ లేవు వింటే తృప్తి కలగకపోయినా, జబ్బు చెయ్యలేదు కొన్ని కొన్ని రేడియో నాటకాలు పాజిటివ్‌గా జబ్బు చేస్తాయి

బాలమురళినిగాని మరొకరినిగాని అవతార పురుషుడనటం అర్థం లేని మాటే కాని అతను కర్ణాటక సంగీతానికీ, గానానికీ కొత్త జీవం పోస్తున్నాడు ఒకనాడు త్యాగయ్య చేసిన పనే బాలమురళి ఈనాడు కొంతవరకైనా చేస్తున్నాడు అతని ప్రత్యేక శక్తులను గురించి ఎవరూ చెప్పుకోరు తెలుగు వాళ్ళకు సంగీతంమీద అభిమానం ఉంటే బాలమురళీ, ఈమని శంకరశాస్త్రీ, చిట్టిబాబులాంటి ఉద్దండులు ఆంధ్రలోనే ఉందురు గదా ! పోనివ్వండి

ఒక్క మారుతిరావే కాదు, ఎంతోమంది డబ్బుకోసమూ, కీర్తికోసమూ రాస్తున్నారు రెండూ నిషా వస్తువులే అందుచేత వాటికి మార్కెట్ వాల్యూ ఉన్నది మాసపత్రికలవాళ్ళు ఈ నిషా వస్తువులను ఆధారం చేసుకునే సొమ్ము చేసుకుంటున్నారు ఆడవాళ్ళ రచనలకు మొదటి బహుమతులివ్వటం ఒక వ్యాపార రహస్యం మొదటి బహుమతి పొందిన నవలలను పుస్తకాలుగా వేసి వాటి కీర్తితో సొమ్ము చేసుకోవటం మరొక వ్యాపార రహస్యం

పొట్లపల్లి రామారావుగారన్న దాంట్లో పాయింటు లేకపోలేదు కాని నేర్పుగా రాయటం మాత్రమే చాలదు నిరుపేదల జీవితాలనూ, కష్టజీవుల జీవితాలనూ చిత్రించి తీరాలి ఎందుకంటే సామాజిక జీవితపు కీలకాలూ, రహస్యాలూ అందులోనే వున్నాయి జాక్ లండన్ నగరపు మురికి పేటల్లో తిరిగి, అక్కడి జీవితాన్ని అద్భుతంగా చిత్రించాడు దాంతో చాలా దుమారం రేగింది నిరుపేద జీవితాన్ని పేలవంగా చిత్రించినప్పుడల్లా దుమారం రేగదు అయితే, ఈనాడు మనదేశపు సమాజ జీవితం తాలూకు కుళ్ళు అతి పేదవాళ్ళ జీవితంలోకన్న, మధ్యతరగతి జీవితంలోనే ఉన్నదని నా నమ్మకం చెప్పుకోదగిన రచయిత ఒక విధమైన భావ విప్లవవాది ఈ భావవిప్లవం తెచ్చే శక్తి శ్రామిక కార్మిక రచయితలదాకా ఇంకా వెళ్ళినట్టు కనబడదు వర్గాల దృష్ట్యా చూస్తే (అంటే వ్యక్తుల మాట వదిలేస్తే) భావచైతన్యం రాకుండా రాజకీయ విప్లవ చైతన్యం రాదు ఈ మాట మార్క్సిస్టులు అంగీకరిస్తారు ఈ కారణంచేత మన జీవిత రహస్యాలకోసం మధ్య తరగతిలోనే వెతకాలనిపిస్తుంది

శ్రీరంగం రాజేశ్వరరావు దుర్మరణం గురించి విశ్వనాథశాస్త్రిగారు చెప్పారు తెనాలి నుంచి బి నరసింగరావుగారు కూడా అనేక వివరాలు ఇవాళే రాశారు రాజేశ్వరరావుకూ, నాకూ ఏడాదిగా చాలా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగేయి నేనక్కడికి వచ్చినప్పుడు నాతో చాలా విషయాలు తన రచనల గురించి మాట్లాడాడు రైలు కదిలినదాకా నా వెంట ఉన్నాడు పాపం అతనింకా కళ్ళలో మెదలుతూనే వున్నాడు వేణుగోపాలరావుగారినీ, మీ ఇంట్లో అందరినీ అడిగానని చెప్పండి

❃

10-5-67

నమస్కారాలు మీ ఉత్తరం నిన్న ఉదయం అందింది నిన్న సాయంకాలం వేణుగోపాల్‌రావుగారూ, రాచకొండ విశ్వనాథశాస్త్రిగారూ మా ఆఫీసుకు వచ్చారు కొంతసేపు కబుర్లు చెప్పుకున్నాం

ఒక్క సంగీతమే కాదు, అన్ని కళలూ మతంనుంచే పుట్టుకొచ్చాయి తరువాత అవి రాజుల ఆదరణలో మార్పు చెందాయి శాస్త్రీయ సంగీతానికి భక్తి తరువాత శృంగారం ఆశ్రయమైంది ఈ విషయం కర్ణాటక సంగీతంలో కన్నా హిందుస్థానీ సంగీతంలో బాగా కనబడుతుంది మన వర్ణాలలో కూడా శృంగార సంబంధమైనవి చాలా ఉన్నాయి సాంఘిక పరిణామం సాహిత్యంలోనూ, ప్రత్యేకించి నాటకాలలోనూ, చిత్రలేఖనంలోనూ వచ్చినట్టుగా

సంగీతంలో రాలేదు మన కర్ణాటక విద్వాంసులు చాలామంది క్షేత్రయ్యను పరిగణించటం లేదు పర్వతనేని వీరయ్య చౌదరిగారు మినహా, కొద్దిమంది అష్టపదులు పాడుతున్నారనుకోండి

స్త్రీ రచయితలలో ముప్పాళ వారివి నేను అనేక కథలూ, రెండు నవలలూ మాత్రమే చదివాను ఆమెకు గల రచనా సామర్థ్యం గురించి వేరే చెప్పనవసరం లేదు కాని ఆమెకుండే సంస్కార ప్రియత్వం ఆమె రచనల ద్వారా సాధ్యంకాదని నా అనుమానం ఆవిడ నవలలు అక్కడక్కడా డాక్యుమెంటరీలలాగా ఉంటాయి ఇది కూడా లోపమే

ద్వివేదులవారి రచనలూ, శారదాదేవిగారివీ నేనింతవరకు చదివే అవకాశం దొరకలేదు వీళ్ళిద్దరూ ముప్పాళ రంగనాయకమ్మగారిని అందుకోలేరంటుంది మా ఆవిడ

మీ ఆక్షేపణ సరియైనదే నేను జవాబులు రాస్తున్నాను గాని జాబులు రాయటం లేదు రాయటానికి నా పరిసరాలలో ప్రేరణలు ఏవీ లేవు చేసే ఉద్యోగం ఒక చెరువు లాంటిది అందులో ఏ విధమైన ప్రవాహమూ లేదు ఇక్కడ ఏ విధమైన ఉద్యమమూ, ఆక్టివిటీ లేవు ఏదన్నా వుంటే మనవైపునే ఉండాలి అదంతా అట్లా వుంచి నాకు రాయటానికి టైము కూడా లేదు పదిరోజులు ఆఫీసుకు శలవుపెట్టి ఎక్కడన్నా విశ్రాంతి తీసుకుందామన్నా అవకాశం లేని ఉద్యోగం Summer School కు రావాలంటే ఎట్లా సాధ్యమవుతుంది ?

ఈ మధ్య వారం రోజులపాటు ఢిల్లీ వెళ్ళాను అక్కడ Children's Books సెమినార్ జరిగింది పిల్లల పుస్తకాలకు సంబంధించిన సమస్యలతో మూడు రోజులపాటు కుస్తీ పట్టి, ఏవో కొన్ని సూచనలు చేశాం వాటినుంచి ఏమీ ఆచరణ ఉండదు ముందే తెలుసు కాని లాంఛనంగా అంతా సాగిపోయింది నాకది కాస్త రిలీఫ్‌గా తోచింది

నేనేమీ రాయటం లేదు సాధ్యమైనంతవరకు రాయకుండా ఉండటానికి విశ్వప్రయత్నం చేస్తున్నాను కాని నన్ను ఊరికే ఉండనివ్వరు పైవాళ్ళ పోరు మరీ దుర్భరమైతే బలవంతాన ఏదో ఒకటి రాస్తాను ఈ ఉత్తరం చేరేసరికి వేణుగోపాల్‌గారు చేరే ఉంటారు ఆయననూ, అందరు మిత్రులనూ అడిగానని చెప్పండి ఉంటాను

*

14-6-67

నమస్కారాలు మీ 12 ఉత్తరం చేరింది మీరు అంతకుపూర్వం రాసిన ఉత్తరం కూడా చేరే వుంటుంది నా భార్య మా అమ్మాయి వెంట ఢిల్లీ వెళ్ళటం అడావుడిలో నేను జవాబివ్వటం మరచిపోయి ఉంటాను దాదాపు ఈ నెల రోజులూ నాకు కాలూ చెయ్యి ఆడలేదు ఇంట్లో వంట, వంట్లో జబ్బు, బ్లడ్‌ప్రెషర్, చందమామ పనికాక, బోలెడన్ని పై పనులు నాలుగు రోజులనుంచీ కాస్త తెరిపిగా వున్నది

మీరన్నది నిజమే "అపార్థం" నాకు జ్ఞాపకం లేదు మా స్నేహితుడొకాయన కథ అంతా చెప్పినా సరిగా గుర్తు రాలేదు సాధారణంగా నేను రాసినది ఇంత అన్యాయంగా మరచిపోవటం జరగదు ఎవరి ప్రోద్బలం మీదనో రాసినవి తేలికగా మరచిపోతాను నార్లగారికి

రాసిచ్చిన రెండు కథలూ రాయాలన్న urge లేకుండా రాసినవే ఈ రెండు మూడేళ్ళ కాలంలో నేను బుద్ధిపూర్వకంగా రాసిన కథలు "జనశక్తి"లో రెండే మిగతావన్నీ తద్దినం పెట్టినట్టు రాసినవే "అపార్థం" లో సెంటిమెంటున్నట్టు కూడా నాకు గుర్తు రావటం లేదు అంటే అందులోది హృదయపూర్వకమైన సెంటిమెంటు కాదనుకోవాలి

మనకు ఏ రచన అయినా నచ్చినప్పుడు రాసినవారికి ఉత్తరం రాయటం జబ్బయితే ఈ జబ్బు నాకు కూడా ఈ మధ్య ఉంటున్నది నాకిప్పుడు మంచి పుస్తకాలు మరీ మంచిగానూ, చెడ్డ పుస్తకాలు మరీ చెడ్డగానూ కనిపిస్తున్నాయి కళ్ళకు భూతద్దాలు వచ్చాయన్నమాట మంచి రచనలు చాలా అరుదుగానే వస్తున్నా వాటిని deep గా ఆనందించగలుగుతున్నాను

రచయితగా మటుకు నేను పెద్ద ఫ్రాడ్‌గా తయారయానేమోననిపిస్తున్నది నేను తిట్టుకుంటూ రాసినవి చాలా ఉత్సాహంతో రాసినట్టూ, రాసిన మరుక్షణం మరిచిపోయినవి చాలామంచి రచనలుగానూ చదివే వాళ్ళకు కనిపిస్తున్నాయంటే నేను రచయితగా లోకాన్ని వంచిస్తున్నానన్నమాటే గదా ! ఈ మధ్య నేను సిన్సియర్‌గా రాసిన కథలు "ఉద్యోగం", "నిరుద్యోగం" మాత్రమే

ఇటీవల ప్రభ వీక్లీకి పుస్తకాల రివ్యూలు రాస్తున్నాను రాచకొండ కథలమీద నా రివ్యూ చూసి ఇద్దరు ఉత్తరాలు రాశారుట ఒకరు రివ్యూ కరెక్టుగా ఉన్నదనీ, మరొకరు జాస్తిగా మెచ్చుకున్నారనీను రాచకొండ రాసే కథలు చదవటం కొందరికి బొత్తిగా చాతకాదేమోనని నా అనుమానం నా కథలు చదవటమే చాతగాని వాళ్లుండటం నేనెరుగుదును రాచకొండ కథలు చదవటం మరింత కష్టం వేణుగోపాలరావుగారినీ, ఇతర మిత్రులను అడిగానని చెప్పండి

❋

5-7-67

నమస్కారాలు ఈ మధ్య మీకు ఉత్తరం రాద్దామనుకుని, మీ నుంచి త్వరలోనే ఉత్తరం వస్తుందనిపించి మానేశాను మీరు 1న రాసిన ఉత్తరం ఇవాళ అందింది నేను రాసినవి కొన్ని పూర్తిగా మరిచిపోవటం మొదటినుంచీ ఉన్నదే ముఖ్యంగా ఎవరో ఒత్తిడి చేస్తే రాసినవి బుర్రలో నుంచి పూర్తిగా ఇగిరిపోతాయి నేను పనిపెట్టుకుని రాసినవి కూడా మరచిపోతాను గాని, అవి ఎందుకు రాశానో స్పష్టంగా జ్ఞాపకం ఉంటుంది, టెక్నికల్ పాయింట్స్‌తో సహా ఏం మరిచినా నేను మనుషులను మరిచిపోను నేను 7 ఏళ్ళవాడిగా ఉండగా నాతో స్నేహం చేసి కొద్ది మాసాల అనంతరం చనిపోయిన కుర్రాణ్ణి కూడా నేనింకా మరవలేదు

మా అమ్మాయి కిందటి మే నెలలో కాపరానికి వెళ్ళింది - ఢిల్లీ మా ఆవిడ దానిచేత ఇల్లు set up చేయించి రావటానికి వెళ్లింది నేను బ్రహ్మాండంగా వంట చెయ్యగలను గనుక మాకు తిండి ఇబ్బంది ఏమీ కలగలేదు మాకు అంటే నాకూ, మా అబ్బాయికీ నాకీ Blood Pressure trouble మీ విశాఖపట్నం రావటానికి బయలుదేరిన క్షణంలోనే వచ్చింది అక్కడ వుండగా కూడా ఉన్నది బసవరాజుగారికి తెలుసు దానికి ఇంతవరకూ నేను హోమియో మందులు వేస్తున్నాను కొద్దిగా తగ్గింది గాని, పొంతం పోలేదు

రాచకొండ కథలమీద నా రివ్యూ చూసి పాఠకులు రాసిన ఉత్తరాలు నేను కూడా చూశాను (మీకు ఉత్తరం రాసేనాటికింకా అవి అచ్చుకాలేదు ఎడిటరు నాకు టెలిఫోనులో చెప్పాడు) నేను తెగ పొగిడానన్న మిత్రుడు (విశాఖపట్నంవాడే, నేనెరిగిన ప్రభల శర్మ అనుకుంటాను) "భూన భోంతరాళాల మధ్య ప్రతిధ్వనించటం" అన్న దాన్లో గల ఉపమానం అర్థం చేసుకోలేదు అలా ప్రతిధ్వనించేది ఉరుము అసలు ఉరుము - మెరుపునుంచి వచ్చే చప్పుడు - చాలా కొద్దిపాటిది అది మారుమోగి మనకు భయంకరమైన గర్జనగా వినిపిస్తుంది విశ్వనాధశాస్త్రిగారి కథల్లో ప్రత్యక్షంగా ఉండే అంశం కొద్దిపాటిదైనా దానినుంచి స్ఫురించేది చాలా పెద్ద ప్రమాణంలో వుంటుంది నేను ఉరుము మనసులో ఉంచుకుని రాస్తున్నానని ఊహించలేక శర్మ ఆ ఉత్తరం రాశాడు లేక "రోజూ కనిపించే రాచకొండ గురించి ఇంత గొప్పగా చెప్పటమేమిటి ? ప్రొటెస్ట్ చేద్దాం", అనుకున్నాడో మరి ?

శ్రీవాత్సవ కూడా నాకు మిత్రుడే అతని పుస్తకాన్ని నేనీమధ్య కొంచెం ఘాటుగానే విమర్శించాను అతను పగ తీర్చుకోక తప్పదు మధ్య తరగతి బ్రాహ్మణ మనస్తత్వాన్నీ, కమ్యూనిజాన్నీ ఒక మూసలో వెయ్యటం కొంచెం కష్టమేమో ! చోటు లేదు ఉంటా అందరినీ అడిగానని చెప్పండి

*

20-7-67

మీ 17 ఉత్తరం అందింది "సాక్షి" నచ్చని వాళ్ళు దేశంలో వేల సంఖ్యలో ఉన్నారు కాని ఎందుచేతనో పత్రికలన్నీ నేను రాసినట్టే రాశాయి ప్రకటన డబ్బుల కాశించేమో తెలీదు నేను మాత్రం డబ్బులు ఆశించకుండానే, బాపూ, వెంకట రమణలకు తెలియకుండానే 'సాక్షి' గురించి నా అభిప్రాయం - అది సమీక్ష కాదు - పత్రికకు పంపేశాను మామూలు బాక్సాఫీసు హిట్లు చూసేవాళ్ళకు ఈ పిక్చరు పట్టదనే అనుమానంతోనే నేనాపని చేశాను కొందరైనా దాన్ని విలక్షణమైన దృష్టితో చూస్తారని నా ఆశ మీ విషయంలో అది ఎదురొచ్చింది మీ మాదిరిగా ఇంకా చాలామంది నా రాత చదివి పిక్చరు చూసి, నన్ను తిట్టుకుని ఉంటారు కూడా

అసలు విషయమేమిటంటే, ఇంతవరకు తెలుగులో 'సాక్షి' వంటి సృష్టి జరగలేదని నేను గట్టిగా నమ్ముతున్నాను నాకు అటువంటి భావం కలిగించిన మొదటి పిక్చరు చక్రపాణిగారి 'షావుకారు' 'సాక్షి' 'షావుకారు' కన్నా చాలా ఘనమైన దనుకుంటున్నాను

నేను ఆనందం కోసం సినిమాలూ, నాటకాలూ చూడటం మాని ఇరవై ఏళ్ళు దాటింది కంటిన్యుయిటీలో, డైరెక్షనులో, పిక్చరైజేషనులో ఎంత చిన్న సొగసు ఉన్నా నన్ను ఆకర్షిస్తుంది 'సాక్షి'లో అనేక చిన్న చిన్న లోపాలున్నాయి కాని అంతకుమించి చాలా గొప్ప touches ఉన్నాయి అని నేననుకుంటున్నానన్నమాట "రంగులరాట్నం", "మా వదిన" చిత్రాలను "సాక్షి"తో కలపటానికి కూడా నేను ఒప్పుకోను 'సాక్షి'తో పోల్చితే అనేక విషయాలలో - డబ్బు

మెచ్చుకోవటంలో తప్పు చిన్న బాలశిక్షలు దీన్ని అభ్యుదయ చిత్రం అని ఎందుకన్నానో నా వ్యాసంలోనే ఉన్నది దుర్మార్గాలు చేయించి ఆత్మరక్షణ చేసుకోగల పాత్రలూ, ఆత్మరక్షణ చేసుకోలేని పాత్రలూ ఆ చిత్రంలో చాలా స్ఫుటంగా చిత్రించబడ్డాయి విలనులు చివరకు చెంపలేసుకుని అమిత మంచివాళ్ళుగా పరివర్తన చెందటాలూ, ప్రేక్షకులు హాయిగా నిట్టూర్చి ఇళ్ళకు పోగలందులకు బలత్కారంగా సుఖాంతం చేసి తూతూ మేళం వాయించటాలు లేవు పోలికకు చెప్పటం లేదు 'సాక్షి' చెత్త అయితే సత్యజిత్‌రాయ్ పిక్చర్లు ఇందులో ఒకవంతైనా చెత్త అనవలసి వస్తుంది ఇండియాలో సినిమాలు తీయటానికి రాయ్‌ని మించిన all round artist లేడని నేను అనుకుంటున్నాను అతని పిక్చర్లు జనానికి పట్టవు New Statesman లో "A Master-piece from India" అనిపించుకున్న "పథేర్ పాంచాలి" ఈ మద్రాసులో రెండు రోజులు ఆడలేదు "ఇది చిత్రమా ?" అని ప్రేక్షకులు అడిగారు

మొత్తంమీద మనిద్దరి సినిమా అభిరుచులు కలవవనే అనుకోవాలి నాకు 'భక్తప్రహ్లాద' బాగున్నది 'సిరిసంపదలు' కూడా బాగున్నది నా ఉద్యోగం రీత్యా నేను వాటిని మెచ్చుకోవలసిన అవసరం ఏమీలేదు "చంద్రహారం" గురించి అయినా నన్ను రాయమని ఎవరూ అడగలేదు నేనే రాశాను రాయకపోతే నా ఉద్యోగం ఊడేదికాదు నా జబ్బు కొంతవరకు దారిలో పడుతున్నట్టే వున్నది అందరినీ అడిగానని చెప్పండి ఉంటాను

*

13-1-68

నమస్కారాలు మీ ఉత్తరం అందింది మీరేమీ భయపడనవసరం లేదు సాహిత్య ఎకాడమీకి రాకెట్లు తగిలించి పేల్చినా పైకిపోదు వాళ్ళు నాకు ప్రైజ్ ఇవ్వాలని నిర్ణయించటం మిస్టరీయే గాని, వాళ్ళు ఎన్నుకున్న నవల చెత్త నవల

నా ఆరోగ్యం బాగుంటున్నదని గట్టిగా చెప్పలేను ఎక్కువ రాయటం కూడా లేదు జాస్తిగా చదువుతున్నాను పత్రికలు పుట్టగొడుగుల్లాగా పుట్టుకొస్తున్నాయి పత్రికల వాళ్ళు ఏదన్నా రాయమని నన్ను చాలా పీడించుకు తింటున్నారు ఇంత పోరు లోగడ ఎరగను నేను రాయటం తగ్గించేకొద్దీ గిరాకీ పెరుగుతున్నట్టు కనబడుతుంది ఇది చాలా stupid గా వుంది ఈ రోజు రాసేవాళ్ళు కొల్లలుగా ఉన్నారు ఈ మధ్య ఒక పెద్దమనిషి - "సుహాసిని" అని కొత్తగా బయలుదేరిన ఒక మాసపత్రిక ఎడిటరు blank cheque మీద సంతకంచేసి, వద్దంటున్నా ఇచ్చి, జనవరి 5 లోపల ఒక కథ పంపమన్నాడు నా కథలు బాగుండవంటే, బాగాలేకపోయినా ఫరవాలేదనీ, తనకు కావలిసింది నా పేరే అనీ అన్నాడు నా పేరుకు ఎంత విలువ ఇచ్చుకోవాలో తెలీక, కథ బాగా ఉండకపోయినా ఫరవాలేదన్న మనిషికి రాయటం ఇష్టం లేకా, చెక్కు cancel చేసి, జనవరి 3న post చేసేశాను డబ్బు అహం ఇటువంటి రూపాలు తీసుకుంటున్నది

అన్నట్టు వేణుగారినీ, బసవరాజుగారినీ మా అబ్బాయి future education గురించి సలహా అడగాలనుకుంటున్నాను వాడు ఈ యేడు B Sc final కు కూర్చుంటాడు

Physics (Main), Chemistry & Mathematics B Sc వాళ్ళకి మూడేళ్ళ Engineering Course చాలాచోట్ల ఎత్తేసినట్టున్నారు వైజాగ్‌లో ఉందా ? అక్కడ ఇంజనీరింగ్ చదవటం వాంఛనీయమా ? సీట్ తేలిగ్గా వస్తుందా ? Mech లాభంలేదు Electrical గాని, Chemical గాని అయితే బాగుంటుందా ? కొంచెం ఈ వివరాలూ, సలహాలూ కనుక్కుని రాయగలరా ? ఉంటాను

❋

22-2-68

నమస్కారాలు మీ ఉత్తరాలు అన్నీ సక్రమంగా అందుతూనే ఉన్నాయి "జ్యోతి" వార పత్రికలో పడినది A B K పుస్తకంమీద రివ్యూ చిన్న వ్యాసంలాగ ఉండేటట్టు రాశాను వాళ్ళు అట్లాగే రాయమన్నారు వ్యాసాలు ఏవో రాస్తూనే ఉంటున్నాను

ఏమైనా ఈ తరుణంలో రచనలవల్ల ఏమీ ప్రయోజనం లేదని నా అనుమానం ఇప్పుడు కావల్సింది పొలిటికల్ action, collective action ప్రజా నాట్యమండలి సక్రమంగా కొనసాగితే చాలా లాభం వుంది కళల ద్వారా collective impact తీసుకురాగలిగినది ప్రజానాట్యమండలి ఒకటే ఈ పడకకుర్చీ కళలు వట్టి దండగ ఇవి ప్రజలను చేరను కూడా చేరవు

మీరు బెజవాడ వచ్చి కూడా మనం కలుసుకోలేకపోవటం చాలా unfortunate 3 మధ్యాహ్నం నుంచీ చూడవలసినవాళ్ళను చూసే కార్యక్రమం పెట్టుకున్నాం బెజవాడలో నాకు ఇద్దరు మేనల్లుళ్ళున్నారు ఒక మేనకోడలి పెద్దకూతురికి రేపే పెళ్ళి కూడా జరుగుతున్నది నీలంరాజు శేషయ్యగారూ, నార్లవారూ పాత స్నేహితులు వారిని చూసి ఎన్నో ఏళ్ళయ్యింది అందరినీ చూడటానికి నాలుగైదు గంటలు పట్టింది నేను మీటింగుకేసి రావటం కూడా పడలేదు 4 ఉదయమే మేము రైలెక్కి మద్రాసు వచ్చేశాం

హైదరాబాదు విశేషాలు మీరు వినే వుంటారు ప్రైజు తీసుకునేటప్పుడు నన్ను మాట్లాడమన్నారు "తార"కు బహుమానం ఇచ్చినందుకూ, మునిమాణిక్యాన్ని 70వ ఏట గౌరవ సభ్యుడుగా అకాడమీ స్వీకరించినందుకూ వ్యంగ్యంగా అంటించాను నేను బాగా మాట్లాడానని గోపాలరెడ్డిగారూ, రామానుజరావుగారూ వరంగల్లులో (ఆడ) రచయిత్రుల సభ జరిగినప్పుడన్నారట, రామలక్ష్మి చెప్పింది ! వాళ్ళు చివాట్లు తినటానికి కూడా సిద్ధంగా ఉన్నారన్నమాట !

కిందటి సోమవారం ఇక్కడ చిన్న మీటింగు పెట్టి నన్ను అభినందించాలని ప్రయత్నించారు నాకు సాహిత్య ఎకాడమీ చేసినది గౌరవంకాదనీ, అగౌరవమనీ స్పష్టంగా చెప్పాను నిజమేనని అందరూ ఒప్పుకున్నారు కళల వాతావరణమంతా కంపు కంపుగా ఉన్నది ఇందులో కాస్త మనస్సుకు ఆహ్లాదం కలిగించటానికి రావిశాస్త్రిగారి రచనలూ, బాలమురళి సంగీతమూ తప్ప ఇంకేమీ కనిపించటం లేదు మన సంస్కృతికి ఇంత దుర్దశ ఎట్లా పట్టిందీ అర్థం కావటం లేదు రాజకీయ ప్రభావం అనటానికి సందేహంలేదు కళలు రాజకీయాలకు

అతీతంగా ఉండాలిట తలలు మాసినవాళ్ళు చెబుతున్నారు ! ఈనాటి కళల్నీ, వీటిని ఈ స్థితికి తెచ్చిన రాజకీయాలనీ ట్రాక్టర్లు వేసి ఏడుసార్లు దున్నితేగాని ఈ వాతావరణం మారదు అందరినీ అడిగానని చెప్పండి ఉంటాను

❋

4-4-68

ఈసారి ఆంధ్రజ్యోతి వారపత్రికలో ఒక్కసారిగా చాలా మంచి కథలు పడ్డాయి విశ్వనాథ శాస్త్రిగారి కథ చాలా బాగుంది గాని నీతికథ లాగుంది నాకు ఈక్వేషన్లు అంతగా నచ్చవు ఉరిశిక్ష తప్పించగల ప్లీడరూ, చచ్చేవాణ్ణి బతికించగల డాక్టరూ కేవలమూ సింబల్స్‌గా కనబడతారు కాళీపట్నం రామారావుగారి కథ చాలా ఘాటుగా వుంది అయన రెండేళ్ళకో కథ రాస్తారేం ఖర్మ ! అంగర వెంకట కృష్ణారావుగారి కథ కూడా చాలా బాగుంది ఉన్నట్టుండి జానకీ రాణీ కూడా మంచి కథ రాసింది - అందులో Social Implication ఆటే లేకపోయినా కూడా

ఈ మధ్య కడప వెళ్ళి, "సంవేదన" ఆవిష్కరణ చూసి వచ్చాను దాని ఎడిటరు రాచమల్లు రామచంద్రారెడ్డి గట్టివాడే దాదాపు సంచిక అంతా ఒంటి చేతిమీదిగా ఈడ్చి పారేశాడు "సంవేదన" విశాఖపట్నం దాకా వచ్చిందా ? ఏడాదికి 5 రూపాయలు కట్టదగిన పత్రికే అనుకున్నాను

శాస్త్రిగారు "విశాఖ"ను మళ్ళా తేవటం ఎంతవరకు వచ్చింది ?

ఉగాదికి 'కళాకేళి' కాకినాడ నుంచి వస్తుందనుకున్నాను అదీ జాడలేదు

నిజమైన సాహిత్య పత్రికలు ఎన్ని వచ్చినా అన్నిటికీ చందా కట్టటం పాలసీగా పెట్టుకున్నాను అవి కమర్షియల్‌గా ఎట్లాగూ నడవవు 5 లేక 6 వందలమంది చందాదారులతో ఖర్చులు గిట్టుబాటయ్యేటట్టుంటే దేశం సాహిత్య పత్రికలను పోషించలేకపోదు ప్రకటనలూ పాడూ అవసరం కూడా ఉండదు

విశేషాలేమీ లేవు అందరినీ అడిగానని చెప్పండి ఉంటాను

PS నిన్న సాయంకాలం "సుడిగుండాలు" చూపించారు పిక్చరంతా మామూలుగానే ఉన్నదిగాని చివరలో ఈనాటి చెత్త సాహిత్యాన్నీ, సెక్సు పత్రికలనూ, డిటెక్టివ్ సాహిత్యాన్నీ, బూతుపోస్టర్లనూ, వీటిని చూసీ చూడనట్టు ఊరుకునే ప్రభుత్వాన్నీ బాగా తూర్పార బట్టారు చివర రెండు రీల్సు నాకు విందులాగా ఉన్నాయి పిక్చర్‌కు డబ్బు వచ్చేదీ, రానిదీ చెప్పటం కష్టం

❋

22-5-68

నమస్కారాలు మీరు తిరిగి విశాఖపట్నం చేరుకున్నట్టు వేణుగోపాలరావు గారు చెప్పారు ఆయన ఈసారి మా ఆఫీసుకేసి రాలేకపోయారు మా ప్రసాద్‌కు application form

పంపిస్తామన్నారు జ్ఞాపకం ఉంటుందనుకుంటాను నాకు 'భారతి' రాదు కాని మీరు చెప్పిన మార్చి సంచికను చక్రపాణిగారు నాకు పంపారు రామమోహనరాయ్ రాసింది చదివాను కాని అందులో ఒక్క వాక్యం కూడా నా తలలో చిక్కుకోలేదు కాకపోయినా రచయితగా నాకు ముఖ్యమని తోచే పాయింట్స్ వేరే ఉంటాయి విమర్శకులుగా వాళ్ళు చూసేవి వేరు ఉదాహరణకి చెబుతాను వారం పదిరోజుల క్రితం ఒక రచయిత, నా రచన convincing గా ఉంటుందని - అది ఒక విశిష్టత అన్నట్టు - రాశారు నా దృష్టిలో అది minimum qualification అన్ని రచనలూ convincing గానే ఉండాలిగద ! నాకు తెలిసినంతవరకు రాసేవాడూ, విమర్శించే వాడూ ఒక మెట్టుమీద ఎప్పుడూ ఉండరు

నేను రాసిన వ్యాసాలన్నీ దొరకటం అసంభవం నా దగ్గిర ఒక్కటి కూడా లేదు నా కథల కటింగులు కూడా నేను ఉంచుకోలేదు ఎవరెవరో అభిమానులు తీసి ఉంచినవి పుస్తకరూపంలోకి వచ్చాయి ఇటీవల కథలను గురించి కొంచెం శ్రద్ధపడ్డాను గాని, మామూలు వ్యాసాలను గురించి శ్రద్ధ పడలేదు నన్ను వాటికోసం ఎవరూ అడగలేదు కూడా

"కళాకేళి" నాకు కొంచెం కూడా నచ్చలేదు దానికి నన్ను ఏదన్నా రాయమని సోమసుందర్ రాశాడు ఒక satire రాస్తూ, ఎందుకైనా మంచిదని, అది కొంచెం cheap గా ఉన్నదని రాశాను సోమసుందర్ దాన్ని నాకు తిప్పి పంపుతూ, "చీప్‌గా ఉన్నది" అని ఒప్పుకున్నాడు ! ఆ satire కళాకేళిలో పడకపోవటం నాకు పెద్ద రిలీఫ్ అన్నమాట సోమసుందర్ మంచి లిటరరీ జర్నల్ నడపటం చాలా అనుమానాస్పదం Narcissism complex కూ సాహిత్యానికీ జతకుదరదేమో !

పెళ్ళి చేసుకోకుండా careers లో ప్రవేశించే స్త్రీలనూ, పత్నీత్వమూ మాతృత్వమూ career గా పెట్టుకున్న స్త్రీలనూ ఒకే రకం నీతికి అంటగట్ట యత్నించే మందమతులను చూస్తే చిరాకేస్తున్నది అటువంటి చిరాకులో ఆ కథ (చెడిపోయిన మనిషి) రాశాను సాంఘిక సంబంధాలన్నీ కళ్ళ ఎదుట తారుమారవుతున్నా చూడలేని వాళ్ళున్నారంటే ఆశ్చర్యంగా వుంటుంది

నేను శతవిధాల వరంగల్లు జిల్లా రచయితల సమావేశానికి వెళతాను టిక్కెట్టు కూడా కొన్నాను కాని బెర్తు దొరికేదీ లేనిదీ రేపు రాత్రికి కాని తెలీదు బెర్త్ దొరికితే ఎల్లుండి మధ్యాహ్నం హైదరాబాద్ ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరి 25 ఉదయం 5కు వరంగల్లు చేరుతాను

రామారావుగారిని సమావేశాలు తప్పక ఏర్పాటు చెయ్యమనండి వేణుగారినీ మిగిలిన మిత్రులనూ అడిగానని చెప్పండి ఉంటాను

*

18-6-68

నమస్కారాలు మీ 16 ఉత్తరం ఇప్పుడే అందింది MIT లో Electronics శాస్త్రిగారు కాకినాడ M V శాస్త్రిగారికి దగ్గర బంధువేనని నిన్న సాయంకాలమే తెలిసింది అలా అయితే

ఆయన నా పేరు విని ఉండే అవకాశం వుంది పరిచయం లేకపోయినా M V శాస్త్రిగారు నన్నెరుగును కొంతకాలం క్రితం ఇక్కడ జరిగిన పెళ్ళిలో నేను MIT శాస్త్రిగారిని బహుశా కలుసుకుని కూడా ఉంటాను అందుచేత ఆయనతో నేను మాట్లాడతాను

మావాడు First Choice Electronics, రెండో Choice Instrumental Technology ఇచ్చినట్టు జ్ఞాపకం వాడి దృష్టి Electronics మీదే వుంది వేణుగారు చెప్పినట్టు Bangalore Institute of Science క్కూడా apply చేయిస్తాను మావాడు చాలామంచి మార్కులే వస్తాయనుకుంటున్నాడు Actual గా ఏ grade వస్తుందో మరి ?

వరంగల్లు జిల్లా రచయితల సభకు ఒక్కపూటే వెళ్ళాను అఖిల భారత తెలుగు రచయితల భాగోతం గురించి వింటుంటే, వరంగల్లులోనే మంచి spirit ఉన్నదనిపించింది అ భా సభలకు పోవటం లేదా అని అక్కడ ఎవరో నన్ను అడిగారు అంత పెద్ద సభలకు పోలేను అందుచేత చిన్న సభకు వచ్చానన్నాను నిజానికి అ భా వాళ్ళు ఖర్చులిస్తాం రమ్మనీ, గౌరవిస్తామనీ అన్నారు వాళ్ళచేత గౌరవించబడటం నాకు ఏమీ మనస్కరించలేదు వెళ్ళి వచ్చినవాళ్ళు తిడుతున్నారు నేనే బుద్ధిమంతుణ్ణి !

"ఉభయ భ్రష్టుడు" మీద పాఠకుల రియాక్షన్ (వీక్లీలో లేఖలు) నేను అనుకున్నట్టుగానే ఉందిగాని, ఒక్కరు మాత్రం, చివరదాక జాలి పుట్టించిన పాత్ర చివరిలో పాడయిందన్నట్టు రాశారు జీవితంతో అంత ఘర్షణ పడి ఓడిపోయినవాడు చిట్టచివరకు డబ్బు పెట్టి కొనుక్కుని తృప్తిపడటం వాడి tragedy కి పరాకాష్ఠ అని నేను అనుకున్నాను సాధారణంగా మనం అనుకున్నవి పాఠకులకు కనబడవెందుకో !

వరంగల్లు విశేషాలు అడిగారు పెద్ద విశేషం కాళోజీతో 21/2 గంటలు కులాసాగా కబుర్లు చెప్పుకున్నాను నేను పాల్గొన్న మీటింగు "కథ - నవల - విమర్శ"కు సంబంధించినది అధ్యక్షుడు సంపత్కుమారాచార్య అనుముల కృష్ణమూర్తి, ఇంకెవరో ఇద్దరు మాట్లాడారు మేమంతా ముందే వ్యాసాలు రాసి పంపాము వ్యాసాలు local పేపరులో అచ్చయ్యాయి అదే చదివాను ఊరికే చదివితే చాలదు, కొంచెం మాట్లాడమన్నారు "చదివే వాడుగా" మాట్లాడాను మనిషి చదవటం ద్వారా పెరుగుతాడు గాని, ఎన్ని బళ్ళు రాసినా వెంట్రుకవాసి పెరగడని చెప్పాను విమర్శకు alsolute ప్రమాణం లేదనీ, ఏ రచననూ ఎవడూ విమర్శించకుండా చదవడనీ, ప్రతి వాడికీ నచ్చని రచన లుంటాయనీ, చదువుకు పోయినకొద్దీ విమర్శించే శక్తి కూడా పెరుగుతుందనీ ఈ ధోరణిలో క్లుప్తంగా మాట్లాడాను కృష్ణమూర్తిగారి 'పనిదాని కథ' చాలా బాగున్నది వేణుగారిని అడిగానని చెప్పండి ఉంటాను

❋

11-11-68

నమస్కారాలు మీ ఉత్తరం అందింది నా వోట్లు రామలక్ష్మికీ, వెంకట సుబ్బయ్యగారికీ ఇవ్వటానికి అదివరకే నిశ్చయించుకున్నాను వోటుకోసం అందరూ అడిగారు గాని, నాకు తెలిసినవాళ్ళు వీళ్ళే !

మా ప్రసాద్ సితార్‌తో చదువు పాడు చేసుకోవటం నాకంతగా ఇష్టం లేదు వాడు పరీక్షలప్పుడు కూడా relax కావటానికి ఓ అరగంట వాయించుకుంటే నేను అభ్యంతరం చెప్పను కాని social functions లో వాయిస్తే ఇక mind చదువుమీదికి పోదు ఆ మధ్య వాడి స్నేహితులు చిన్న పార్టీ ఏర్పాటుచేసి వాడిచేత 21/2 గంటలు సితారు వాయింపించారట అందులో వున్న ప్రమాదం వాడికీ తెలుసు అందుకని దాని జోలికిపోక చదువుకోమని రాశాను డిసెంబరు సెలవుల్లో నెలరోజులూ సితారే వాయిస్తాడు summer holidays అంతా వాడికి మరో పని వుండదు వాడికి వ్యక్తిత్వం లేకపోవటమేమిటి ? సైన్సులోనూ, సంగీతంలోనూ నాకు వాడు చాలా విషయాలు చెప్పగలడు నాకున్న వ్యసనాలు కూడా ఆ రెండే అందుచేత వాటిలో నన్ను ఇప్పటికే మించి ముందుకు వెళ్ళాడు

కళాకేళిలో "తార" గురించి రాసినది సోమసుందరే నాది వెధవ సాహిత్యమని మర్యాదగా చెప్పాడు భారతం వెధవ సాహిత్యమేననీ, కన్యాశుల్కం (పూటకూళ్ళమ్మతో సహా ముగ్గురు వితంతువులు) వెధవ సాహిత్యమేననీ నేనిక్కడ ప్రచారం చేస్తున్నాను

"పంచ రత్నాలు" నేను సంతృప్తిగా రాయని రచన నా గొంతుమీద కత్తిపెట్టి రాయించాడు ఆఫీసునుంచి ఇంటికి వచ్చి రాత్రి భోజనం చేసేలోపుగా బరికేశాను ఆ theme తో ఒక నవల రాద్దామని ఆశపెట్టుకుని ఉన్నాను దాని గతి అలా అయింది వేణుగారు ఇక్కడికి వచ్చినప్పుడు నన్ను కలుస్తారనుకుంటాను ఆయననూ, వెంకటప్పయ్యగారినీ, ప్రసాద్‌గారినీ అడిగానని చెప్పండి విశేషాలింకేమీ లేవు

*

20-3-69

నమస్కారాలు మీ ఉత్తరం అందింది మీరంతా బాలమురళి పాట కచేరీకి వెళ్ళినట్టు మా ప్రసాద్ రాశాడు తరువాత మీ ఇంట ఒక get together కూడా ఏర్పాటు చేశారట బాలమురళి పాట కచేరీ విజయనగరంలో ఎప్పుడు జరిగింది ? అతను ఎంత నిర్లక్ష్యంగా పాడినా చాలా బాగా పాడతాడు అరవవాళ్ళు అతన్ని బాగానే appreciate చేస్తారు అతనొక పాటగాడే కాదన్నట్టు చాలాకాలం నటించారు కాని ఆ నటన సాగలేదు సాధారణ సంగీతప్రియులు అతని శక్తి అర్థం చేసుకుని ప్రచారం చేశారు ఏ కళ అయినా నిజమైన రసికుల ద్వారా ప్రచారం అవుతుందిగాని, నిపుణుల ద్వారా కాదేమో ! కళాకారుడు గొప్పవాడని లోకమంతా కోడైకూసినాక, అతని గొప్పతనం చెప్పటానికీ, విశ్లేషించటానికీ నిపుణులు ముందుకు వస్తారు నాకిది చెడ్డమంట జయశ్రీ, ఖుర్షీద్‌లు మైనరు వేషాలు వేస్తుండగా చూసి వాళ్ళు పైకి వస్తారని చెప్పాను కొత్తగా రాసేవాడిలో దాగివున్న గొప్పదనం కనిపెట్టగలవాడే నిజమైన పరిత మీరు ఒప్పుకుంటారా?

రాసే శక్తి వెనకబడ్డాక విమర్శకుడు కావటం లోకమంతటా జరుగుతున్నదే ఆ కారణం చేతనేనేమో నన్ను పత్రికలవాళ్ళు విమర్శకుడుగా వాడుకుంటున్నారు

"కళాకేళి" నాక్కూడా కొన్ని సంచికలు పంపారు నన్ను రాయమంటే రాయలేదు సోమసుందర్‌గారి ధోరణులు నాకూ అదో మోస్తరుగా ఉంటాయి ఉన్నంతలో "సృజన" చాలా నయం

ఇంకో రెండు వారాల్లో నేనూ మా ఆవిడా ఢిల్లీకి వెళ్ళి, మా అమ్మాయి పరీక్షలయ్యేదాకా, అంటే 4, 5 వారాలు అక్కడే వుండి తిరిగి రావాలనుకుంటున్నాము

విశేషాలేమీ లేవు వేణుగోపాల్‌గారినీ, ప్రసాద్‌గారినీ, ఇతర మిత్రులనూ అడిగానని చెప్పండి

❋

9-6-69

నమస్కారాలు మీ ఉత్తరం అందింది నా ఆరోగ్యం ప్రస్తుతం బాగానే ఉన్నది నా భార్య ఆరోగ్యమే అంత బాగాలేదు డాక్టరుకు చూపిస్తే జబ్బేమీ లేదంటారు విటమిన్లు రాసిస్తారు కాని ఒంట్లో ఏవో ఛిద్రాలు ఉంటూనే ఉంటున్నాయి నీరసం, తల బరువుగా ఉండటం, పాదాలు మంటలూ, నిద్రపట్టక పోవటం వగైరాలతో బాధపడుతున్నది

మా రోహిణీప్రసాద్ 19న బయలుదేరి వైజాగ్ వస్తున్నాడు మిమ్మల్ని గురించీ, వేణుగోపాల్‌గారిని గురించీ అనుకుంటూనే ఉంటాడు

సోషల్ రిఫాం సంగతి చెప్పకండి తప్పనిసరి పరిస్థితుల్లో కొన్ని పనులు చేసి గొప్ప సంస్కర్తలని పేరు తెచ్చుకుంటారు కన్యాశుల్కంలో కరటకశాస్త్రి యాంటీనాచ్, ప్రోనాచ్ గురించి చెబుతాడే అందరూ అదే మాదిరి

అదీగాక మంత్రాల పెళ్ళిళ్ళు గ్లామరస్‌గా ఉండేటట్టు చేసినవి సినిమాలు ఇన్ని వందల సినిమాలలో ఒక్క రిజిస్ట్రేషన్ పెళ్ళి ఉందా ? లేదు, ఉండదు పెళ్ళికూతురు సినిమాస్టార్‌లాగా make up కావాలంటే "మాంగల్యం తంతునానేన" అని చదవాలా ? రిసెప్షన్ ఏర్పాటుచేసి, అందులో make up చేసుక్కూర్చోరాదా ?

అసలు మన పెళ్ళి తంతు tribal అన్న విషయం చాలామందికి తెలీదని నేను కనిపెట్టాను నాకు 16వ ఏటనే తెలిసిన ఈ విషయం చదువుకున్న వాళ్ళక్కూడా ఎందుకు తెలీదో నాకు మిస్టరీగా వున్నది

మీరు శ్రీ రాళ్ళపల్లి గౌరీపతిశాస్త్రిగారిని గురించి రాశారు మా ఆఫీసులో నాకు తెలిసినమటుకు ఏమీ అవకాశం లేదు చందమామకు వేరే ప్రూఫ్ రీడర్లు లేరు శ్రీదాసరి సుబ్రహ్మణ్యంగారూ, నేనూ కలిసిచూస్తాం మా standard punctuation, lines adjustments మొదలైనవి ఇతరులవల్ల కావు

మా అమ్మాయీ, అల్లుడూ ఇక్కడే ఉన్నారు B N గారింట్లో పెళ్ళికి నేనూ వెళ్ళలేదు బద్ధకించాను గోపాలరెడ్డి ప్రచురించిన "కన్యాశుల్కం" నేను ఢిల్లీలో ఉండగానే వచ్చింది నా కన్యాశుల్కం నోట్స్ పడుతున్న సంచికలింకా నాదాకా రాలేదు అందరినీ అడిగానని చెప్పండి ఉంటాను

❋

31-10-69

నమస్కారాలు మీ కార్డు అందింది సంవేదన కూడా వచ్చింది వాటికోసం మీరు ఎదురుచూస్తున్నారు నేను బోర్ అయిపోతున్నాను ఈ రకం publicity నాకు పడదు ఈ పాయింటుమీద నన్ను ఎవరైనా సైకో ఎనలైజ్ చేయవచ్చు

మావాడు ఈ ఉదయం వైజాగ్ చేరి వుంటాడు ఈ ఉత్తరం అందేలోగా మిమ్మల్ని కలవొచ్చు మీరు మరచిపోయిన వస్తువు గురించి నాకు స్పష్టంగా తెలీదు అది మీకు చేరుతుందనుకుంటాను

గోఖలే వేణుగారికి శ్రీశ్రీ negative ఏదో ఇచ్చినట్టుంది అది భద్రంగా తిరిగి గోఖలేకు చేరేటట్టు చూడమని చెప్పండి ఆంధ్రజ్యోతిలో (దీపావళి సంచిక) మీ వ్యాసమూ, రామారావుగారి కథా, N S ప్రకాశరావు కథా చదివాను చాలా బాగున్నాయి ఇంకా చదవవలసినవి ఉన్నట్టున్నాయి

శ్రీశ్రీ సన్మానం ఏర్పాట్లు చురుకుగా జరుగుతున్నాయనుకుంటాను ఉంటాను అందరినీ అడిగానని చెప్పండి

❋

14-11-69

నమస్కారాలు మీ కార్డు అందింది వాల్మీకి రామాయణం గురించే నేను రాసింది అది ఖచ్చితంగా తుక్కు పుస్తకమే దాన్ని DK వాళ్ళు తగలేస్తే నాకు చీమకుట్టినట్టు కూడా లేదు అయితే వాల్మీకిని నేను నిందించలేను ఇపుడు వాల్మీకి రామాయణంగా చలామణీలో వున్న 24,000 శ్లోకాలలో వాల్మీకి రాసినవి 10,000 మాత్రమే బాలకాండా, యుద్ధకాండా ప్రక్షిప్తాలంటున్నారు పండితులు ఆమోదించే ప్రక్షిప్తాలు కొన్ని ఉన్నాయి నేను స్వయంగా ప్రక్షిప్తాలనుకుంటున్నవి ఇంకా ఉన్నాయి నా జాతకానికి విశ్రాంతిగా బతికే యోగం ఉంటే వాల్మీకి రాసి ఉండదగిన 10 వేల శ్లోకాలూ విడిగా తీయాలన్న ఒక ఆశయం లేకపోలేదు అప్పుడు రామాయణం ఇంత తుక్కుగా ఉండదేమో ! తరువాత, మరొకటేమిటంటే కవిగా వాల్మీకితో పోల్చదగినవాడు మరొకడు లేడంటారు నాకు తగినంత సంస్కృత పరిజ్ఞానం లేకపోయినా వాల్మీకి కవిత్వం గొప్పదనే నాకూ అనిపిస్తుంది

కవిగా కాళిదాసు కూడా అఖండుడే అతగాడు వాల్మీకిలాగా రాయటానికి ప్రయత్నించాడంటారు పండితులు నాటకాలు రాసిన కాళిదాసు తనకు ముందుండిన భాసుణ్ణి అనుకరించటానికి ప్రయత్నించాడు ప్రయత్నించి వెల్లకిలా పడ్డాడు భాసుడి నాటకాలు చదివి కాళిదాసుని చదివితే చక్కెర తిని దంటు నమిలినట్టుంటుంది కొందరు ఈ మాట తెలిసి కూడా చెప్పరని నా అనుమానం

వాల్మీకి రామాయణం గాని, కాళిదాసు రచనలుగాని ఇంకా బతికి ఉన్నాయనటానికి రుజువేమిటి ? అవి లైబ్రరీలలో దొరకటమా ? వాల్మీకి రామాయణంలో ఏమున్నదో ఎవరికీ తెలీదు వాల్మీకి రామాయణం రాసి దానికి మంచి ప్రచారం రాగానే దానికి భిన్నంగా అనేక

రామాయణాలు వెలువడ్డాయి భాసుడి "ప్రతిమ" నాటకం వాల్మీకి దానికి భిన్నం భాసుడు క్రీస్తుపూర్వం 4వ శతాబ్ది వాడనటానికి ఆధారాలున్నాయి భాసుడి నాటకంలో కూడా బాలకాండ, యుద్ధకాండ కథలు లేవు 'ఆదౌ రామతపోవనాభిగమనం' అన్న శ్లోకం బాలకాండ ప్రక్షిప్తమని స్పష్టం చేస్తున్నది "ప్రతిమ" రామ తపోవనాభిగమనంతోనే ఆరంభమవుతుంది

ఇదంతా తోచక రాశాను నా నికరమైన అభిప్రాయమేమంటే మనం పాత సాహిత్యాన్ని వదిలేస్తే ఏ పేచీలేదు దాన్ని గుడ్డిగా చదవనైనా చదవకుండా ఆరాధిస్తే నష్టం ఉన్నది గురజాడ అప్పారావు కన్యాశుల్కంలో శిష్యుడిచేత 'కుమార సంభవం' శ్లోకాలని వేళాకోళం చేయించి, కరటకశాస్త్రిచేత సంస్కృతాన్నే ఈసడింపజేశాడు చాలామంది పండితులకు కోపంవచ్చి ఉండాలి వేణుగారినీ, ప్రసాదుగారినీ అడిగానని చెప్పండి ఉంటాను

*

31-12-69

నమస్కారాలు మొట్టమొదట మీ అందరికీ నూతన సంవత్సర శుభాకాంక్షలు

మీ ఉత్తరం కొంచెం లేటుగా ఇప్పుడే అందింది 'చందమామ'లో ఉన్నందుకు మీరు నన్ను చూసి జాలిపడవద్దు నేను జర్నలిస్టుగా ఈ మాత్రం బతికి వున్నానుగాని సాహిత్యంలోనే అయితే ఏనాడో మాడిపోయేవాణ్ణి జర్నలిస్టునని సాహిత్యం గురించి నాకు చిన్న చూపేమీ లేదు నాకున్న ఆస్థి అంతా దానిలోనే

మీరు ఆదిమ కమ్యూనిజం అనేది సామాజిక వ్యవస్థ ఏర్పడిన ఆటవిక దశే సామాజిక వ్యవస్థ ఏర్పడని దశ గురించి ఎవరికీ ఏమీ తెలీదు భాష ఏకాక్షరిగా ఉండేదనీ, భాషను సమగ్రం చెయ్యటానికి అభినయం ఉండేదనీ Prof Morgan అన్నాడు చిత్రమేమిటంటే సంస్కృతంలో ఏకాక్షర నిఘంటువున్నది వేదాల్ని అభినయంతో చదువుతారు వేదం పుట్టినది ఆదిమ సమాజంలోనే అయినా, అంతకుముందు దశ తాలూకు లక్షణాలు వేదకాలపు ఆర్యులు వదిలించుకోలేదేమో !

సాహిత్యం గురించి నేను రాసిన వ్యాసాలు తాత్కాలిక ప్రయోజనం కోరి రాసినవే గాని, వాటికి దీర్ఘకాలపు విలువ ఉంటుందని నేననుకోలేదు అందుచేత ఒక్క వ్యాసం కూడా నేను దాచలేదు రమణారెడ్డి అన్ని వ్యాసాలు సంపాదించటమే నాకు ఆశ్చర్యమయింది

'విధి లిఖితం' చదివి చూడండి ఆ కథ విధి లిఖితాన్ని ధిక్కరించినవాణ్ణే సమర్థిస్తుంది ఇక అతీతశక్తులు లేకుండా జానపద సాహిత్యం ఉండనే వుండదు చీనా కమ్యూనిస్టులు అచ్చుగా దయ్యాల కథలే ఒక పుస్తకంగా వేశారు "సర్వనాశనం"లో పిశాచాలున్నాయి గాని, అది హాస్యకథ చందమామ కథల్లో వచ్చే దయ్యాలూ, పిశాచాలు పిల్లల్ని భయపెట్టవు

ఫిబ్రవరిలో నేను రావటం మూడువంతులు ఖాయమే నేనూ, నా భార్యా, మా అమ్మాయి కూడా రావచ్చు వాళ్ళు ఇచ్చే ఖర్చులు చాలకపోతే పైన కొంత వేసుకుని వస్తాం ఇబ్బంది లేదు కాకపోతే అటునుంచి మాకు ఎవరన్నా sleeper berths తీసివుంచాలి అక్కడ ఉండే రెండు రోజులకు Lodging ఇబ్బంది ఉండదనుకుంటాను

మా ప్రసాద్ తన ఆత్మసంతృప్తి కోసం అప్పుడప్పుడూ చదువుతున్నాడు సితార్ విరిగిపోయింది అందుచేత దానితో గంటల తరబడి కాలక్షేపంచేసే అవకాశం లేదు

ఈమని కచేరీకి వెళ్ళాం బాలమురళి దానికి మా ప్రసాద్ ఒక్కడే వెళ్ళాడు మా అమ్మాయికి జ్వరం తగులుతున్నది అయినా 6 15 నుంచీ చివరిదాకా రేడియోలో విన్నాం

అందరినీ అడిగానని చెప్పండి ఉంటాను

❋

5-3-70

నమస్కారాలు మీ ఉత్తరం అందింది మేం అక్కడికి వచ్చి ఏమీ strain కాలేదు మాకు చక్కని ఏర్పాట్లు జరిగాయి ఎంత శ్రమపడితే ఆ ఫంక్షన్ జరిగిందో నేను ఊహించగలను అయితే దాన్ని గురించి దుష్ప్రచారం చాలా జరిగింది ఇంకా జరుగుతూనే వున్నది కార్యభారం ఎవరిమీద వేసుకున్నా ఏవో పొరపాట్లు జరగకపోవు వాటిని గురించి విమర్శించేవాళ్ళూ ఉండనే ఉంటారు కాని ఇదంతా పత్రికలకి ఎక్కవలసింది కాదు విశ్వనాథశాస్త్రిగారు "విజయభాను" లో ఏదో రాశారన్నారు నేను ఎలాగో దాన్ని miss అయాను ఆ పత్రికలో శ్రీశ్రీ సన్మానం గురించి రాసినదంతా చదువుతూనే వస్తున్నాను "జయప్రద" నాకు రాదు మీరు పంపిస్తే సన్మానసంఘం వారు ఏం రాశారో చూస్తాను కటింగు పంపితే చాలు

మీరు చెప్పే మిషను సాయిబు కుండే పాటి జ్ఞానం "గొప్ప" వాళ్ళలో ఎందరికుంటుందంటారు ?

నా పేరు ఆహ్వానసంఘంలో ఉన్నది నేను గెస్టుననీ, నాకు మర్యాదలు జరగాలనీ ఏనాడూ అనుకోలేదు ఆ ఫంక్షనులో నిజంగా పెద్ద లోపాలు జరిగితే వాటి బాధ్యత నాకు కూడా ఉన్నట్టే బాధపడేవాణ్ణి కొన్ని విమర్శలు నా చెవినా పడ్డాయి వాటికి నాకు తెలిసిన సమాధానాలు నేను చెప్పాను

1) శ్రీశ్రీని ప్రజల కంటపడకుండా ఆ రోజు ఎవరో దాచారని ! శ్రీశ్రీ సాహిత్య గోష్ఠికి వచ్చిన క్షణాలనుంచీ Research Scholars Hostel నుంచి మేం బయలుదేరే దాకా నేను చూస్తూనే వున్నాను దానికీ ఊరేగింపుకూ మధ్య శ్రీశ్రీని ఎవరో దాచిఉండాలి ! "ఎవరు దాచారు ? ఎవరి నుంచి దాచారు ?" అని అడిగాను సన్మానసంఘం ఆఫీసులో శ్రీశ్రీని చూడాలని చాలామంది చేరారుట వారికి శ్రీశ్రీ కనిపించలేదుట 2 నుండి 5 దాకా రెస్ట్ తీసుకుని వుంటాడు

2) కాళీపట్నం రామారావుగారిని శ్రీశ్రీకి పరిచయం చెయ్యలేదనీ ఆయనను ఒక 'గుమాస్తా'గా చూశారనీ ఒక విమర్శ రామారావుగారు నాకే కొద్ది క్షణాలు తప్ప అందలేదు ఆయనకు "ముందుకు" వచ్చే మనస్తత్వం బొత్తిగా లేదు

3) నాచేత పుస్తకాలు ఆవిష్కరించక, సావనీరు ఆవిష్కరింపజేశారని ఒక విమర్శ అందులో నాకేదో పెద్ద అవమానం జరిగినట్టూ దానివెనక ఏదో గూడుపుఠానీ ఉన్నట్టూనూ!

వీటన్నిటినీ సీరియస్‌గా తీసుకోనవసరం లేదు వేణుగారినీ, ప్రసాదుగారినీ, విజయగారినీ అడిగారని చెప్పండి ఉంటాను

❋

21-3-70

నమస్కారాలు నేను విశాలాంధ్రలో సోమసుందర్ వ్యాసం చూడలేదు అతన్ని సీరియస్‌గా తీసుకోవటం వృధా అనుకుంటాను అతను ఒక వర్గం రచయితలకూ, రచనలకూ ప్రాతినిధ్యం వహిస్తున్నాడు అభ్యుదయ ఉద్యమం అతనికి హాబీ అని నాకు ఇరవైఏళ్ళ క్రితమే తెలుసు అతని వాస్తవ జీవితంలో దానికి స్థానం ఉన్నట్టు కనబడలేదు ఆ ఉద్యమ ఊపులో రాదగినంత పైకి వచ్చేశాడు పరిస్థితి బాగా మారింది రచనలో చిత్తశుద్ధి అన్నదానికి పరీక్ష వస్తున్నది బోలుసరుకు బయటపడక తప్పదు కమ్యూనిస్టు రంగులో విశాలాంధ్ర కూడా బోలుగానే తయారైంది రెండేళ్ళక్రితం సోమసుందర్ 'తార' మీద విమర్శ రాసి ఇస్తే విశాలాంధ్రవారు "కుటుంబరావు మీద ఇలా రాస్తే వేసుకోం" అని పంపారట దాన్నే అతను తన కళాకేళిలో వేసుకున్నాడు కాని ఈనాడు విశాలాంధ్రకు నా పుస్తకాల రివ్యూలు (ప్రభ వారపత్రికవి) నచ్చడం లేదు మరీ తీవ్రంగా ఉన్నాయిట అసలు తీవ్రత అనేది నా మనసులో ఏ కోశానా లేకుండానే రివ్యూలు రాస్తున్నాను మంచీ, చెడూ చూడటమే, వేరు చెయ్యటమే విమర్శ అనుకుంటున్నాను చెడుదాచి మంచిని ఎగదొయ్యటమూ, చెడును కూడా మంచిగా చూడడమూ విమర్శ అవుతుందని విశాలాంధ్ర వారి ఉద్దేశమేమో !

రేపు వచ్చే విశాలాంధ్రలో రమణారెడ్డిగారి సమాధానం సంపాదించి చదవటానికి ప్రయత్నిస్తాను అప్పుడు సోమసుందర్ ధోరణి కూడా తెలిసిపోతుంది ఈ మధ్య నాకు విశాలాంధ్ర రావటం లేదు వారి ప్రగతీ, రాజకీయవార పత్రికా వస్తున్నాయి

శ్రీశ్రీ సన్మానమప్పుడు దిగంబరకవులు మైక్‌మానియా చూపారని నేననుకోలేదు ఉదయం జరిగిన గోష్ఠి (చర్చ) లో ఎవరైనా స్వేచ్ఛగా మాట్లాడే అవకాశం వుంది వాళ్ళకు, ముఖ్యంగా జ్వాలాముఖికి applause హెచ్చుగా రావటం కొందరికి బాధగా వుండి వుండవచ్చు

నేను మొదలుపెట్టిన ఫార్ములా సాహిత్యానికి సంబంధించినది కాదు, జర్నలిజంకు సంబంధించినది 1951 పొడుగునా ఆంధ్ర వారపత్రికను నేనే చూశాను ఆ పత్రికలన్నీ తీసి చూడవచ్చు అప్పుడది వంటింటి పత్రిక కాదు అందులో చవుకబారు రచనలేమీ లేవు బ్రహ్మాండమైన సీరియల్స్ (అనువాదాలు) వేశాం ఎన్నడూ పత్రికలలో రాయనివాళ్ళ రచనలు వేసి కొత్త రచయితలకు అవకాశం ఇచ్చాం ఆ ఏడాదిలో పేరున్న రచయితల కథ ఒక్కటి కూడా వేసినట్టు గుర్తులేదు తరువాత ఖ్యాతి తెచ్చుకున్న కథకుల మొదటి కథలు నేనే వేసినందుకు గర్వంగా చెప్పుకుంటాను ఇప్పటి పత్రికలు సాహిత్యమూ కాదు, జర్నలిజమూ కాదు - racket

మా ప్రసాద్ పాడగలడు కాలేజీ పోటీలలో పాడి మొదటి బహుమానాలూ, రెండో బహుమానాలూ చాలాసార్లు తెచ్చుకున్నాడు అయితే పాటగాడుగా పైకి రావాలని వాడికి లేదు వాడి దృష్టి అంతా సితారుమీదే చిన్నతనం నుంచీ తగిన వాతావరణం కలిగిస్తే ప్రతి బిడ్డకూ ఏదో ఒక కళలో తప్పక అభినివేశం ఏర్పడి తీరుతుంది అది పెద్దయ్యాక కలగటం దాదాపు

అసంభవం చాలామందికి పిల్లలు పెద్దవాళ్ళయ్యేదాకా వాళ్ళకు తిండీ, బట్టా తప్ప ఇతర అవసరాలుండవన్న అపోహ వుంటుంది ఇది చాలా తప్పు 3-7 ఏళ్ళ మధ్య ప్రతిబిడ్డకూ ఏదో ఒక కళమీద గురి కుదురుతుంది పెద్దవాళ్ళు అవకాశం ఇవ్వాలి అందరినీ అడిగానని చెప్పండి ఉంటాను యువ ఇకనుంచీ మద్రాసునుండి వస్తుంది రామారావుగారికి చెప్పండి

*

17-6-70

నమస్కారాలు నిన్న మీరు రాసిన ఉత్తరం అందింది విశాఖ రచయితల్లో రెండు రంగులవాళ్ళు చాలాకాలంగా ఉన్నారనుకుంటాను రంగులు చీలే తరుణం వచ్చినమాట నిజమే మరి ముసిలి నక్కలు ఎక్కి రాలేరు అక్కడ మెరికల్లాటి కుర్రకారున్నది వాళ్ళు జాగ్రత్తమీదే ఉన్నారు

స్వాతిలో నా వ్యాసం చదివి నాకు ఉత్తరం రాసినది దిగంబర కవి చెరబండరాజు ఒకరూ హైదరాబాదులో ఇంకా కొందరు చదివి తృప్తి పడ్డారని ఇతరత్రా తెలిసింది దానిమీద నాకేమీ ఉత్తరాలు రాలేదు ఉత్తరాలు ముఖ్యంకాదు మధ్యతరగతి వాళ్ళ ఏడుపుగొట్టు సాహిత్యం తగ్గితే బాగుండును ఈ కష్టాలూ అవీ దైవికంగా వచ్చినట్టు బాధపడే మూఢులు కూడా ఉన్నారు వీళ్ళందరికీ కనువిప్పయినా కావాలి లేదా వీళ్ళు అణగారి అయినా పోవాలి రెండోది జరగటం నాకంత ఇష్టంలేదు నిజానికి మధ్యతరగతి మీద నాకు అంతగా కసిలేదు వాళ్ళుకళ్ళు తెరుచుకుంటే సాంఘిక శక్తులకు మంచి దోహదం జరుగుతుంది ఆ ఆశ నాలో చావకుండా ఉన్నది మధ్యతరగతి మీద నాకు పెద్ద ఆశలున్నాయని కాదు

సినీ భజనపరులు “అభ్యుదయ సాహిత్య సదస్సులు” జరిపితే నేను వెళ్ళను రానని ఎప్పుడో రాసేశాను నా అనుమతి లేకుండా నా పేరూ, నేను చదివే వ్యాసమూ వేసేశారు కరపత్రంలో నన్నొక ఉత్సవ విగ్రహం కింద జమకట్టి ఉంటారు శాస్త్రిగారు వెళ్ళే పక్షంలో కత్తులూ, కటార్లూ నూరుకుని మరీ వెళ్ళమనండి తిరిగివచ్చినాక జరిగిన ఫార్సు విశేషాలు తెలుసుకుందాం

ఇంకోటి స్పష్టంగా కనబడుతుంది ‘అభ్యుదయ’ పదాన్ని విశాలాంధ్ర రాజకీయ పక్షంవాళ్ళు ట్రేడ్ మార్కుగా వాడుకుంటున్నారు త్వరలోనే ఆ మాట కంపు కొట్టేస్తుంది ఇవాళ సోమసుందర్ లాంటివాళ్ళు అగ్ర అభ్యుదయ కవులు ! అక్కడక్కడా “అభ్యుదయ” సమితులు లేస్తున్నాయి వీటి భవిష్యత్తు జోస్యం చెప్పొచ్చు - కంపు !

ఇక్కడ అందరమూ కులాసాగానే ఉన్నాం మా శాంతకు ఇంకా పురుడు రాలేదు మా ప్రసాద్ 26న బయలుదేరి ఇక్కడికి వస్తాడు వచ్చేముందు మీకు కనిపిస్తాడనుకుంటాను వేణుగారినీ, ప్రసాద్‌గారినీ అడిగానని చెప్పండి ఉంటాను

*

27-6-70

నమస్కారాలు మా ప్రసాద్ నిన్న సాయంకాలం చేరాడు మీరు పంపిన ఉత్తరాలు చూశాను నేను ఎవరినీ అభ్యుయ సదస్సుకు వెళ్ళవద్దని కాన్వాస్ చెయ్యడం లేదు నేను రానందుకు సంజాయిషీ చెప్పుకోవటం తప్పనిసరి అయి చెప్పుకున్నాను అది ఎవరినీ కన్విన్స్ చేసినట్టు లేదు

ఈ సదస్సును ఆర్గనైజు చేస్తున్నది అభ్యుదయ రచయితల సంఘం కాదు ! వీళ్ళు మార్క్సిస్టులు కారు అభ్యుదయవాదులు కారు కనీసం జీవకారుణ్యం కలవారైనా కారు - మనుషులను వేటాడే హంతకులూ, వారి తొత్తులూనూ

రోజుకొక brochure వస్తున్నది వేలకు వేలు ఈ సదస్సుకోసం ఎందుకు ఖర్చు చేస్తున్నారని మనం ఆలోచించలేమా ? సంభావన బ్రాహ్మలల్లే పిలిచిందే ఘనమని పోతామా ? కసాయివాడు జీవకారుణ్యం మీద సెమినార్ పెడితే భూతదయ గలవాళ్ళు ఉరకటమేనా ? దీనికి నేను పోవటం ఒక విశేషం కాదు తిరుపతిలో All India Telugu Writers సమావేశం పెడితే అది ఫ్రాడ్ అనుకుని నేను ఈ కాస్త దూరమూ పోలేదు వెళ్ళినవాళ్ళు నన్ను తరువాత సమర్థించారు రావిశాస్త్రిగారు వెళ్ళటం మానేస్తే నేను ఆశ్చర్యపడను దిగంబర కవుల సంగతి నాకు తెలీదు వాళ్ళు వెళ్ళటమే జరిగితే రసాభాస చెయ్యటానికే పోతారుగాని, సదస్సులో పాల్గొనటానికి పోరని నా నమ్మకం వాళ్ళు నాకు రాయలేదు నేను వాళ్ళకు రాయలేదు నేను ఎవరినీ influence చెయ్యదలచలేదు అందుకని రాయలేదు సదస్సుకు రావటంలేదని, తొలి ఆహ్వానం అందగానే 9న శాండిల్యకు రాశాను తరువాత మీకు రాశాను మీనుంచి తెలిసి రమణారెడ్డి రాస్తే అతనికి రాసాను మా అమ్మాయికింకా పురుడు రాలేదు మా లెక్క తప్పులాగుంది

రమణారెడ్డికి కూడా ఇవాళే రాస్తున్నాను ఈ ఉత్తరం ప్రసాదుగారికి కూడా చూపించండి ప్రసాదుగారినీ, వేణుగారినీ అడిగానని చెప్పండి ఉంటాను

*

15-10-70

నమస్కారాలు నేను కులాసాగానే ఇంటికి తిరిగి వచ్చాను నా ఆరోగ్యం రొటీన్ మార్పు మూలంగా కొద్దిగానే దెబ్బతిన్నది యువకుల ఉత్సాహం చెడగొట్టటానికి ఇష్టం లేకనే విరసంలో ఉన్నాను కాని రచనల ద్వారా నేను చెయ్యగలది కనిపించదు నా చుట్టూ ఉన్న జీవితంలో నేను ఇమడటం లేదు తామరాకు మీద నీటిబొట్టు జీవితమైంది నాది దానికి తోడు స్వేచ్ఛ ఏమీలేదు

ఖమ్మం తరువాత పెద్ద ఎత్తున ఏదో జరిగిపోతుందని ఆశలు పెట్టుకుని లాభం లేదు కాని విరసం రావటంతో పరిస్థితి కదలబారింది ఈ కదలికకు వేగం ఇవ్వవలసిన వాళ్ళు యువరచయితలూ, కవులూ, ప్రజలూనూ వేగం క్రమంగా వస్తుందని నాకు పూర్తి నమ్మకం వున్నది

గేయరూపం తేలిందని పూర్తిగా తృప్తిపడటానికి లేదు గేయంలో కూడా కొత్త శక్తులు వస్తాయని నేను ఊహిస్తున్నాను కథలలో ప్రస్తుతానికి తిరుగుబాటు మనస్తత్వమూ, రాజీధోరణుల పైన తీవ్ర నిరసనా ఉంటే చాలు భవిష్యత్తులో విరసం సాహిత్యం చాలా భాగం పీడిత వర్గాలనుంచి రావాలి ఇప్పుడున్నవాళ్ళు వాళ్ళకు దోహదం చెయ్యాలి ప్రస్తుతంలో కొంత అనుకరణ ఉంటుంది దారి స్పష్టంగా ఏర్పడ్డ తరువాత గాని అడుగులో అడుగు వేసి నడిచే అవసరం తప్పదు అచ్చుగా రాజకీయవాదులకు సభ్యత్వం ఇచ్చామా ? విరసంతో రాజకీయవాదులు సహకరిస్తే అభ్యంతరం లేదుగాని వాళ్ళు తీర్చిదిద్దే స్థితివస్తే విరసం కూడా అరసంలాగే తయారయ్యే ప్రమాదం ఉన్నది N S ను అనవసరంగా తల పగలగొట్టుకోవద్దని చెప్పండి ఇతర దేశాలనుండి మనం నేర్చుకునేది ఏదీ వుండదు - శిల్పం తప్ప

రోహిణీ ప్రసాద్ ఇంకా గది తీసుకొన్నట్టు లేదు వెతుకుతున్నాడు మంచి లొకాలిటీలో దొరకటం కష్టంగా వుందంటూ రాశాడు పాప బాగానే వుంది అందరమూ కులాసాగానే వున్నాం అందరినీ అడిగానని చెప్పండి ఉంటాను

*

14-12-71

నమస్కారం మీ అయిదో తేదీ ఉత్తరం అందింది నేను ECG తీయించుకునే ఆలోచనలోనే ఉన్నాను అశ్రద్ధకు కారణం నిత్య కార్యక్రమం నిర్విఘ్నంగా సాగుతూ ఉండటమూ, నేను ప్రస్తుతం వాడుతున్న హోమియోమందులూ, వైటమిన్లూ కొంతవరకు పనిచేస్తూ ఉండటమూనూ ప్రయాణం చెయ్యటంలో కూడ బాధ ఏమీలేదు కొత్తచోట తిండీతిప్పలూ నాకు కావలసినట్టుగా అమరవు గద !

పాత సాహిత్యం చదివి తెలుసుకోవలసినది ఆనాటి సమాజాన్ని గురించే భాషకోసంకాదు ఆ భాష మనకు ఉపయోగపడదు నేను వాడని గ్రాంధిక పదాలు నాకు వందలకొద్దీ వచ్చు రచయితగా ముందుకు పోవటానికి మరీ పాత సాహిత్యం ఉపయోగపడదు ఇటీవలి సాహిత్యం విమర్శించటం ఎక్కువ ప్రయోజనకరం వాళ్ళ తప్పులు మన తప్పులు కూడ కాగలవు గనక మనం వాటి నుంచి తప్పుకోవలసి ఉంటుంది ముఖ్యంగా యువతరం రచయితలు గురజాడతో ప్రారంభమైన (ఆధునిక) సాహిత్యాన్ని క్షుణ్ణంగా విమర్శించగలిగి ఉండాలి పాత సాహిత్యం ఎంత మాత్రమూ పునాదికాదు నాకు తెలిసినంతవరకూ చలం రచనలకు ప్రాచీన సాహిత్యం ఏ మాత్రమూ పునాదికాదు

విశాఖలో జరిగే చర్చల సారాంశం రాసి పెడుతున్నారా ? అది చాలా ఉపయోగం 11 సాయంకాలం మా శాంత, పిల్లతో సహా ఢిల్లీనుంచి వచ్చింది జనవరి మొదటి వారంలో తిరిగి వెళ్ళిపోతుంది మా ప్రసాద్ 17న వచ్చి ఒక వారం ఉండి వెళతాడు అంతా కులాసాగానే ఉన్నాం వేణుగారినీ, ప్రసాద్‌గారినీ, మిగిలిన మిత్రులనూ అడిగానని చెప్పండి మొన్నా, నిన్నా, మల్లంపల్లి కృష్ణారావు కనిపించాడు మరువాడ ఇప్పుడు ఇక్కడే ఉంటున్నాడు గద ! ఉంటాను

*

15-10-75

నమస్కారాలు మీ 11 ఉత్తరం ఇప్పుడే అందింది మూడు రోజులు 12, 13, 14 మాకు సెలవులు ఆంధ్రజ్యోతిలో 4, 5 వారాలుగా వస్తున్నది నా సొంత సిద్ధాంతం దాని సారాంశం ఏమిటంటే space, time తో బాటు Mind కూడ భౌతిక జగత్తుకు ఒక dimension అని ఇది నేను చాలా ఏళ్ళుగా ఆలోచిస్తున్న విషయమే కాని దాన్ని ఒక "వాదం" రూపంలో పెట్టటం అంత తేలిక కాదు ఇప్పుడైనా నేను రాసినది సమగ్రం కాదు నాకన్న పెద్ద బుర్రలు చాలా కలిసి పనిచేస్తేనే గాని ఈ వాదం ఒక రూపం తీసుకోదు ఇది భౌతికవాదమే కాని మామూలు భౌతికవాదం ప్రస్తావించని విషయాలూ, నిరాకరించే విషయాలూ ఇందులో ప్రస్తావనకు వస్తాయి అందుచేత "సంప్రదాయ" మార్క్సిస్టులకు కొన్ని అంశాలు మింగుడుపడక పోవచ్చును కాని సృష్టిలో Mind dimension ఉన్నదనటానికి ఎటువంటి సందేహమూ నాకు లేదు

మనం కుటుంబం, ఆస్తి మొదలైనవాటిని గురించి ఎంత రాసినా అవి మామూలు జనానికి అందవు అందితే అర్థంకావు మనం పై లెవెల్‌నుంచి ఆలోచించి కిందికి దిగే మార్గాలు ఆలోచిస్తున్నామేగాని, జనం లెవెల్‌తో ప్రారంభమై పైకి వచ్చే మార్గాలు చూడటం లేదు అందుకేనేమో Mao మార్క్సిజం మీద కూడా అతిగా చదవొద్దని సలహా ఇచ్చాడు ఊహా విహారాలు చెయ్యటానికి మార్క్సిజంను కూడ కొందరు సాధనంగా వినియోగిస్తున్నట్టుగా కనబడుతుంది దేవుళ్ళతోనూ, దయ్యాలతోనూ, ప్రారంభించి శాస్త్రదృష్టికి జనాన్ని మళ్ళించటమే మంచిదేమో నా దగ్గిర చేరిన పుస్తకాలు చదువుతున్నాను కొన్నిటికి నోట్స్ కూడా తీసుకుంటున్నాను తరువాత క్రమంగా వ్యాసాలు రాస్తాను చిత్రం ఏమిటంటే ఏనాడో స్పష్టంగా తేల్చిన విషయాలను గురించి ఇంకా అభూత కల్పనలు ప్రచారం అవుతూనే వున్నాయి భారతయుద్ధం నిజంగా జరిగిందా లేదా అని తర్జనభర్జనలు పడుతున్నారు భారతంలో ఉన్న యుద్ధం జరిగి వుండటం అసంభవమని ఏనాడో Kosambi రుజావు చేసాడు మన Intellectuals లో వున్న పెద్ద తెగులు పాత సమస్యలను గురించి తమతోనే ఆరంభమయినట్టు భావించటం Intellectual వాతావరణం చాలా భయంకరంగా వున్నది

ప్రసాద్ 12న ఇక్కడికి వచ్చాడు 25దాకా ఉంటాడు అంతా క్షేమంగానే ఉన్నాం మీరంతా కులాసాగా వున్నారని తలుస్తాను



20-10-78

నమస్కారాలు మీ ఉత్తరం అందింది నేను విరసంను బురద తొక్కవద్దన్నానేమోగాని ఆత్మపరిశీలన చేసుకోమనేటంత గొప్ప స్థానంలో ఏనాడూ లేను ఈ ఆత్మ పరిశీలన ఒక pose కింద దిగజారుతుందేమో ! అల్లం రాజయ్య కథలు చూడటం లేదు సైన్స్ పరిశుద్ధం ఏనాడూ

కాదు నిర్దుష్టం కూడా కాదు అరుణతారలో ఎన్ని వ్యాసాలు వేస్తారు నావి ? ఇప్పుడింకా ఒకటి KVR గారి దగ్గిర ఉన్నది సృజనకు కూడా ఏదో వ్యాసం పంపాను బూర్జువా సినిమా గురించి సృజనలో వ్యాసం అవసరమా ? సైన్సు గురించి ఇంగ్లీషులోనే రాసి పంపుతాను translate చేసి ఉపయోగించుకోమనండి ఉంటాను

❋

28-7-79

నమస్కారాలు మీ 26 ఉత్తరం ఇప్పుడే అందింది జర్నలిస్టు అవార్డు ఇదివరకు ఇంటూరికి ఇచ్చారు నేను దానికోసం తెనాలి వెళ్ళటం లేదు ప్రయాణం చెయ్యటం నా ఆరోగ్యానికి మంచిది కాదు ఈ అవార్డు ఏనాడు ఇచ్చేదీ కూడా నాకు తెలీదు ఇప్పుడు మా అమ్మాయి ఫామిలీ, మా ప్రసాదు ఫామిలీ కూడా వచ్చి వున్నారు ఇల్లు చాలా సందడిగా ఉన్నది

చలంగారి సన్నిహితులెవరూ ఆయన గురించి రాయరు రాసేవాళ్ళకు వివరాలు చెబుతారు నజీర్ రహ్మాన్ ఒక్క ముక్క కూడా రాయలేదు మీరు గమనించి ఉండవచ్చు

Fission Vs Fusion ఎవరైనా రాసి ఉండొచ్చు పోలిక కొట్టవచ్చినట్టు కనబడుతున్నది అయితే కలలో కూడా జరుగుతుందనుకోనిది నేను కొత్త ప్రభుత్వంలో ఇందిరా కాంగ్రెసు ఉండటం - ఆఖరి వాక్యంలో సూచించాను అది అబద్ధమవుతుందనే అనుకున్నాను కాని చిత్రంగా నిజమైంది

నేను విరసం సభ్యత్వానికి రాజీనామా చేశాను అదే సరియైన పని సాహిత్య కృషి చెయ్యనివాడికి విరసంలో స్థానం ఉండరాదు నేను విరసం సభ్యుడుగా ఉన్న కారణంచేత నేను రాసేదంతా విరసం కోసమే ననుకుని, బుద్ధికొలత గురించి హిస్టీరియా తెచ్చుకున్నవాళ్ళున్నారు అది కేవలము శాస్త్రవిజ్ఞానానికి సంబంధించినది

ఇక్కడ అందరమూ క్షేమంగా ఉన్నాం మీరంతా క్షేమమని తలుస్తాను వేణుగోపాలరావుగారిని మేమంతా అడిగినట్లు చెప్పండి ఉంటాను

❋

17-9-79

నమస్కారాలు విరసం సంస్థ ఒకడి పేరుకు విలువ ఇయ్యడం చాలా అన్యాయం కార్యవర్గ తీర్మానం కారణంగా రాజీనామా చేస్తున్నాననే అభిప్రాయం బాగా ప్రచారమైంది రాజీనామా drop చెయ్యమని KVR కు రాశాను నా ఆరోగ్యం ఇప్పుడు బాగానే వున్నది నెలల తరబడి మందులు తీసుకోవాలిట అందరినీ అడిగానని చెప్పండి ఉంటాను

❋

20-9-79

నమస్కారాలు  చెరబండరాజు గురించి సృజనలో చదివి షాక్ తిన్నాను  ఎంతమంది కుటుంబరావులైతే చెరబండరాజు అవుతాడు ? Brain Tumour కు హోమియో వైద్యంలో ముఖ్యమైన drugs 4 ఉన్నాయి  బరైటా కార్బ్, కోనియమ్, కేలీ అయోడేటమ్, ప్లంబంమెటోలికమ్  హైదరాబాదులో మంచి హోమియో వైద్యులుండాలి లక్షణాలను బట్టి పై నాలుగులో ఏదో ఒక మందుతో చెరబండరాజుకు నయం చెయ్యలేరా ? ఈ దేశంలో ఉన్న సంపద ఉపయోగపడనట్టే ఉన్న విజ్ఞానం కూడా ఉపయోగపడదా ? ఉంటాను

మద్రాసు,
11-7-68

*శ్రీ వేణుగోపాలరావుగారికి,*

నమస్కారాలు మీరు పంపిన Application form అందింది Nuclear Physics మంచి సబ్జక్టే మీరన్నట్టు MIT మీదనే అధికంగా bank అవుతున్నాం మా ప్రసాదుకు high first class (A plus) వచ్చింది నేను శాస్త్రిగారిని లోగడ కలసి మాట్లాడాను తన ఒక్కడి మాటా చాలదనీ, committee members ను ఒకరిద్దరిని పట్టుకోవటం అవసరమనీ ఆయన అన్నారు ఇద్దరు members ను బాగా ఎరిగిన లేడీ డాక్టరు ఒకరు మా neighbour ఉన్నారు ఆమె భర్త MIT లో Lecturerగా ఉండేవారు ఆయన కొంతకాలం క్రితం పోయేరు డాక్టరుగారు పాత acquaintancesను meet కావటానికి hesitate చేస్తున్నట్టు కనబడతారు Seat దొరకటంలో ఏమైనా trouble ఉండేటట్టుంటే వస్తామన్నారు చూడాలి

Vizag కు కూడా మావాడి చేత apply చేయిస్తాను

ముప్పాళ్ళ రంగనాయకమ్మగారికి తనను ఇతరులు అర్థం చేసుకోలేరన్న బెంగే తప్ప, ఇతరులను తను అర్థం చేసుకోలేనన్న భయం ఏమీ లేదు She is too literal ఆవిడగారికి వ్యంగ్యం కూడా తెలీదు పాపం ! అలిగే హక్కు అంటే అది కూడా ఒక హక్కేనా అని అడుగుతున్నారు ఆడవాళ్ల సమస్యలన్నీ మగవాళ్ల సమస్యలేనని తేల్చేసి అడుగు ఊడగొట్టేశారు! Reformism లో ఆమెకు చాలా నమ్మకం Materialist ఫిలాసఫీ ఆమెకు అంటించినా అంటదు

కాళీపట్నం రామారావుగారి మిగతా కథలు బయటికి రావేం ! ఈ మధ్య చాలా రాశారని విన్నాను

మన కమ్యూనిస్టుల సిద్ధాంత చర్చలు ఒక పక్కనుంచి పదునెక్కుతుంటే రెండో పక్కనుంచి దేశం దిగజారిపోతున్నది వీళ్లు foundation జోలికి పోకుండా superstructure తో ఇంద్రజాలం చేసే ధోరణిలో ఉన్నట్టు కనబడతారు ఎవరి strategy ఏమిటో వాళ్లకే తెలిసినట్టు కనబడదు

బసవరాజుగారు, కృష్ణమూర్తిగారూ, శాస్త్రిగారూ ఎట్లా ఉన్నారు ? కృష్ణాబాయిగారినీ మిత్రులనందరినీ అడిగానని చెప్పండి 60లో ప్రవేశించబోతున్న నేను మానసికంగా senile అయినానో లేదో గాని (అయితే ఇతరులు కనిపెట్టవలసిందేగాని నేను కనుక్కోలేను గదా !) నా శరీరం చిన్న చిన్న troubles ఇస్తున్నది Common cold, stomach upset లాంటివి వెనకటంత easyగా లొంగి రావటం లేదు అందుచేత మీకు ముసిలితనం రాకుండా ఉండాలంటే ఒంటిని దృఢంగా ఉంచుకోండి ముసిలితనం దగ్గిరికి రాబోదు ఉంటాను

శుభాకాంక్షలతో

❋

16–7–12

To
The Secretary,
Seven Stars Syndicate,
Vijaya Nagar,
Hyderabad- 7

*Dear Sir,*

I am happy to hear that you are holding a Bapu Art Exhibition I welcome this venture of yours and wish it all success For a long time, I felt that Bapu is unique among modern artists, he has universalised art in such a manner that all sections, races, and even nations of people can understand what he is trying to convey His sense of beauty is superb Your syndicate will be honouring themselves by honouring Bapu

*Yours Sincerely*

మద్రాసు,
11-1-64

మిత్రులు రామమోహనరావుగారికి,

నమస్కారాలు మీ ఉత్తరమూ, కటింగులూ అందాయి నేను నిన్న సాయంకాలం ఇల్లు చేరుకుని, ఈ పూటే ఆఫీసుకు వచ్చాను 4 జనవరి జనశక్తి వ్యాసం తప్ప మిగతావి నేను లోగడ చూసినవే బలరామమూర్తిగారి వ్యాసం చదివి నేను నోట్ చేసుకున్న ఆక్షేపణలు కొంచెం అటూ ఇటూగా ఆర్ హనుమంతరావుగారి 4వ తేదీ వ్యాసంలో ఉన్నాయి (ఈ ఆర్ హనుమంతరావు గారెవరో తెలుసుకుందామనుకుని మరిచిపోయాను విజయవాడలో) ఒక్కటి చెప్పగలను బలరామమూర్తిగారి వ్యాసంలో కొన్ని సత్యాలున్నప్పటికీ సిద్ధాంతాల విషయంలో అది పెద్ద అవకతవక వ్యాసం నేను చేసుకున్న notes మార్చకుండా ఇక్కడ ఉదహరిస్తాను

"వస్తువును స్వీకరించడంలోనే విభజిస్తున్నాము' This is not quite true Pastoral lyrics are about common folk but they conceal the truth about their life & provide glamorous pictures of folk life for feudal entertainment ! The out look and relation between the poet and his subject is most important"

"ప్రతిభావంతంగా నీ అభిమానిస్తారు " Do they ? Is it only form and technique that matter ?"

"కృష్ణపక్షం" "సౌభద్రుని ప్రణయయాత్ర", "ఏకాంతసేవ", "మహాప్రస్థానం " etc are all one !"

There seems to be nothing wrong in Ramana Reddy's grading of progressive poets To me it looks quite rational

Bala is also right in distinguishing between Prog poets of P Poetry But he fails to see the defect in Ganapathi Sastri's Poem (అమ్మా మాదాకబళం తల్లీ) Having rejected the basis for Ramana Reddi's grading he is bound to see the defect "

నా సొంత reactions ఎట్లా ఉండిందీ చూపటానికి పైది ఉదహరించాను బలరామమూర్తిగారే 1947లో ఈ మాటలు రాసి ఉంటే అందరమూ ఆక్షేపించి ఉండేవారమేనని రూఢిగా చెప్పగలను ఎవరు అభ్యుదయకవి అనేదాన్ని గురించి ఘర్షణ జరగటం నాకిష్టం లేదు ఇందులోకి కమ్యూనిస్టు పార్టీ అంతఃకలహాలు ప్రవేశించటం ఘోరాతిఘోరం అభ్యుదయ కవులయిన వారిలో కీర్తి కండూతి గలవాళ్లు, అది Latest fashion అనుకున్నవాళ్లు, దానికి కిరీటం దక్కుతుందనుకున్నవాళ్లు ఉన్నారు పేదల కష్టాలు గురించి మేమేనా రాయలేం అన్న పద్ధతిలోనూ, ఆకలిని గురించి కూడా లిరికల్‌గా రాయొచ్చునండోయ్ అన్న ధోరణిలోనూ రాసిన వారున్నారు వీరందరినీ ఎవరు మోస్తూ కూచుంటారు ? వస్తువు యొక్క అసలు

విలువ నిర్ణయించటానికి భూతద్దాలెంత అవసరమో, బలరామమూర్తిగారి కేం తెలుసును ? నన్నడగండి చెబుతాను మీరు చర్చలు జరపండి నేను చెప్పవలసిందేదన్నా దిగబడితే చూద్దాం ఉంటాను

శుభాకాంక్షలతో

✻

11-5-70

నమస్కారాలు

Accelleration due to gravity = 32 ft per sec per sec అంటే, at the end of the 1st second falling object's velocity is 32' per sec per sec అది O velocity తో start అయింది గనక during the second its average velocity is 16' per sec During 1 second it falls 16 ft At the end of 10 seconds its velocity will be 320 Average for 10 seconds (starting from zero) 160 ft per sec So distance covered in 10 seconds is only 1600 ft and so on Jeans evidently gives the distance travelled during one second under accelleration due to gravity

మీరు వేసిన లెక్క సరికాదు ఈ లెక్కకు easy calculation ఉన్నది Timeను Square చెయ్యండి

$2 \text{ seconds}^2 = 4 \quad \text{So } \frac{4 \times 32}{2} = 64 \text{ ft}$ 2 పెట్టి భాగిస్తే

total distance వస్తుంది

5 seconds తీసుకోండి $\frac{5 \times 5 \times 32}{2} = 400 \text{ ft}$

10 seconds తీసుకోండి $\frac{10 \times 10 \times 32}{2}$ 1600 ft & so on

ఈ formuala ప్రకారం ఎన్ని సెకండ్లలో ఎంత fall ఉండేదీ లెక్కట్టవచ్చు $S = \frac{1}{2} gt^2$

(S total distance, $g = 32 \text{ ft/sec}^2$ t is number of seconds

పుస్తకం బాగా వస్తే కాస్త ఆలస్యమైనా ఫరవాలేదు నాకు పని మళ్లీ జాస్తి అయింది National Book Trust వాళ్లు కందుకూరి వీరేశలింగం గారి స్వీయచరిత్ర edit చేసి compose చేసి ఉపోద్ఘాతం రాసే పని పెట్టారు ఏడేళ్ల boycott తరవాత Radio వాళ్లు నాటకాలు రాయమని తగులుకున్నారు వీళ్లను వదిలించుకోవటం చాలా కష్టం అవుతున్నది

నార్లగారినీ, పురాణంగారినీ, ఇతర మిత్రులనూ అడిగానని చెప్పండి ఉంటాను

PS

శనివారం ఉదయం 9-15కు మా అత్తగారు కొమ్మూరి పద్మావతీదేవిగారు చనిపోయారు మీకీ వార్త ఇతరత్రా అందకపోతే పత్రికలో వేయించండి చలంగారు ఆమెకు బావగారవుతారు మీకు తెలిసే వుంటుంది కొ సాంబశివరావు కొడుకు ఉషారాణి భాటియా కూతురు (3rd )

*

31-6-70

నమస్కారాలు పీరిక రాశాను మొదట అనుకున్నట్టు రాయలేదు ఇంకొక విధంగా రాశాను కొంచెం పెద్దదే అయింది మీరు పెద్దదే కోరినట్టు గుర్తు పనికివస్తుందనుకుంటాను

పురాణంగారికి "కలకానిది" అందిందని చెప్పండి అందులో నేనది వరకు చదవని కథలు కొన్ని ఉన్నాయి అన్నీ చదివాను ఆయన కథాశిల్పాన్ని ఖాతరుచెయ్యక పోవటం మెచ్చదగినదేగాని కొన్ని కథలలో బాలన్స్ లేదు అన్నిటిలోనూ వేడి ఉన్నది That is to be expected

మీకు దువ్వూరి రామిరెడ్డి అవార్డు వచ్చేటందుకు చాలా మంది కృషి చేసినట్టు తెలియవస్తున్నది ఇందులో pre decision వాళ్లు ఎందరో, post decision వాళ్లు ఎందరో తెలీదు కాని అందరూ సంతోషించటం మీకు పెద్ద కాంప్లిమెంట్

అంటీమాటర్ అన్నది mathematicalగా derive చేశారు తరవాత దానికి experimental proof దొరికింది కాని ఎక్కడో antimatter worlds ఉన్నాయన్నదంతా ప్రస్తుతానికి ఊహాగానం

మీరు అదివరకు చదవకపోతే 'Quantum Mechanics' అన్న Russian Publication చదవండి విశాలాంధ్ర షాపులో దొరుకుతుంది అందులో equations ఆటే లేవు Amazingly readable book కాని ఒకంతట పూర్తిగా అర్థం కాదు సొంతం అర్థం కావటమంటూ ఉండదేమో ! అందులో subatomic particles అన్నీ mention చేశాడు

Jeans చెప్పిన 16 అడుగులకు నేను చెప్పిన explanation అయి ఉంటుంది O నుంచి మొదటి సెకండులో 32 అడుగుల accelleration వస్తుంది అందుచేత మొదటి సెకండులో దాని velocity per second అవుతుంది $S = \frac{1}{2} gt^2 = \frac{1}{2} \times 32 \times 1$ 2వ సెకండులో దాని Velocity 32 నుంచి 64కు పెరుగుతుంది ఆ timeలో అది cover చేసేది $\frac{32 + 64}{2}$ is 48 2వ secondకు $16 + 48 = 64$ ($S = \frac{1}{2} Gt^2 = \frac{1}{2} \times 32 \times 2 \times 2 = 64$) and so on

ప్రాచీనులను గురించి రాయాలంటే material చాలా ఉంది చాలా పుస్తకాలున్నాయి

నాకు ఏమీ ఓపిక లేక పైపైన రాసేశాను I leave the real work to my betters and juniors విశాఖపట్నంలో ఒక కుర్రాడు (anthropologist) ప్రాచీన వ్యవస్థలను గురించి రాస్తున్నాట్ట జ్యోతి weeklyకే పంపిస్తాడేమో ! He is qualified to write

విశేషాలేమీ లేవు అందరినీ అడిగానని చెప్పండి ఉంటాను

❋

10-9-75

నమస్కారాలు మీ 8 ఉత్తరం ఇపుడే అందింది (నిన్న శలవు) నేను రాసినది dailyలో పడితేనే మంచిదని పురాణం గారికి రాశాను ఇంకా 3 instalments కు సరిపడా రాశాను ఇవాళే book post లో పంపిస్తాను ఇప్పుడు రాసినది mere sketch ఇంతకన్న ambitious గా రాయటానకి నా దగ్గిర "పిండి" చాలదు ఇది నా ప్రాణానికి బొత్తిగా కొత్త conception కావటంవల్ల, నాకు పనికి వచ్చే material ఎక్కడ దొరుకుతుందో కూడా తెలీదు Psychology దాదాపు పూర్తిగా avoid చేశాను Life force, gravityల లాగా బుద్ధి, ఒక శక్తి కాదు Spatialగా gravity ఉన్నట్టే Mind కూడా Universalగా ఉన్నదనీ, అది ఒక basic dimension అనీ నా నమ్మకం బుద్ధి అనేది mind కాదు Intellect కానీ తెలుగులో "మనసు" అంటే దాని full significance రాదు అందుకని "బుద్ధి" అనే మాట వాడాను (పైగా వేదాలలో astral body కి మనస్సు అనే మాట వాడారు ) మన పూర్వులు స్వభావవాదం అన్నదంతా Mind కు attribute చెయ్యవచ్చుననీ, అది Inorganic evolutionకు కూడా వర్తిస్తుందనీ నా గట్టి నమ్మకం నేను దాని జోలికి కూడా పోలేదు మీరు చెప్పే doctrine of emergence అన్ని రకాల evolutionలోనూ వున్నది ఇప్పుడు నేను పంపించే matter కూడా ఓపికగా చూసి అందులో holes pick చెయ్యటానికి ప్రయత్నించండి ఈ theoryకి ఒక రూపం రావాలంటే ముందు criticism కావాలి Let it start it with you

మీ life ambition తీరటం మీకు సాధ్యమైనదే ననుకుంటున్నాను పారిభాషిక పదాలు, సంస్కృతంలో ఉన్నవీ, ఇంగ్లీషులో ఉన్నవీ, సాధ్యమైనంత తక్కువగా వాడి వాటికి అర్థాలిస్తూ పోవచ్చు ముందు notes రాసుకుంటూ పోయి, తరవాత విపులీకరించటమూ, edit చెయ్యటమూ చెయ్యవచ్చు Notes Sectionalగా రాసుకుంటే సరిపోతుంది అచ్చుగా text book shape రాకుండా ఉండాలంటే diffusion, chronolgy, social & geographical aspects, parallel developments సూచిస్తే రచన పక్కాగా తయారవుతుంది Notes రాయటం ప్రారంభిస్తే నాలుగేళ్లు ఆగవలసి వచ్చేది కాదు ఉంటాను

❋

28-9-75

నమస్కారాలు Mind మీద నేను రాస్తున్నది మీరు ప్రచురిస్తున్న ఈ సమయంలో మీకొక Interesting సంఘటన చెప్పాలి ఇది మీకు 26నే రాద్దామనుకున్నాను గానీ, చక్రపాణిగారి మీద వరసగా నాలుగు వ్యాసాలు రాయవలసి రావటంతో వీలు చిక్కలేదు

అందులో మొట్టమొదటిది చందమామకు రాసినది 25 ఉదయం నాకు అది రాయమనీ 4 పేజీలు centreలో add చేస్తామనీ అన్నారు అక్టోబరు చందమామ release కాలేదుగానీ forms print అయిపోయాయి Insert వల్ల ఒక చిక్కేమిటంటే అది కథ మధ్యలో వొస్తుంది ఎందుకంటే దాదాపు రెండేళ్ళ క్రిందట చక్రపాణిగారు 'centre pages' లో Left sideన కథ end చేసి, right sideన ఇంకోటి ప్రారంభించవద్దనీ, పత్రిక సగానికి చీల్చినట్టు ఉంటుందనీ చెప్పారు అందుచేత కథను centre దాటి end అయేటట్టు చూస్తున్నాను చందమామ centre pinning కనుక ఈ insert కథకు అడ్డం వచ్చి తీరాలి ఏ కథకు అడ్డం వస్తుందోనని page makeup చూద్దును గదా ఏ కథకూ అడ్డం రాలేదు చక్రపాణిగారు ఇంకా కొద్ది వారాలకు పోతారనగానే నేను "పొరపాటు" చేసి, centre leftలో కథ end చేసి, rightలో ఇంకో కథ begin చేశాను, insert కు కావాల్సిన ఏర్పాటు చక్రపాణిగారు బతికి ఉండగానే జరిగిపోయింది ఇది లోగడ ఎన్నడూ జరగలేదు ఈ ఏర్పాటు చేసినది నా mind కాదు!

Ofcourse this proves nothing but means a lot to my thesis పురాణం గారికి కూడా ఇది చూపండి ఉంటాను

❋

27-11-75

నమస్కారాలు నేను మళ్లీ 3 "పెద్ద" వ్యాసాలు రాశాను Crawley రాసిన Mystic Rose in Primitive Customs కొన్ని తీసుకుని అవి మనలో కూడా ఉన్నాయని చూపటానికీ, ముఖ్యంగా ఆడవాళ్ల repression ఏనాటిదో సూచించటానికీ ఇవి రాశాను General reader కు అంత interstingగా ఉండకపోవచ్చు ఆంధ్రజ్యోతి readerను ఇంత త్వరగా bore చెయ్యటం ఇష్టం లేక ABK కు ఒకటి పంపాను వాళ్లు అంత పెద్ద వ్యాసాలు వేసుకోలేమనేశారు మీకు పంపమంటారా ? తెలియపరచండి

మీ dream ఏ స్థితిలో ఉన్నది ఏదైన modus operandi దొరికిందా ?

పురాణం గారిని 'ఇల్లాలి ముచ్చట్లు' ఆపొద్దని చెప్పండి మిత్రులందరినీ అడిగానని చెప్పండి ఉంటాను

❋

6-3-79

నమస్కారాలు మీ 3 ఉత్తరం అందింది నేను సంగీతం గురించి రాసిన వ్యాసం authoritative కాదు కావటానికి వీల్లేదు Only Provocative అయితే బాలమురళి ఆ

వ్యాసంలో ప్రతి అక్షరమూ నిజమని అన్నాడు Controversial కాదన్నాడు నిజానికి అందులో అతన్ని విమర్శించే అంశాలు కూడా ఉన్నాయి ఏదైనా మనవాళ్లకు discussionలోకి దిగే అలవాటు లేదు ఇదే అరవలైతే ఆ పాటికి దుమ్ములేపేసేవాళ్లు

హనుమచ్ఛాస్త్రిగారి వ్యాసంగల సంచిక వచ్చింది నేను చదవలేదు పాణిని గురించి ఆయన ఏమనటానికైనా అర్హతగలవాడు పాణిని వ్యాకరణం రాసి సంస్కృతాన్ని గొప్ప చేశాడన్న అభిప్రాయం నా సొంతం కాదు D D Kosambi గారిది పెద్ద పండితుడే గదా ! సంస్కృతం సజీవ భాష అని వాదిస్తున్న వారు చాలా మంది ఉన్నారు సజీవ భాష అంటే ఏమిటో వారికే తెలియాలి Usageతో మారే శక్తి లేని భాష నిర్జీవ భాష అని మనబోటి వాళ్లం అనుకుంటాం!

ఉన్నంతవరకు నా వాదనలో తప్పు పట్టటానికి ఏమీ లేదనీ, అయితే బుద్ధికొలత గురించి తప్పనిసరిగా నమ్మాలన్నది నేను రుజావు చెయ్యాలనీ ఆంధ్ర యూనివర్శిటీ సైకాలజీ, పారా సైకాలజీ డిపార్ట్‌మెంట్ వారన్నారు మామూలు "Science-religion" లో ఉన్న లోపాలు వారిలో మీకు వ్రాసిన argument ఇంకా extend చేసి వారికి రాశాను ఏమంటారో చూడాలి

The argument is absolutely simple

మనం presentలో millions of years pastను ఆకాశంలో చూస్తున్నాం అందుకు extended space dimension help చేస్తున్నది మనం అనేక దశాబ్దాల క్రితం విషయాలు recapitulate చేస్తున్నాం ఏ dimension ? మన presentకూ, స్మృతుల pastకూ మధ్య సమాధానం ఏ dimensionలో ?

Rare memory or transmission of characters కూడా recapitulation of the past గానే భావించాలి దానికి DNA, genes అని ఏవో మంత్రాలు చదువు తున్నారు OK మనిషి గర్భంలో నుంచి మనిషి బిడ్డ రావటానికి genes కారణం కాని ఒక fertilised egg cell evolutionary stages - gills, tail, body, fur - అన్నీ సంపాదించి, విసర్జించే శక్తి కూడా genesకీ ఉన్నదా ? దీన్ని నేను scientific mumbo-jumbo అని ఎందుకు అనరాదు ? Phylogeny space-time లో జరిగిందంటే అర్థం చేసుకోవచ్చు కాని అదే process ఇంకో dimension లేకుండా జరిగిందంటే ఎట్లా నమ్మటం ?

మీరు మరచిపోయి ఉంటే biology genetics, evolution పుస్తకాలు ఒక్కసారి తిరగెయ్యండి Mind Dimension చాలా చోట్ల కానవస్తుంది ఉంటాను

PS జయంతిరామయ్య పంతులుగారి మీద నేను supply చేసింది పనికొస్తుందా ?

చందమామ,
మద్రాసు,
10-2-64

శ్రీ రమణారెడ్డిగారికి,

నమస్కారాలు మీ 8 ఉత్తరం అందింది మీరు తలపెట్టిన పని చాలా కష్టమైనది నేనైతే ఒక్క దణ్ణం పెట్టేసి ఉందును మీకు ఎప్పుడే అనుమానాలు కలిగినా నాకు రాయండి ప్రస్తుతం మీరు అడిగిన విషయాలు -

1) యువ వారు ప్రచురించిన నవలల chronology -
(1) 'నీకేం కావాలి ?' (2) 'కులం లేని మనిషి' (3) 'మారు పేర్లు' (4) 'అరుణోదయం' (5) 'గడ్డు రోజులు'

2) పెద్ద కథలనూ, చిన్న కథలనూ వదలవద్దు దీర్ఘమైన రచనలు చెయ్యరాదని నియమం పూనటం చేత నవలలు ప్రయోజనం ఆశించినవి కూడా కుదించి రాశాను కొన్ని రచనలు మరీ పెరిగి పోతుంటే మళ్ళా ప్రారంభించి కూడా రాశాను అందుచేత ఈ technical division ను పాటించకుండా ఉంటేనే మంచిది 'ఆడజన్మ', 'సవతితల్లి', 'లేచిపోయిన మనిషి' మొదలైనవన్నీ ఇటువంటివే

3) నేను నవలలు రాయటానికి ఎవరి influence గాని ఉన్నదని తోచదు చలంగారిది అసలే లేదు మిగిలిన తెలుగు నవలాకారులు నాకు చలంగారికన్నా కూడా దూరంగా ఉన్నవాళ్ళే నేను అభిమానించే పాశ్చాత్య నవలాకారులు చాలామంది ఉన్నారుగాని వారి ప్రభావం నాకు ఏ విధంగానూ ఉపకరించలేదు

ఈనాటికైనా తెలుగునవల ఒక పాకానికి వచ్చిందన్న నమ్మకం నాలో గట్టిగా కలగటం లేదు Novel form మనకు పాశ్చాత్యుల నుంచి ready-made గా లభించింది Characterisation, representation of life కోసరం దాన్ని ఎవరి శక్తి కొద్దీ వారు వాడుక చేస్తున్నారేగాని, ఒక outsanding land mark లాటిది మన నవలా సాహిత్యంలో ఎక్కడ వచ్చింది? ఆ form ను అద్వితీయంగా ఉపయోగించుకున్నవారెవరూ కానరాదు చెఖోవ్ ప్రభావం కూడా నామీద ఏమీ లేదు - ఉండే అవకాశం లేకపోయింది చిన్న కథలు రాయటంలో set అయిపోయినాక చెఖోవ్ కథలు చదివాను చెఖోవ్ నవల ఒకటే చదివాను అది నాకిప్పుడేమీ జ్ఞాపకం లేదు దాన్ని మార్చి Hollywood వాళ్ళు సినిమా తీశారు, సినిమా మాత్రం జ్ఞాపకం ఉంది

మీరు ఎప్పుడే వివరాలు కావలసినా రాయండి నేను వెంటనే జవాబిస్తాను ఉంటాను

*

20-2-64

మీ 18 ఉత్తరం అందింది మీరడిగిన వాటికి సమాధానాలు

1) 'ఎండమావులు', 'అరుణోదయం', 'ప్రేమించిన మనిషి' లలో స్వీయానుభవాలు

లేవు నేను చిన్న కథలలో కూడా నాకు పరిచయం ఉన్న వాతావరణాన్ని వాడుకుంటాను గాని, నా అనుభవాలను వాడను నాకు 'ధర్మపత్ని'తో సంబంధం లేదు నా సినిమా అనుభవాలు 'వీరాభిమన్యు' (1936)తో అరంభమయాయి మీరు middle of the range అనుభవాలనేది నాకు అర్థం కాలేదు ఒకటి చెప్పగలను పెద్ద హిట్ చిత్రాలు తయారైన వాతావరణం నాకు బాగా తెలుసు కాని సినిమాలలో ఘనవిజయాలను చిత్రించటం - ప్రేమ కలాపం లో కూడాను - నా బుద్ధికి అవాస్తవికమనిపిస్తుంది

2) 1914లో నేను బయాస్కోపు చూశాను అయితే అవి stray photo-moving pictures వాటిలో కథ అంటూ లేదు కథా చిత్రాలు చాలా తర్వాత వచ్చాయి సినిమా థియేటర్లు 1924-25 ప్రాంతాల ఏర్పడ్డట్టు జ్ఞాపకం 1930-35కి టాకీలే వచ్చాయి అప్పటికి తెనాలిలోనే 3 సినిమాహాళ్ళు వున్నాయి "చదువు"లో కూడా నా స్వంత అనుభవాల కన్న, వాతావరణం నాకు పరిచితమైనది జాస్తిగా వున్నది "చదువు"తో అంతమైన వాతావరణాన్ని "గడ్డు రోజులు"లో పొడిగించాను అందులో నా స్వానుభవం ఒక్కటి కూడా లేదనవచ్చు "చదువు"లోది గుంటూరు జిల్లా వాతావరణం

3) నా రచనలు cold గానే వుంటాయి దాన్ని గురించి ఆక్షేపణలు చేసినవారున్నారు గాఢానుభూతులూ, తీవ్ర సంఘటనలూ పెట్టడం నాకు cheap trick అని పిస్తుంది దాన్ని సమర్థించటం లేదు అది నా aberration అనుకోవచ్చు

4) ఒక కథ నలుగురూ బాగుందంటే దాన్నే తిరగదోడి రాయటం కథలు రాయటం చేతగానివాడు చేసే పని 'అరుణోదయం'లో కథానాయకుడికి కథలు రాయటం చేతకాదనీ, obsession theme అనీ నా ఉద్దేశం అది నా కన్వయిస్తే నాక్కూడా కథలు రాయడం చాతకాదన్నమాట

నేను అంధ్రలో వున్నంతకాలమూ ఆంధ్రలో నాకు తెలిసిన వాతావరణం ఆసరా చేసుకున్నాను చాలాకాలం పట్నంలో ఉండిపోయిన మీదట ఇక్కడి వాతావరణం ఆధారం చేసుకోవలసి వచ్చింది మధ్య తరగతినే తీసుకున్నాను పాత్రలు representitive గా ఉన్నదీ, లేనిదీ నేను చెప్పలేను కాని మధ్యతరగతి మనస్తత్వం ఉన్న సంగతి అందరూ ఒప్పుకునేదే గదా ! ఈ మధ్య తరగతి మనస్తత్వం అస్తమానమూ ఎక్కడ కనబడుతుంది ? ఏదో చిన్న సమస్య ఏర్పడ్డప్పుడు దాని స్వభావం వ్యక్తమవుతుంది మధ్యతరగతిలో చాలా స్వభావ వైవిధ్యం ఉన్నది "బెదిరిన మనుషులు" లో పాత్రలన్నీ మధ్యతరగతివే కాని ఏ రెండూ ఒక రకానికి చెందినవి కావు పాత్రల మనస్తత్వంలో ఆకస్మికమైన మార్పులు కలగటం నా రచనల్లోనూ ఉన్నది కాని అటువంటి పరివర్తనకు తగిన కారణం కూడా ఉంటుంది

5) "లేచిపోయిన మనిషి" రాసేటప్పుడు నాటకాన్ని కథగా రాసినట్టు రాయాలని నా ఉద్దేశం అందులో నేను సాధించిన 'నాటకీయత' - అంతంలో పాత్రలన్నిటినీ ఒకచోట చేర్చి climax సాధించటం మీకు నవలలే కావాలిస్తే అటువంటి వాటిని ఒదిలెయ్యండి "సవతి తల్లి" కూడా కొంచెం సాగదీసిన కథానికే

విశాలాంధ్ర లోని నా వ్యాసంలో మీ "అక్షర తూణీరం" చేర్చి ఉండవలసింది అది పొరపాటే, కాని నేనా వ్యాసం రాసేటప్పుడు అచ్చుగా book reviews నే మనసులో ఉంచుకున్నాను విమర్శనా వ్యాసాలు నా మనసులో లేనేలేవు ప్రాచీన సాహిత్యం పైన కూడా గొప్ప విమర్శనలు చదివాను అవి కూడా నా మనసులో ఆ క్షణాన లేవు రామచంద్రారెడ్డిగారి విధానాన్ని మెచ్చుకున్నాను గాని విషయం గురించి నిర్ణయించే అవకాశం నాకు లేదు నేనిప్పటికీ 'నవత' చదవలేదు

విశాలాంధ్ర ధోరణి నాకూ బాగాలేదు తుమ్మల ఇక్కడికి వచ్చి నన్ను కలవలేదు "సాహిత్యంలో కొట్టుకులాడుతున్న వాళ్ళని కూడా left of right కమ్మంటారా ?" అని అడుగుదామనుకున్నాను వాళ్ళకుండేపాటి రాజకీయాలు మనకు లేవని వాళ్ళెందుకనుకోవాలో నా కర్థం కాలేదు కాని వాటి కోసం సాహిత్యాభిప్రాయాలను మెలిపెట్టటం ఏమీ బాగాలేదు

ఇంకేమైనా వివరాలు కావలిస్తే రాయండి అన్నట్టు ఇంకొక విషయం చెప్పాలి అది మీకు ఏ విధంగా నన్నా ఉపకరించవచ్చు నా రచనలంటే ఇష్టం ఉన్నవాడే, "నీ రచనల్లో ఒక్క memorable పాత్ర కూడా ఉండదేం ?" అని అడిగాడు నాకు పాత్రల కన్నా పాత్రల మధ్య ఉండే సంబంధాలని గురించిన యావజాస్తి అని చెప్పాను అది నిజమే కూడానూ ఉంటాను

❋

30-6-65

నిన్న శ్రీశ్రీ కనిపించాడు రా రా నడపబోతున్న అభ్యుదయ గురించి మీరు తనకి రాశారట రా రా తో బాటు మన పేర్లలో ఏదో ఒకటి associate చేస్తే బాగుంటుందని రాశారట నన్ను శ్రీశ్రీ సలహా అడిగితే వద్దని చెప్పాను కారణాలు చెబుతాను

1) రా రా ఈ అభ్యుదయను అభ్యుదయ రచయితల సంఘం తరఫున వెలువరించ బోతాడు ఆ సంఘంలో ఇప్పుడు కార్యవర్గం వారెవరో నాకు సరిగా గుర్తు లేదు - తుమ్మల పేరు తప్ప వాళ్ళ యాజమాన్యాన ఈ పత్రిక ఎట్లా నడిచేదీ తెలియకుండా మన పేర్లు పత్రికతో జత చెయ్యటంలో కొంత risk ఉండవచ్చు
2) వ్యక్తుల ధోరణులు ఎట్లా ఉన్నా, అభ్యుదయ రచయితల సంఘంలో open గా చీలిక యింకా రాలేదు నాకు తెలిసినంతవరకు వాళ్ళు dare చేసి చీలిక రానివ్వరు, నన్నడిగితే వాళ్ళు ఇప్పట్లో మనలో ఎవరినీ వదులుకోలేరు అలాటప్పుడు మనం అందులో ఉన్నట్టు గుర్తుగా మన వ్యాసాలు రాస్తాం వాటిని తొక్కిపట్టటం జరిగితే రంధి ఉండనే ఉన్నది అభ్యుదయలో పడే వ్యాసాలలో తప్పుడు ధోరణులుంటే విమర్శిస్తాం ఆ విమర్శలను తొక్కిపెట్టినా రంధి ఉండనే ఉంటుంది
3) మన పేర్లు సంపాదకవర్గంలో ఉండిన పక్షంలో పత్రికలో పడే వ్యాసాలను మనం ముందుగా approve చెయ్యవలసి ఉంటుంది లేని పక్షంలో మనం తప్పుడు అభిప్రాయాలకు commit అవుతాం తరువాత పీక్కోలేక చావాలి లేనిపోని ఘర్షణ

ఈ విషయాలను దృష్టిలో ఉంచుకుని, వాళ్ళు ఒకవేళ నాపేరు అడిగితే వద్దందామను కుంటున్నాను మన పేర్లు కొన్ని ఉండటం వల్ల ఏమైనా లాభం ఉంటుందని తోస్తే నాకు తెలియజేయండి శ్రీశ్రీకి కూడా రాయండి ఉంటాను

❋

8-7-65

మీ ఉత్తరం అందింది అభ్యుదయ publication set up ఎట్లా ఉండబోయేదీ తెలిసిన మీదట రా రా గారి పేరుతో బాటు మీ పేరు కూడా జతపరిచి, మీ ఇద్దరూ చూసి ఆమోదించిన వ్యాసాలే అందులో పడేటట్టు చూడగలిగితే సమస్యే లేదు అభ్యుదయ రచయితల కార్యవర్గంగాని, రా రా గాని ఈ విషయం ఇంతవరకేమీ రాయలేదు తుమ్మల మీకిచ్చే జవాబులో ఏదైనా తేలవచ్చు ననుకుంటాను Prevention or cure సమస్య ఆరోగ్యానికే గాని సాహిత్యానికి ఎలా వర్తిస్తుంది ? కొంత struggle లేకుండా సాహిత్యం ముందుకు పోలేదు అబద్ధాన్ని ఎదుర్కొంటేనే గాని, నిజంలోని నిజం కూడా స్పష్టం కాదు అంత మాత్రాన అభ్యుదయను యుద్ధరంగం చెయ్యాలని నా ఉద్దేశం కాదు ఘర్షణ బొత్తిగా రాకుండా కట్టుదిట్టం చెయ్యటం కూడా మంచిది కాదు ఉంటాను

❋

17-1-66

మీ 15 ఉత్తరం ఇవాళే అందింది కేరళకు మీరు కూడా వచ్చి ఉండవలసింది అక్కడ గమనించదగిన విషయాలు చాలా కనిపించాయి ప్రఖ్యాత కేరళ రచయితలు కొందరు దానికి రానేలేదు ఆ కేరళ వెళ్ళి వచ్చిన ఫలితంగా మూడు వ్యాసాలు రాశాను ఒకటి విశాలాంధ్రలో మీరు చూశారు రెండోది "తార"లో ఇవాళే వెలువడింది బహుశా మీరు చూస్తారు మూడోది జనశక్తికి పంపాను అది ఇంకా అచ్చు కాలేదు - అయేదీ లేనిదీ కూడా తెలియదు

మీరు నా రచనల మీద రాసిన వ్యాసం భారతిలో పడితే చూస్తాను నన్ను "quote" చెయ్యటానికి నాకేమీ అభ్యంతరం లేదు మీరు రాసిన విమర్శమీద నేను తిరిగి మళ్ళీ విమర్శ చెయ్యటం అంటూ జరగదు చిక్కేమిటంటే నేను నాకు పరితను కాను రచయితగా ఏది ఎందుకు రాశానో కొంతవరకు చెప్పవచ్చుగాని, పాఠకులకు నా రచనలు ఎట్లా ఉంటాయో నేను చెప్పలేను అందుచేత నేను విమర్శకులకు జవాబులివ్వను

మీరు ఇప్పట్లో మద్రాసు కేసి రారా ? ఉంటాను

❋

19-2-66

ఇవాళ ఉదయమే బళ్ళారి నుంచి ఒక అభిమాని కార్డు రాశాడు - మీరు నాకు న్యాయం చెయ్యలేదని బాధపడుతూ Critic తనకు తోచినది రాయటంలో తప్పులేదని అతనికి

సమాధానం రాసి పోస్టుకు పంపుతుండగా చక్రపాణిగారు మీ వ్యాసం గల 'భారతి' నా వద్దకు పంపారు (బళ్ళారి ఆయన కార్డు చూసే దాకా నాకు మీ వ్యాసం పడ్డట్టు కూడా తెలీదు)

వ్యాసం చాలా దీర్ఘంగా వుంది చదవటానికి రెండు గంటలు పట్టింది కాని అందులో నాకు "అన్యాయం" జరిగినట్టు నేను భావించలేదు రచయితగా నేను కోరి పెట్టుకున్న limitations ను మీరు చక్కగానే వివరించారు

మీ విమర్శవల్ల నాకే తెలియని విషయాలు కొన్ని స్పష్టమయాయి నేను ఎప్పటికప్పుడు రాసేదాన్ని గురించే ఆలోచిస్తాను గాని, అన్నిటినీ ఒక్కసారిగా కలిపి చూడలేను (నేను రాసినది మళ్ళీ చూసుకోకపోవటం చేత, ఇతర రచయితలకన్న నాకిది మరింత handicap) నా fixed ideas కొన్ని మీరు స్పష్టం చేశారు

మీ విమర్శలో లేని విషయం కూడా ఒకటి స్పష్టం చెయ్యాలి మీ విమర్శ చదివితే ఒకే fixed outlook తో, ఏక సమాధిలో నేనీ పుస్తకాలు రాశాననిపిస్తుంది అది నిజం కాదు నా కుండే convictions కొన్ని ప్రతిరచనలోకీ తప్పనిసరిగా వచ్చినప్పటికీ అన్నీ ఒకే intensity తోగాని, ఒకే mood లో గాని రాసినవి కావు ఉదాహరణకు "కులం లేని మనిషి", "మారుపేర్లు" సినిమా themes గా - "కులం లేని మనిషి" musical గా - పనికి వస్తాయని రాసినవి "అరుణోదయం" యువ ప్రచురణలకు అవసరంగా పుస్తకం కావలసివస్తే రెండు మూడు రోజుల లోపల బరికినది 'కొత్త కోడలు', 'కొత్త అల్లుడు' కేవలం lighter vein లో రాసినవి ('బెదిరిన మనుషులు', 'బ్రతుకు భయమూ' హాస్యం పెట్టి రాసినా light గా రాసినవి కావు For some reason అవి రెండూ నన్ను కొంత తినేశాయి ) 'తార' అన్నిటికన్నా చెత్తకింద రాసినది - "కినిమా"లో సీరియలైజ్ చెయ్యటానికి ! "చదువు" documentary అందులో hero involve అయితే నా purpose చెడుతుంది "గడ్డు రోజులు" కూడా అంతే అందుకే "గడ్డు రోజులు"ను "చదువు" continuation గా భావిస్తాను "గడ్డు రోజులు" తరువాత period గురించి ఇంకో నవల రాయాలని ఉంది అందులో కూడా hero involve కాకూడదు overlap కొంత తప్పనిసరిగా ఉంటుంది

మీరీ వ్యాసాన్ని ఎంత శ్రమపడి రాశారో నేనూహించుకోగలను అదే నాకు పెద్ద compliment మీ విమర్శలో వున్న ఇతర compliments సంగతి వేరే చెప్పనవసరం లేదు చాలా కృతజ్ఞుణ్ణి ఉంటాను

❋

25-2-66

You must excuse my writing this in English I got your letter I have never any doubt about your sincerity or capacity as a critic Critics can go wrong, but the truth they reveal is the most precious part of criticism Your criticism of Arudra as a poet would have been accept-

able if it didnot go round his 'త్వమేవాహం' The only objection I heard - and accepted - was that it gave too much length to 'త్వమేవాహం' without giving it much importance The recent two-instalment review on 'విషాదభారతం' was excellant

I am answering one or two points about my way of writing It is true that I donot invoke nature as a shaper of human emotions Partly I do not believe in it except as an "artificial stimulant" One can get in the moon or clouds or rain or cyclones to reinforce the moods of the characters but that would be making the characters "Children of the gods" I can't handle such characters If the seasons form the integral part of the happenings I donot mind mentioning them - as I did, very slightly only, in "పంచ కల్యాణి" If leaning on atmosphere is artistry, it is not mine

I go in for lot of technique, but I am happy only when some clever man notices it I keep it so unobtrusive that the common reader is not conscious of the Technique, I may say, is my secret pleasure I find పద్మరాజు introduce in the same para two persons of opposite natures – obvious contrast I too go in for foils, parallals in characterisation and incident, but I don't thrust them in the reader's face I feel it is not modest It is like standing naked in a public place

When I start writing something I only see that I have a new purpose I do not care whether I am introducing a new character or new situations

As you have suggested in your article, I treat even the environes which are very familiar to me as a "lay" person I can go whole hog into film making, journalism, metal industry, business and things like that, but don't because I would be alienating myself from the reader who is unfamiliar with those activities I donot go into communist activities for an entirely different reason I was never in a position to create a positive communistsic hero All those I knew were only in transition Time is not ripe - at least for me - to tell a story of a communist who will not later make my writing false Even in "ఎండమావులు" I made Raju reveal his dreams only when they didnot come true I think, for the same reason Chekhov was forced by his friends to change

the profession of one of his communist characters - the only one he attempted I do not know how far all this information will help you to assess my work The poor reader is not supposed to know how I think, except through reading my stuff

*

17-5-66

మీ 16వ తేదీ ఉత్తరమూ రా రా గారి ఉత్తరమూ అందాయి ఉత్తరం చదివాక నాకు రాయవలసింది అట్టే ఉన్నట్టు కనపడలేదు The author makes a bad go-between for the critics రా రా గారు ఎత్తిన అసలు point నేను రచనల విషయంలో బుద్ధివాదినా, కాదా అనేది అవుననే నా దృఢనమ్మకం కానని రా రా గారు నిరూపించటానికి ప్రయత్నించారు బుద్ధివాదం అనేదాన్ని గురించి నేననుకునేదీ ఆయన అనుకునేదీ ఒకటి కానందువల్ల ఈ చిక్కు వచ్చిందనుకుంటున్నాను రచనలో emotion ఉండటమూ, రచించటంలో emotion ఉండటమూ ఒకటి కాదు రచించటంలో నాకు emotion ఏమీలేదు Calculated గానూ, మళ్ళీ మాట్లాడితే cold blooded గా కూడా, రాస్తాను ప్రణయ ఘట్టాలు రాసేటప్పుడు శృంగార భావమూ, విషాదఘట్టాలు రాసేటప్పుడు కరుణా నన్నావహించవు పాత్రలు romantic గా ప్రవర్తించటం వేరు యువకులను romantic moods లో చిత్రించాలి అది కూడా వాళ్ళ స్థాయిని మించిపోగూడదు వయసు మళ్ళినవారిలో కూడా Social Bohemian, అందులో ఒక్కొక్కప్పుడు కాస్త romantic touch, అది కూడా కొందరిలో మాత్రమే - కుడిచి కూర్చున్నవారిలో - ఉంటాయి అంతమాత్రాన రచయిత romantic అనిగాని, emotional అనిగాని చెప్పటానికి లేదు Emotional writer ఏ పాత్రకూ సంబంధం లేకుండానే తాను emotional అయిపోయి, పాత్రలనూ, సందర్భాలనూ మించి excite అవుతాడు

రా రా గారి ఇంకో పాయింటు, ప్రగాఢమైన అనుభూతులను గురించి రాయటం cheap trick అనేసి, అలాంటివి రాసేవాళ్ళను నేను appreciate చేస్తున్నానని రాచకొండవారిని ఉదహరించారు ఏది ప్రగాఢమైన అనుభూతి ? అది చాలా relative term కాదా ? తిండికి లేని పేదవాళ్ళు మాడి చావటం ప్రగాఢమైన అనుభూతి కాదు, అది వాళ్ళ నిత్య జీవితం దాసీపిల్ల రాజకుమారుణ్ణి పెళ్ళాడటం ప్రగాఢమైన అనుభూతి వాస్తవికతను ఆశ్రయించిన రచయిత పాత్రల తలలకూ, స్థాయికీ మించిన అనుభూతులను సృష్టించటం చాలా cheap trick అని నేనిప్పటికీ అంటాను కొందరు ఆడ నవలా రచయిత్రులు ఈ cheap tricks చెయ్యడం మనం చూస్తున్నాం రాచకొండవారి కథల్లో పాత్రల స్థాయికీ, అవి పొందే అనుభూతులకూ చాలా వాస్తవమైన సంబంధం ఉన్నది ప్రగాఢత్వం ఏదైనా వుంటే అది ఆయన శైలిలోనూ, వచన "కవిత్వం"లోనూ ఉంటుంది ఆయన రచనలలో కూడా subjective గా ఉన్నట్టు కనిపించేవి నాకు అంతగా నచ్చవు

'లౌక్యం' అనేదాన్ని గురించి రా రా గారు చెప్పేది సబబే పేర్లకు సంబంధించిన slips చెప్పుకోదగినవి కావు Journalese గురించి రా రా గారన్నది రైటే (Journalese Jargon of bad journalism)

నవలలు రాసేవాడికి style మాత్రమే కాదు, పాఠకుడిలో subjective emotion ను రేపగల శక్తి కూడా ఉండాలి

"సౌందర్యం" అంటే art లో aesthetic beauty యే నన్న విషయం రా రా గారితో ఏకీభవిస్తాను

రా రా గారన్నట్లు sensitiveness అన్నది మీ వాక్యంలోకి రాలేదు

చిరస్మరణీయ పాత్రలు లేకపోవటం గురించి నేను మీకు రాసిన ధోరణి లోనే రా రా కూడా రాశారు అందుచేత అభిప్రాయ భేదం లేదు

ప్రేమను ఎవరైనా హృదయ వ్యాపారంగానే చిత్రిస్తారు కాని నేను sex ను physiological necessity గానూ, temporary infatuation గానూ మాత్రమే గాక casual activity గా కూడా చిత్రించాను

నన్ను చలంతో పోల్చటం నేనూ ఒప్పుకోను ఆయన రాసేటప్పుడు తానే excite అయిపోతాడు తన అభిమాన పాత్రలకు ఇష్టంలేని పాత్రలను తానే దుమ్మెత్తిపోస్తాడు ఆ తిట్టటం కూడా emotional గా ఉంటుంది ("బొండు ప్లీడరు" - 'మైదానం' లోనేనా ?)

రా రా గారు "పచ్చకాగితం", "కురూపి" కథలలోకి లోతుగా వెళ్ళారు అది మీరు రాసిన విమర్శకు పెడగా ఉన్నది మీరు నా ఏ రచనలోకీ లోతుగా వెళ్ళలేదనీ, రచయితగా నన్ను అంచనా కట్టటానికి నా రచనలు కొన్ని ఆధారం చేసుకున్నారనీ నేననుకుంటున్నాను "కొన్ని నవలలను గురించి మీరు చేసిన observations అసంపూర్ణంగానూ, కొన్ని చోట్ల superficial గానూ" ఉండటానికి కారణం నేను బుద్ధివాదినని మీరు పొరబడటమని రా రా గారి అభిప్రాయం మీరసలు మీ విమర్శను రచనలపైనగాక, రచయితపైన కేంద్రీకరించటం చేతనని నా అభిప్రాయం రచయితగా నన్ను గురించి మీరు కట్టిన అంచనా గురించి నాకేమీ పేచీ లేదని అప్పుడే తెలిపాను రచనలను లోతుగా తరిచే వాళ్ళు మీతో ఏకీభవించని సందర్భాలుంటే ఉండవచ్చు రా రా గారి ధోరణి ప్రధానంగా అలాగే ఉన్నది

నేను ఎల్లుండి (19వ తేదీ) G T కి సకుటుంబంగా ఢిల్లీ బయలుదేరుతున్నాను మేం తిరిగి రావటానికి మూడు వారాలు పట్టవచ్చు మీరు మద్రాసు వచ్చేటట్టుంటే జూన్ 10 తరవాత రండి మద్రాసు అప్పటికి కొంచెం చల్లబడవచ్చు ఉంటాను

*

17-3-67

మీ ఉత్తరమూ, Manifesto వగైరా అందాయి 66 అక్టోబరు లోనే జహీర్ నాకు రాస్తూ ఆర్గనైజింగ్ కమిటీలో నా పేరు చేర్చటానికి అనుమతి కోరాడు సభ నవంబరులో జరుగుతుందన్నాడు ఢిల్లీలో చలిగా ఉంటుంది, రాలేనని రాశాను రానవసరం లేదు, పేరు

ఇయ్యమన్నాడు ఇచ్చాను సభ నవంబరులో జరగలేదు, డిసెంబరులో జరిగింది నన్ను సంతకం చేసి పంపమని ఒక తీర్మానం కాపీ పంపాడు అందులో చీనా మీద దుమ్మెత్తిపోస్తూ ఒక పేరా ఉన్నది చీనా రష్యా తగాదాల్లో మనమెందుకు కలగజేసుకోవాలని, నేను సంతకం చేసి పంపలేదు అదీ జరిగిన సంగతి ఇటీవలనే Contemporary Indian Writings కు చందాకట్టి latest copy తెప్పించాను అది I P W A కి మచ్చు అయితే, ఇంత హీనమైన సంస్థ మరి ఉండదు Mulkraj Anand దగ్గిర నుంచీ దాని వెనుక ఉన్నారు పత్రిక చూడబోతే వట్టి rag అన్నీ అచ్చు తప్పులే ఈ level లోనేనా చూసేది అని అడగవచ్చు నిజానికి కాదు కాని దీని నిర్వాహకులకు తాము చేసే ఇతర పనులన్నింటిలోకీ ఇది అత్యంత హీనమైనది కాకపోతే ఈ పత్రిక ఇంత ధ్వంసంగా ఉండదు అదే పాయింటు

నేనైతే ఈ సంస్థలో చేరను కారణాలు 1 వాళ్ళకి మనపేర్లు కావాలి, అప్పుడప్పుడూ సంతకాలు కావాలి మనమూ మన సలహాలూ అవసరం లేదు 2 ఢిల్లీ మనకు చాలా దూరం, అన్నప్పుడల్లా వెళ్ళలేం అవసరమైనప్పుడు కూడా యుద్ధాలు చెయ్యలేం, కష్టపడి వెళ్ళి యుద్ధం ప్రారంభించినా మైనారిటీలో ఉండిపోతాం ఢిల్లీలో top most Hindi writers ఉన్నారు, కాని 100కి 99 మంది Establishment కి చెందినవాళ్ళే ప్రతి కుక్క నోటా ఒకటీ రెండూ ఎముకలు 'Progressive Writers' meeting అంటే వచ్చేవాళ్ళు ఇటువంటి వాళ్ళూ, sub-establishment వాళ్ళూనూ సజ్జద్ జహీర్ ఇహమూ పరమూ కూడా సంపాదించుకున్నాడు కమ్యూనిస్టుల గౌరవమూ, establishment మన్ననా కూడా పొందాడు Mulkraj Anand వంటి వాళ్ళందరూ ఇటువంటి పెద్దలే

మనకు నిజంగా కావలసింది అభ్యుదయోద్యమమైతే ప్రాంతీయంగానే అది కొనసాగాలి గాని All-India గోదాలో దిగి ఏం ఉద్ధరించబడతాం ? ఆంధ్రా level లోనే గుడ్లు వెళ్ళబెట్టాం

ఈ విషయం మీరు కూడా కాస్త ఆలోచించి ఏం నిర్ణయించేదీ తెలియబరచండి ఉంటాను

PS దిగంబరుల మీద మీ వ్యాసం చాలా బాగుంది

*

17-1-68

మీ ఉత్తరం అందింది ఇదొక ఫార్సు ఈసారి Laughing Stock కావటం నా వంతు వాళ్ళ గుర్తింపు ఎవరిక్కావాలి ? నాకక్కర్లేదు దక్కేది డబ్బే ఉంటాను

*

28-2-68

మీ ఉత్తరం ఇప్పుడే అందింది ప్రజానాట్యమండలి లెఫ్టిస్టుల చేతిలోకి పోతున్నదని రైటిస్టులు చాలా బాధపడుతున్నట్టు తెలుస్తున్నది వాళ్ళు "మేలుకొని" అభ్యుదయ రచయితల

సంఘాన్ని పునరుద్ధరిస్తున్నట్టు నా అనుమానం అభ్యుదయ ప్రణాళిక అమలు జరిగే పక్షంలో సంఘం ఏ పార్టీ ఆధ్వర్యాన నడిచినా మనం అభ్యంతరం చెప్పనవసరం లేదు ప్రణాళికాబద్ధంగా నడవకపోతే కరిచే హక్కు ఉండనే ఉన్నది

మీరన్నట్టుగానే ఇందులో సజ్జద్ జహీర్, గజ్జల మల్లారెడ్డి ప్రభృతులంతా ఉంటారు పత్రిక రావటం అనుమానాస్పదం వచ్చినా ఎంతో కాలం నడవదు వెనక మనం ఎదుర్కొన్న అవాంతరాలన్నీ ఇప్పుడూ ఉంటాయి మరికొన్ని అదనంగా కూడా ఉంటాయి అన్నీ ముందుగా తెలిసే నేను సంతకం పెట్టాను మీరు కూడా పెట్టవచ్చును రేపు అభ్యుదయ రచయితల సంఘం పేర చచ్చు రాజకీయ తీర్మానాలు చేసి పత్రికలకు పంపితే దుమ్ము రేపే వాళ్ళుండటం అవసరం కాదా ?

అనిశెట్టి నన్ను కలుసుకోవటానికి time లేక ఎవరి ద్వారానో కాగితం పంపుతూ నన్ను రెండు రోజుల్లో కలుసుకుంటానని కబురు చేశాడు, పది పదిహేను రోజుల క్రితం

"అభ్యుదయ" పునరుద్ధరించినా మానినా, కొన్ని పత్రికలు ఒకేసారిగా, కూడబలుక్కున్నట్టుగా, రాబోతున్నాయి సోమసుందర్ "కళాకేళి" అభ్యుదయ మాసపత్రికగా ప్రారంభించబోతున్నట్టు మీకు రాసే వుండాలి రాచమల్లు రామచంద్రారెడ్డి త్రైమాస పత్రిక గురించి కూడా మీకు తెలిసే వుండాలి హైదరాబాదునుంచి ఎవరో "క్రాంతి" ప్రారంభించాలని చూస్తున్నారు వీళ్ళు genuine గా కనిపిస్తున్నారుగాని అనుభవం ఉన్నట్టు లేదు సృజనా, నవతా ఉండనే ఉన్నాయి - for what they are worth ఇన్ని పత్రికల మధ్య కొంత sanity రావటానికి వీలున్నదేమోనని నా ఆశ నేను కూడా చాలా disgusted గానే feel అవుతూ, 'రాయటం మానేశాను బాబో' అని రచనలడిగిన వారందరికీ రాస్తున్నాను అయినా జలగల్లాగా పత్రికల వాళ్ళు నన్ను వదల్లేదు ఏదో రాయిస్తూనే వున్నారు ఏమీ లేకపోతే నా ఉత్తరాలలో నుంచి భాగాలు వేస్తున్నారు (వరవరరావు)

నాకున్నదల్లా ఒక్కటే ఆశ కుర్రకారు రచయితల్లో శక్తిమంతులున్నట్టు కనిపిస్తుంది Commercial పత్రికలు వారికి అవకాశాలివ్వవు ఈ పత్రికల ద్వారా వారి గొంతు వినిపించవచ్చునేమో

అభ్యుదయ రచయితల సంఘం innocuous affair కాకపోనివ్వండి మనని చేరనివ్వటానికి వాళ్ళు భయపడాలి గాని మనం భయపడనవసరం లేదు కళలు రాజకీయాలకు ఎడంగా పోనవసరం లేదనీ, రాజకీయ పార్టీలకు అందకుండా ఉండాలనీ నేను గట్టిగా వాదిస్తున్నాను అట్లా వాదించటంలో నాకు మంచి పాయింటే ఉన్నది రేపు అభ్యుదయ రచయితల సంఘాన్ని చైనాను తిట్టటానికో, రష్యాను బలపరచటానికో ఉపయోగిస్తే నేను పోట్లాడే స్థితిలో ఉండాలి దీన్ని గురించి మీకు అభిప్రాయ భేదం ఉంటే రాయండి Detailed గా చర్చించుకుందాం ఉంటాను

❋

22-3-68

మీ 12 ఉత్తరం సకాలంలోనే అందింది జవాబు రాద్దామనిదాన్ని ఒకచోట భద్రంగా పెట్టి దాని మాటే మరిచాను నాకు కూడా ఆహ్వానం మీకు అందినట్టే అందింది 8, 9 తేదీలలో నాకు పనితొందర జాస్తిగా ఉండడం చేత వెళ్ళలేదు అందులో ఆదివారం కలిసి వచ్చినా, కనీసం ఆ రోజుకు వెళ్ళి ఉండేవాణ్ణే అనిశెట్టి కూడా రాకపోవటం ఆశ్చర్యం సినిమా పనిజాస్తిగా ఉండి ఉంటుంది

అభ్యుదయ రచయితల manifesto మీరన్నట్టు సాహిత్యపరంగానే ఉండాలి Anti Imperialism వగైరాలన్నీ details Manifesto copy ఇంకా నా దాకా రాలేదు రావచ్చుననుకుంటాను అసలు సంగతేమిటంటే దీన్ని organize చేసే శక్తి తుమ్మలకు ఉండదని నా అనుమానం ఇదంతా సక్రమంగా జరుగుతుందని నాకు తోచదు మహాసభ జరపటం పెద్ద feat కాదు ఆ తరవాత జరగవలసిందే జరగదు ఏమైనా తుమ్మల ఇక్కడికి వచ్చినప్పుడు frank గా అన్ని సంగతులూ మాట్లాడి మీకు తెలియజేస్తాను ఉంటాను

❋

29-10-69

నమస్కారాలు వారం 10 రోజుల క్రితం టి వేణుగోపాలరావు గారో, అంతకు ముందు చలసాని ప్రసాద్‌గారో చెబితే, మా నటరాజయ్యగారిని "అనసూయ" పత్రిక గురించి అడిగాను ఒక్క కాపీ కూడలేదని చెప్పారు ఆ మాట వారికి అందజేశాను మీరు చెప్పేది ఎప్పటి వార్త ? 'అనసూయ' పత్రికలో శ్రీశ్రీ వి చాలా వ్యాసాలుంటే, అవి పోవటం విచారకరమే మీరు గోఖలేకు రాసిన ఉత్తరం redirect చేస్తున్నా గోఖలే address 10, Lakshmi Colony, Madras - 17 ఉంటాను

❋

8-4-70

నమస్కారాలు మీ కార్డు అందింది శ్రీశ్రీ అనువాద కథను కాపీ చెయ్యటానికి ఎవరూ లేరు మాకున్న staff skeleton staff ఎవరికీ time లేదు బంగోరె సగం కాపీ చేసినట్టు కనిపిస్తుంది తొందరలేదు గనక మిగతా సగం ఎప్పుడన్నా కాపీ చేసుకోవచ్చు

అ నా రా awards విషయంలో ఒక దారుణం జరిగింది మీరు award ఇచ్చిన "ముత్యాల పందిరి" 1964లో serialize అయింది ! పుస్తకంగా వెలువడింది 1969 లోనే అనుకోండి 1969లో వెలువడిన కథల సంపుటాలను ఎన్నుకోనిచ్చారు కారు అవి పత్రికలలో ఎప్పుడోపడి ఉంటాయన్నారు "ముత్యాల పందిరి" మాటేమిటి ? ఈ award నేను తీవ్రంగా వ్యతిరేకిస్తాను మీరు కూడా ఆలోచించవలసిన విషయం ఉంటాను

❋

10-4-70

నమస్కారాలు మీ ఉత్తరం అందింది కథలకు ఒక రూలూ, నవలలకు ఒక రూలూ ఉన్నట్టు నాకు తెలియదు "ముత్యాల పందిరి" తీసి చూస్తే అది 64 లోనే serialize అయినట్టు అందులో చెప్పి ఉన్నది అది మీరు గమనించలేదేమోనని రాశాను 'నైమిశారణ్యం' సంగతి నాకు గుర్తు లేదు 'ముత్యాల పందిరి' బహుమతికి అర్హం కాదని నా ఉద్దేశం ఎంత మాత్రమూ కాదు ఈ awards కొత్త రచయితల ప్రోత్సాహానికన్నది కూడా నాకు సరిగా గుర్తు లేదు ఆంధ్ర ఎకాడమీ వారి అవకతవకలు లేకుండా ఈ awards సక్రమంగా ఉండగలందులకే అనుకుంటూ వచ్చాను మీరు చెప్పినమాటలే ముళ్ళపూడి వారూ చెప్పారు ఇప్పుడు పథకం బోధ పడింది ఉంటాను

*

25-6-70

నమస్కారాలు మీ ఉత్తరం అందింది ఈ సదస్సును ఏర్పాటు చేస్తున్నది ఆంధ్ర పాలక వర్గమూ, విశాలాంధ్ర గ్రూపూ అని నాకు తెలుసు నిర్వహణ నక్షత్ర సప్తకానిది ఇందులో ఎవరిని గౌరవించి, సాహితీపరులుగా హాజరు కావాలో నాకు బోధ పడలేదు దీన్ని శ్రీశ్రీ, మీరు, మీలాంటి వాళ్ళు బహిష్కరించే పక్షంలో సదస్సు ఎలా utter failure అయేదీ నాకు తెలుసు కేరళలో అఖిల భారత రచయితల సమ్మేళనం జరిగినప్పుడు తఖజి శివశంకరం పిళ్ళే, శంకర కురూప్ దానికి రాకపోతే అట్టుడికి పోయింది శివశంకర్ పిళ్ళె రానే లేదు రేపు సమ్మేళనం ముగుస్తుందనగా సాయంకాలం wire వచ్చింది - శంకర కురూప్‌కు లక్షరూపాయలు నిర్ణయమయిందని ఆఖరు సమావేశం అతని సన్మానసభగా మార్చి అతన్ని రావటానికి ఒప్పించి, అప్పటికప్పుడు who is who అచ్చు వేయించి, అందులో అతని పేరు చేర్చి, బయలుదేరి వచ్చేస్తుండగా delegates కు పంచారు అందుచేత ఈ సదస్సును కొందరు boycott చెయ్యటం అల్ప విషయం కాదు - అల్పులకు తప్ప

అభ్యుదయ రచయితల సంఘం విశాలాంధ్ర గ్రూప్ చేతిలో ఉండనే ఉన్నది అందులో శ్రీశ్రీ లాంటి పెద్దవారున్నారంటే అది reactionary politicians యొక్క cultural front అవుతుంది సదస్సులో వివాదాస్పదమైన అంశాలు రావు శ్రీశ్రీని గురించీ దిగంబర కవులను గురించీ చాలా compromise అయే మాట్లాడతారు శ్రీశ్రీకి డబ్బు లంచం కూడా ఇస్తారు దీనితో శ్రీశ్రీ వాళ్ళకు దాసోహమవుతాడని కాదు మీరన్నది నిజం - అభ్యుదయ రచయితల ప్రణాళికలో ఈనాటి విప్లవ కవిత్వం ఇమిడేది కల్ల విప్లవ రచయితల సంఘం తప్పక పెట్టించండి అందులో పదిమంది ఉన్నా చాలు అందులో నేను తప్పక ఉంటాను ముగ్గురు నలుగురు దిగంబర కవులూ, వరవరరావు గ్రూపు ఉన్నారు చాలు విప్లవ రచనలు కల్పనా సాహిత్యంలో ఏ రూపం తీసుకుంటాయో చూడాలని ఉంది నేను కథలూ, నవలలూ రాయటం

మానేశాను యధాశక్తి వ్యాసాలు మాత్రం రాస్తున్నాను కాని కొత్త రూపాలు రావలసి ఉన్నది, వస్తాయి కూడా ముఖ్యంగా కథలూ, నవలలూ రావాలి వాటి కోసం ఎదురుచూస్తున్నాను

'Wretched of the Earth' ఇక్కడ దొరుకుతుంది ఒకటి రెండు రోజులలో మీకు పంపుతాను ఉంటాను

❋

27-6-70

నమస్కారాలు 23న మీరు కృష్ణాబాయిగారికీ, ప్రసాద్ గారికీ రాసిన లేఖ చూశాను హైదరాబాద్ నుంచి నాకింకా లిటరేచరు పంపుతూనే వున్నారు పెద్ద పెద్ద పేర్లన్నీ మన మొహాల flaunt చేస్తున్నారు ఈ అభ్యుదయ సదస్సు ఇంత ఆర్భాటంగా చేస్తున్నదెవరు ? అభ్యుదయ సంఘం వారైనాకారు - మార్క్సిస్టులు కారు, అభ్యుదయ వాదులు కారు, నర హంతకులు, మనుషుల్ని వేటాడే వాళ్ళు ! వీళ్ళకు అభ్యుదయ సాహిత్యంతో ఏం పని ? తుమ్మలా, కవులూరీ, బొందలపాటీ, చంద్రం మొదలైన వాళ్ళు ఏ మొహంతో ఇందులో పాల్గొంటున్నారు ? ఈ వేదిక మీద తిరుగుబాటుదారుననుకొనేవాడు నోరెత్తటానికి ఉంటుందా ? Manifesto లో welfare of the working class అన్నారు - Revolt of the working class రాకుండా welfare లేదని వాళ్ళకు చెబుదామా ? Humane of realistic (writing) out look ఉన్నంతకాలం ఏమి ఉద్ధరింపు జరిగింది ? Resolutions నచ్చకపోతే walkout చేద్దామన్నారు బాగానే ఉంది అందుకోసమని ప్రభుత్వం డబ్బుతో, ప్రభుత్వం guestsగా పోవాలా ?

నేనింకొకటి అడుగుతాను అభ్యుదయ రచయితలతో తెగతెంపులు చేసుకోకుండా అంతకన్న progressive organisation పెట్టలేమా ? ఒకప్పుడు నవ్య సాహిత్య పరిషత్తుతో తెగతెంపులు చేసుకోకుండా అభ్యుదయ రచయితల సంఘంలో చేరాం మనది అలాచేయటం తప్పనిసరి అయిన రాజకీయ పార్టీ కాదు నేను నా standpoint రాశాను మిమ్మల్ని పోకుండా ఆపటానికి కాదు ఉంటాను

PS The Wretched of the Earth దాసరి సుబ్రహ్మణ్యం గారిది Book-Post లో ఇవాళే పంపుతున్నాను మీరు చదివాక తిప్పి పంపండి ఉంటాను

❋

30-6-70

నమస్కారాలు మీ నిన్నటి ఉత్తరం ఇప్పుడే అందింది ఇది మీకు బెజవాడ కైతే తప్పక అందుతుందని తుమ్మలగారి కేరాఫ్‌లో రాస్తున్నాను

ఇవాళే నాకు మొదటి ఉత్తరం దిగంబర కవుల నుంచి వచ్చింది వాళ్ళు సదస్సును boycott చేస్తున్నమాట నిజమే అయితే కారణాలు చెప్పలేదు నాకు గల కారణాలే ఉంటాయి

వాళ్ళు కరపత్రం వేస్తున్నట్టు కూడా నాకు తెలీదు వాళ్ళ కరపత్రంలో నా పేరు చేర్చాలంటే, వారి కారణాలూ, నావీ కలవాలి

మరొక రచయితల సంఘం పెట్టదలిస్తే అభ్యుదయ రచయితల సంఘాన్నీ, ఉద్యమాన్నీ repudiate చెయ్యాలని మీరు అభిప్రాయపడుతున్నట్టు కనిపిస్తుంది నాకు ఆ ఉద్దేశం లేదు అభ్యుదయ రచయితల ఉద్యమం గురించి నేను ఎప్పటికీ గర్విస్తాను దిగంబరకవులు తమ ఉత్తరంలో తాము అభ్యుదయ రచయితలమనే రాశారు కూడా కాకపోతే, సాహిత్యం అభ్యుదయోద్యమం దాటి ఇంకా ముందుకు పోవాలనే నా ఉద్దేశం అభ్యుదయ రచయితల సంఘం manifesto ను విప్లవ రచనలకు అనుకూలంగా మార్పులు చేసినట్టయితే మరొక సంఘం, కూడా అవసరం లేదు కాకపోతే కొందరు జారిపోతామనవచ్చు అభ్యుదయ రచయితల సంఘం నవ్య సాహిత్య పరిషత్తుపైన తిరుగుబాటు చేసి ఏర్పడ్డది కాదు ఇప్పుడైనా అభ్యుదయ రచయితల సంఘం మీద తిరుగుబాటు చేసి మరో సంఘం పెట్టవలసినంత గూడ గత్తర ఏమీ లేదు ఈ విషయాలు తుమ్మలగారితో కూడా ఆలోచించండి

శ్రీశ్రీ ఇవాళ పత్రికలకు ఒక ప్రకటన పంపుతున్నాడు ఈ జరగబోయే సదస్సు గురించి పబ్లిక్ చర్చ జరిగే పక్షంలో నేను తప్పక statement ఇస్తాను నేను boycott చేసేది అభ్యుదయ రచయితల సంఘాన్ని institutionalize చేసే ప్రయత్నాన్నేగాని, అభ్యుదయ రచయితల సంఘాన్ని కాదు ఇందుకు విరుద్ధంగా లేని ఏప్రకటనలోనైనా నా పేరు చేర్చవచ్చు ఉంటాను

*

10-7-70

నమస్కారాలు మీ ఉత్తరం అందింది నేను తుమ్మలతో మాట్లాడమన్నది, అభ్యుదయ రచయితల సంఘం విప్లవ ధోరణిలోకి వస్తుందని కాదు రాదని రుజువు చెయ్యటానికే మీకు సంకోచాలేమీ అవసరం లేదు జరిగినది సక్రమంగానే జరిగింది ప్రణాళికలో ఆక్షేపించదగినదేమీ లేదు దిగంబర కవులను "నక్సలైట్స్" అనటం దుష్ప్రచారం శ్రీశ్రీని అనటం కూడా అంతే

ఒక్క నా విషయం మనం స్పష్టంగా గుర్తుంచుకోవాలి రాజకీయ విశ్వాసాలూ, పార్టీ అభిమానాలూ ఎవరివి వారికి ఉండవచ్చు కాని సాహిత్యం జీవితంలోని విప్లవ దృక్పథాన్నీ, ధోరణులనూ బలపరచాలన్నది 'విరసం' ఆశయం నామటుకు నేను రాజకీయ నక్సలైట్ ధోరణిని unconditional గా బలపరిచే స్థితిలోలేను వాళ్ళ పూర్తి వైఖరి నాకు అర్థం కాలేదు కూడా ఉదాహరణకు - నక్సలైట్లూ, మార్క్సిస్టులూ కలకత్తాలో ఎందుకు కొట్టుకు చస్తున్నారో నాకు తెలియదు అట్లాగే మార్క్సిస్టులు అవలంబించే కొన్ని విధానాలు నాకు అర్థం కావటం లేదు వాళ్ళు ఎన్నికలలో పాల్గొని ఏం చేద్దామనుకుంటున్నారు ? యునైటెడ్ ఫ్రంట్స్ దేనికి ? కేంద్రం వాళ్ళకి ఎప్పుడు చిక్కేటట్టు ? ఇప్పుడున్న రాజ్యాంగం కింద వాళ్ళు మంత్రిత్వాలు వెలగ బెట్టకపోతేనేం !

ఒక్కమాటలో చెప్పాలంటే నేను ఏ కమ్యూనిస్టు పార్టీనీ ఈనాడు మనస్ఫూర్తిగా ఆమోదించలేకపోతున్నాను కాని, తిరుగుబాటు చేస్తున్న ప్రజలపట్ల నాకు సంపూర్ణమైన

సానుభూతి ఉన్నది ప్రజలు పరిస్థితుల మీద తిరగబడుతున్నారు తిరుగుబాటు తప్ప మార్గాంతరం లేదని కేరళ, బెంగాలు కమ్యూనిస్టుల పరిపాలనలు రుజావు చేశాయి కమ్యూనిస్టులు రాష్ట్రాలను పెద్ద మెజారిటీతో జయించినా కేంద్రం వాళ్ళను పాలించనివ్వదు రాజ్యాంగం ప్రజలకు అనుకూలంగా మారదు పోలీసు బలం దుర్మార్గుల కాపు కాస్తుంది ప్రజలు సాయుధ తిరుగుబాటు చేయక ఏం చేస్తారు ? ఇవాళ ప్రాంతీయంగా ఉన్న తిరుగుబాట్లు విస్తరించి రేపు విప్లవ రూపం దాల్చుతాయి ఇది తప్పదు ప్రస్తుతం ప్రజల తిరుగుబాటు వెనక ఉన్నది ఎవరైనా నాకు ఒకటే మితవాద కమ్యూనిస్టులు భూములను ఆక్రమించటానికి తిరుగుబాటు లేవదీస్తే నాకు అభ్యంతరం లేదు ఏ మూలనన్నా కాంగ్రెసు వాళ్ళు తిరుగుబాటు లేవదీసినా నాకభ్యంతరం లేదు ఈ వ్యవస్థ బద్దలు కావాలి అందుకు మీకేమీ అభ్యంతరం లేదు విరసం కత్తులూ, కటార్లూ తీసుకుని అందుకు పూనుకోదు కలం ఉపయోగిస్తుంది మీరు నిశ్చింతగా ఉండండి

❋

12-8-79

నమస్కారాలు మీ 10వతేదీ ఉత్తరం అందింది మీరు చెప్పిన సంగతులన్నీ ఆమోదయోగ్యంగానే ఉన్నాయి అక్టోబరులో విరసం మొదటి మహాసభ జరుపుదాం ఏ రాజకీయ పార్టీ సహాయమూ వద్దు విరాళాలు వసూలు చెయ్యటం కొంత శ్రమతో కూడుకున్నపని కావచ్చు ఈ మద్రాసు వట్టి ఎడారిలాగున్నది విప్లవ సాహిత్యోద్యమం గురించి ఉత్సాహం ప్రకటించే వాడన్నా ఒక్కడు కనుచూపు మేర దూరంలో కనబడటం లేదు శ్రీశ్రీకి సినిమా రంగంలో ఎవరన్నా కనిపిస్తారేమో మరి !

విశాఖ రచయితలు పంపిన కథలు నా వద్ద ఉన్నాయి వాటిని చూసి, వీలుంటే మనం వాటిని ప్రచురిద్దాం వాళ్ళలో గట్టివాళ్ళు లేకపోలేదు

ప్రస్తుతం నేను పెద్ద ఆర్థిక చిక్కులోనే ఉన్నాను అయితే ఈ చిక్కు అక్టోబరు లోపల తొలగి పోవచ్చు హైదరాబాదులో "విరసం" ఏర్పడ్డాక చిన్న మొత్తాలు చందాలు వసూలు చేశారట Minimum of 5/- అంటే నిఖిలేశ్వర్‌కు నేను కూడా అయిదే అయిదు పంపాను అట్లా పోగయినది అట్టే ఉంటుందనుకోను ఉంటే దాన్ని కూడా బాంకులో వెయ్యవచ్చు మీరు చెప్పే account ఆ బాపతేనేమో !

మనం ముద్రించే సంకలనాలు డబ్బుతెచ్చేవిగా ఉండేటట్లు చూడాలి - attractive గా ఉండాలి

"విరసం" తరపున కుమ్మక్కు అవ్వటానికి ఇప్పుడున్న పత్రికలు "సృజన", "విద్యుల్లత", "ప్రభంజనం" ఇంకా ఒకటీ అరా చిన్న పత్రికలు - "లాంగ్ మార్చ్" లాంటివి- ఉండవచ్చు వాటిని అలాగే ఉండనివ్వటం మంచిదని నాకు తోస్తుంది "విరసం" తరపున వేరే మాసపత్రిక పెట్టుకోవచ్చు దానికైనా తొందరలేదు "సృజన" విడిగానే ఉండి support ఇవ్వటం మంచిదని నాకు అనిపిస్తున్నది

నేనొక ప్రణాళికా, శ్రీశ్రీ ఒక ప్రణాళికా తయారు చేయటం అవసరం ఉండదను కుంటాను ఇద్దరమూ కలిసి తయారుచేస్తాం

"విరసం"కు శాఖలే తప్ప అనుబంధ సంస్థలుండవన్నది మంచి నిర్ణయమే సాహితీ మిత్రమండలి వాళ్ళు "విరసం" శాఖగా మార్చేసుకున్నారు

9న జరిగిన మీటింగుకు ఎవరెవరు వచ్చారు ? ఏం జరిగింది ? వీలయినంత వివరంగా రాయండి ఉంటాను

❋

28-8-70

నమస్కారాలు మీ 25 ఉత్తరం ఇప్పుడే చూశాను నేనూ, శ్రీశ్రీ కూడ ఈ మధ్య ఢిల్లీ వెళ్ళి, సాహిత్య అకాడమీ ఏర్పాటు చేసిన Lenin symposium లో partake చేశాం Symposium interesting గానే జరిగింది

Manifesto తయారు చేయవలసిన మాట శ్రీశ్రీకి జ్ఞాపకం చేశాను అతను మద్రాసుకు తిరిగి రాగానే కలిసి కూర్చుందామన్నాడు అతను ఇవాళో రేపో రావచ్చుననుకుంటాను

నేను నిఖిలేశ్వరుకు "విరసం" పేర పంపాను విరసం పేర account లేదట చెక్కు తిరిగి వచ్చింది ఈ లోపల మా అబ్బాయి విశాఖపట్నం వెళ్ళటం ఒకటి స్థిర పడింది నా account లో తగినంత డబ్బు balance ఉంటుందో లేదో తెలీదు వచ్చే నెల 10 ప్రాంతాల నిఖిలేశ్వర్ పేర మళ్ళీ cheque పంపుతాను

కథలలో విప్లవ ధోరణి ఎట్లా ఉండాలి అన్న విషయం విశాఖ యువకథకులు మధనపడుతున్నారు మరీ abstract గా ఆలోచించవద్దని వాళ్ళకు రాస్తున్నాను ఉంటాను

❋

18-9-70

నమస్కారాలు మీ ఉత్తరంతో బాటే ఇప్పుడే జ్వాలాముఖి ఉత్తరం కూడా వచ్చింది విరసం సభలు జరటానికి 10, 11 అక్టోబరు తేదీలు వీలుగానే ఉన్నాయి ఇవిగాక మరో 6 మాసాలలో వేరే సభలు జరపవలసి రావచ్చునని దిగంబరుల ఉద్దేశం వీటిని ప్రారంభ సభలు అనాలా, మహా సభలు అనాలా అని అడుగుతున్నారు "సదస్సు" అంటే బాగుంటుందని రాద్దామనుకుంటున్నాను సంకలనాలు పై సభలకు తెస్తే సరిపోతుందంటున్నారు నా ఉద్దేశం ఏమంటే విప్లవ చైతన్యం కవిత్వంలో వచ్చినట్టుగా ఇంకా కథలలో రాలేదు కథకులు చాలా తడువుకుంటున్నారని నాకు తెలుసు అందుచేత ఉన్న డబ్బులో కవితా సంకలనం తీసుకురావటం సాధ్యమైతే అదే తీసుకురండి

విరసం కథలు ఇప్పుడిప్పుడే దిగుతున్నాయి నిన్నటి పోస్టులో 2, ఇవాళ్టి పోస్టులో రెండూ వచ్చాయి మొత్తం 10 ఇందులో 8 చదివాను ఇప్పుడు వచ్చినవి చదవాలి Selec-

tion ప్రారంభిస్తే కొన్ని నిలవక పోవచ్చు అదీ కథల పరిస్థితి కాళీపట్నం రామారావుగారు ఒక కథ రాస్తున్నారు రా వి శాస్త్రి గారిని కూడా రాయమని అడుగుతూ ఉత్తరం రాశాను రాయవలసిన గట్టివాళ్లింకా రాయనే లేదు

శ్రీశ్రీతో కూర్చుని ప్రణాళిక draft చెయ్యాలంటే ఏ ఆదివారమో మీరు ఇలా రాగూడదా? ఒక గంటలో పని జరుగుతుంది లేదా మీరు తయారు చేసినది పంపండి నా అభిప్రాయాలన్నీ ఇదివరకే వ్యాసాల నిండా పెట్టేశాను మీరూ పెట్టారు మనిద్దరికీ దృక్పథంలో తేడా ఏమీ కనిపించటం లేదు

ధనికొండ printing bill అప్పు పెట్టవచ్చు కాని మరో నెలదాకా ధనికొండ press కు తీరిక ఉంటుందనుకోను అక్కడ యువ మామూలు సంచికతో బాటు దీపావళి ప్రత్యేక సంచిక అచ్చుకాబోతున్నది

డబ్బుది పెద్ద సమస్యే నేను నా కోటా ఇంత వరకు పంపలేదు దగ్గిరా డబ్బు లేదు రావలసి ఉన్నది ఎంతకీ రాదు ! ఖమ్మం సదస్సు ఆర్భాటం లేకుండా జరగటమే మంచిది "ఒక్క కేక వేసి" ఊరుకుండే కన్న చిన్నగా ప్రారంభించి tempo హెచ్చించటం మంచిది ఆరంభ శూరత్వం అంటగట్టించుకోరాదు ఉంటాను

❋

24-9-70

నమస్కారాలు శ్రీశ్రీని contact చెయ్యడం పడలేదు ప్రణాళికకు నేను కూడా కొన్ని సూచనలు పంపుతున్నాను అందులోకి దిగంబర కవులనూ, అరసంనూ తీసుకురానవసరం లేదనుకుంటాను General form లో మీరు draft తయారు చేయండి అదికాస్త దీర్ఘంగా వున్నా యిబ్బంది లేదు తరువాత కుదించుకోవచ్చు Loopholes మాత్రం ఉండరాదు ఈ ప్రణాళికకు కనీసం నూరేళ్ళు ఆయుర్దాయం ఉండాలనీ, దీనిపైన మరొక సాహిత్యోద్యమం ఎక్కి రావలసిన అవసరం ఉండగూడదనీ నా ఉద్దేశం అంటే ఇది చరిత్రాత్మకంగా ఉండాలనే!

ఇప్పుడు ఖమ్మంలో జరగబోయేది అచ్చుగా రచయితల సదస్సుగానే వుంటుందనీ, ఇప్పుడిప్పుడే మనం జనసామాన్యం ముందుకు పోయి చెప్పేది ఏమీ ఉండదనీ, తిరిగి ఆరునెలలకో, ఏడాదికో, మనం ప్రజల ఎదుటికి వెళ్ళి, ఈ పద్ధతిలో విరసం ఉద్యమాన్ని నడుపుతున్నామని ఒక మహాసభలో చెప్పుకుంటే బాగుంటుందనీ నేను కూడా అనుకుంటున్నాను ఈ సదస్సుకు ప్రజలు రారాదనీ, మీటింగులు వుండరాదనీ కాదు కాని దీన్ని విప్లవ రచయితల మహాసభ అనటానికి తగిన హంగులేదు

Souvenir వెయ్యటానికి చాలా ఆర్భాటం కావాలి దానికీ రచనల బెడద ఉంటుంది ప్రకటనలు తెచ్చుకోవాలి తరువాత కాపీలు అమ్ముకోవాలి దానికి business మరింత హెచ్చు ప్రకటనలు ఎవరిస్తారు ? సినిమా వాళ్ళని యాచిస్తామా ? ఎవరిని యాచిస్తాము ? పత్రికలకు దొరికినట్టు Souvenir కు యాచించకుండా ప్రకటనలు రావు ప్రకటనలని పేరేగాని, ఇచ్చేవారికి

ముష్టి, పుచ్చుకునేవారికి patronage మనం ప్రజల patronage తప్ప మిగతావారిది ఆమోదించరాదు Business రీత్యా ప్రకటనలు తీసుకోవచ్చు కాని విరసంతో ఎవరన్నా business చేస్తారా ? అన్నది అనుమానం

రావిశాస్త్రిగారి "నిజం" ఆడించి చాతనయితే విరసం fund తయారు చేసుకోవచ్చు అదీ వ్యాపారమే నిర్వాహకులుండాలి ఖమ్మం కార్యక్రమ వివరాలు, ప్రసంగాలు souvenir గా వేసుకోవచ్చు లేదా మనను అభిమానించే పత్రికలలో వేయవచ్చు ఆ పత్రికలకు మనం చేయగల ప్రత్యుపకారం అదే !

ఖమ్మం సమావేశం తేదీలు సాధ్యమైనంత త్వరగా నిర్ణయించండి నాకు 9, 10, 11 శలవే ఉంటాను

❋

23-10-70

నమస్కారాలు మీరు పంపిన వ్యాసాలు చూశాను కల్పనా సాహిత్యం రాయటంలో గల చిక్కులు వాళ్లు సరిగానే చెప్పారు స్వానుభవం మాత్రమే రాయాలన్న extreme position కాదు వాళ్ళది ఆ మాట అని కథాసాహిత్యం కేవలం reportage కూడా కారాదు గద ! వాళ్ళు ప్రస్తావించిన దాన్ని గురించి నేను నా వ్యాసంలో కొంత విపులీకరించి రాశాను 3 వ్యాసాలూ మీకు ఇప్పుడే Book-post గా పంపుతున్నాను సావనీర్ ఎప్పుడు వస్తుంది ? ఉంటాను

❋

9-3-71

మీరు నిన్న రాసిన ఉత్తరం ఇప్పుడే అందింది "మార్చ్" నిషేధించారనీ, కిషన్‌రావును అరెస్ట్ చేశారనీ విన్నాను విరసం నిరసన cutting కూడా అందింది సంతకాలు పెట్టించటం అవసరం నన్ను protest రాసి పంపమంటే ఏమని ప్రొటెస్టు రాసేదని అడిగాను మీరు ఒక Draft పంపితే దాని మీద సంతకాలు చేయించవచ్చు ప్రభుత్వం సాహిత్యం జోలికి రావడం చాలా stupid Thought control is highly objectionable అందుచేత writers అందరూ protest చెయ్యవలసిందే పేర్లు అనవసరం మీరు చెప్పిన రీతిలో కొందరు సంతకాలు చెయ్యరు వాళ్లు సాహిత్యంలో రాజకీయాలు చూసే వాళ్లు శ్రీశ్రీతో పాటు తిరగటానికి నాకు అభ్యంతరం లేదు

పోతే నా జయశ్రీ article గురించి కూడా ఉత్తరాలు వచ్చాయి అశోక్ విమర్శించినాక ! నేను అందరికీ - జయశ్రీకి కూడా - జవాబు రాశాను మీకు కొంచెం detailed గా రాస్తాను

1) నేను జవాబు రాసింది సానుభూతి పరుల విమర్శలకు కాదు - వ్యక్తుల బలహీనతలను అడ్డం పెట్టుకుని విరసం సాహిత్యాన్ని దెబ్బతీయజూసిన వాళ్ళకు అందుకని నేను పని

పెట్టుకుని half heart తో సమాధానం ఇస్తూ, సాహిత్యం angle మాత్రమే రాసేలా చేశాను విరసం సభ్యుల ప్రవర్తన ఎలా ఉండాలో తెలపటానికి నేను అది రాయలేదని ఎవరైనా గ్రహించవచ్చు

2) వ్యక్తుల అర్హతల మాటకు వస్తే - అంటే విరసం సభ్యుల దృష్ట్యా - sex విషయంలోనూ, విశ్వాసాల విషయంలోనూ lay గా ఉండటం తప్పే సత్యనారాయణ వ్రతాలూ, తిరపతి యాత్రలూ చేసేవాళ్లు Marxists కాలేరు కాని అటువంటి లోపాలున్నవాళ్ళని మనం విరసంలోకి రానిచ్చాం Idealistic గా చూస్తే వాళ్ళకి విరసంలో స్థానం లేదు నిజానికి మనం Idealism తో కొన్ని రచనలకే importance ఇచ్చాం ఇప్పుడు ఎందుకు పిసుక్కుంటున్నాం? రేపు General body మీటింగు పెట్టి, వ్యక్తిగతంగా మార్క్సిస్టులలాగా జీవిస్తూ ఉండని వాళ్ళను విరసం సభ్యత్వం నుంచి ఏరిపారేద్దామా ? ఇది internal matter అటువంటి అభ్యంతరాలు పత్రికలలో ప్రచురించేవీ, లొల్లి చేసుకునేవీ కావు అశోక్ తొందరపడ్డాడని మన హైదరాబాద్ మిత్రులు కూడా ఒప్పుకుంటున్నారు విరసాన్ని ప్రతిఘటించదలచుకున్నవాళ్లకు విరసం సభ్యుల వ్యక్తిగత జీవితాలతో ఏమిటి సంబంధం ? వాళ్లకు తగిన జవాబే నేను చెప్పానని ఇప్పటికీ అనుకుంటున్నాను అశోక్ అభిప్రాయాలతో నేను భేదించాను అందరం rational గా వుండాలనే నా తాపత్రయం కూడా నేను rational గానే ఉంటున్నాననుకుంటున్నాను అయినా నేను రాసినది withdraw చేసుకునే ఉద్దేశం నాకెంత మాత్రం లేదు రావిశాస్త్రిగారు ఎప్పుడూ పుణ్యపాపాల terms లో think చేస్తారు నాకవి సమ్మతం కాదు అయినా ఆయన రచనలు విరసంకు కావాలి ఉంటాను

❋

3-8-71

నమస్కారాలు జ్వాలాముఖినీ, నిశిలేశ్వర్‌నూ, చెరబండ రాజునూ PD కింద ఆంధ్ర ప్రభుత్వం అరెస్టు చేసినట్టు Telegram ఇంతకు ముందే వచ్చింది వాళ్లు రాయకుండా చెయ్యటానికి అరెస్టు చేశారో, ఉపన్యాసాలు ఇవ్వకుండా arrest చేశారో తెలియటం లేదు నాకు తెలిసినంతవరకూ వాళ్లు politics లో లేరు Poets అయిన కారణం చేత ఈ arrest జరిగి వుంటే ఇంతకన్న దారుణం ఉండబోదు

ప్రస్తుతానికి విరసం కథలు press లో ఉన్నాయి Composing మొదలు పెట్టారో లేదో తెలీదు Press కి 600 డబ్బు పంపాడు నిఖిల్ బిల్లు 1200 అవుతుంది Printing పూర్తి అయితే పుస్తకాల charge ఎవరు తీసుకుంటారు ? వాటిని ఎవరు అమ్ముతారు ?

శ్రీశ్రీ ఇంకా telephone మీద అందలేదు 2 PM కు ఇంట్లో ఉండవచ్చు మళ్లీ try చేస్తాను కథల పని ఆపమని press కు telephone చేద్దామనుకుంటున్నాను

ఈ arrest పట్ల మనం strong protest తెలపాలి ఇది విరసం మీద దెబ్బేకాని మరేదీ కాదు వెంటనే సమాధానం రాయండి మీరు ఇక్కడికి వస్తే చాలా బాగుంటుంది శ్రీశ్రీతో మాట్లాడినాక శ్రీశ్రీని కూడా మీకు రాయమంటాను

❋

18-8-71

నమస్కారాలు మీరు మొన్న రాసిన కార్డు నిన్న ఇంటిదగ్గర అందింది పోస్టు టైము దాటి చూసుకున్నాను విరసం మీద ప్రభుత్వం నిషేధం పెట్టినట్టు నేనూ వినలేదు పొద్దుటూర్లో అలాటి పుకారు పుట్టించారేమో !

మీరు నాకు మళ్లీ కనిపించలేదు శ్రీశ్రీ కూడా కనిపించలేదు శుక్రవారం నాడు మరువాడ కనిపించి జ్వరం వస్తున్నట్టున్నదన్నాడు డాక్టరు దగ్గరికి వెళ్ళమన్నాను మర్నాడు కనిపిస్తానన్నాడు Statements పత్రికలకూ, సంతకాలకూ ఇచ్చినట్టు చెప్పాడు మళ్లీ కనిపించలేదు అతని address కూడా తెలీదు దగ్గుతో బాధపడుతున్నాడు జబ్బు పడ్డాడేమోనని భయంగా ఉంది

'ప్రజాశక్తి'లోనూ, 'తెలుగు వెలుగు'లోనూ, 'జయప్రద'లోనూ, నిరసనలు చూశాను ఇంకా ఎందులోనైనా పడ్డాయేమో నేను చూడలేదు 22 విజయవాడ మీటింగుకు బహుశా నేను రాలేను శ్రీశ్రీని అడిగి కనుక్కుంటాను అతను తప్పక వస్తాడనే అనుకుంటున్నాను

కథలు మూడు ఫారాలు correct చేసి ఇచ్చాను ఈ పాటికి striking అయి ఉండవచ్చు శ్రీశ్రీ సాధారణంగా మధ్యాహ్నం రెండుగంటలకు telephone మీద అందుతాడు రాజేశ్వరరావు నుంచి కబురుకోసమే చూస్తున్నాను అతని ఆరోగ్యమూ, పరిస్థితులూ కూడా బాగున్నట్టు లేదు ఉంటాను

❋

26-8-71

నమస్కారాలు మీ ఉత్తరం అందింది శ్రీశ్రీ telephone మీద అందాడు అతను డబ్బు ఇబ్బందిలో ఉన్నాడేమో defence fund 200 collect చెయ్యవచ్చునన్నాడు సంతకాలు అనిశెట్టి చేయిస్తున్నాడుట

తీర్మానాలు బాగానే ఉన్నాయి

మీ press club interview ఎందులో వస్తుంది ? 'తెలుగు వెలుగు'లో వస్తుందా ? నాకూ పత్రిక వస్తుంది

డా రమణారెడ్డి సంగతులు తెలియగానే రాయండి అతని మీద పెట్టిన కేసు phoney గా ఉన్నది విప్లవ కవులపైన పెట్టిన ఛార్జీలు చూశాను చాలా funny గా ఉన్నాయి అందులో "charge" అనదగినదేదో నా బుద్ధికి అంతుబట్టలేదు ఏ కోర్టులోనూ నిలవకుండా వుండటానికి sympathetic person ఎవరో frame చేసినట్టున్నాయి ఛార్జీలు ! వాళ్లు విడుదల అయి తీరుతారు

కథలు త్వరగా పూర్తి చేయమని ధ హ కు చెబుతాను ఈ నెలాఖరులో పూర్తికావటం అనుమానమే

Indo-Soviet pact తరువాత విశాలాంధ్రీయులకు విప్లవంతో అసలే పని లేదుగదా! మనదేశం రష్యా చంకలో దూరటమే విప్లవం

ఆంధ్ర జ్యోతిలో ఉన్నవాళ్లు cowards ఏ పత్రికైనా తన పాలసీకి వ్యతిరేకంగా ఉండే లేఖలు వేయవచ్చునే ! మన లేఖ మాట దేవుడెరుగు ! విప్లవకవుల అరెస్టు గురించి అటుగాని ఇటుగాని ఒక్క opinion వేశారా ? News మాత్రమే వేశారు నండూరివారు ఇచ్చినది explanation కాదు apology

హైదరాబాదుకే కాదు, ఎక్కడికి రావటానికైనా నేను mental గా ఎప్పుడూ రెడీగానే ఉన్నాను Physical గా ఎట్లా రెడీ కావాలో రెండేళ్లుగా ప్రయత్నించినా తెలియటం లేదు

ఉంటాను

*

9-9-71

నమస్కారాలు నిన్నటి మీ ఉత్తరం ఇప్పుడే అందింది సంకలనానికి నేనిచ్చిన 13 కథలూ కలిపితే సుమారు 150 పేజీలే అయేట్టు అనిపించింది అందుచేత మరి మూడు కథలు నాకు అంతగా నచ్చనివి కంపోజింగ్‌కు పంపాను మరి రెండు కథలు ఉంచేశాను కారణం ఆ కథలు, ఇదివరకే కంపోజు అయాయి 200 పేజీల దాకా పుస్తకం రాదు ఫరవాలేదు cost of production కాస్త తగ్గుతుంది

మహాసభ ఉన్నవారితో జరపటమే నా అభిమతం కూడా అయితే నేను రావటం సాధ్యం కాదు మీకు ముందే చెప్పాను నేను ఏ ప్రయాణం చెయ్యటానికీ భయపడుతున్నాను చిత్తూరు వారు కిందటిసారి వచ్చినపుడు ఎగ్గొట్టి ఈ యేడు చూస్తానన్నాను ఈ యేడు వాళ్లు మళ్లీ వచ్చారు నన్ను నడవనివ్వకపోతేను, ఒక్కరోజు లోపల నన్ను తిరిగి మద్రాసు చేర్చే షరతుల మీదా చిత్తూరు వెళ్ళటానికి ఒప్పుకున్నాను కారణం, నా భార్య ఒంటిగా ఉంటుంది హైదరాబాదు రాలేకపోవటానికి మరో కారణం నేను శ్రీశ్రీని మించిన డబ్బు ఇబ్బందిలో ఉన్నాను అప్పులో అప్పు చేసి నా సభ్యత్వ రుసుం పంపుతాను కాని మిగతా ఖర్చులు నావల్లకాదు విప్లవకథ ఎలా వుండవచ్చునన్న దాని మీద నేను ఒక చిన్న వ్యాసం పంపగలను దానిమీద కుర్రవాళ్లు చర్చలు జరపవచ్చు

ఇవాళ సంకలనం proof reading 144 పేజీ దాకా వచ్చింది మహాసభల లోపుగా పుస్తకం పూర్తి కావచ్చు కాపీలు అన్నీ deliver అవుతాయేమో కూడాను

శ్రీశ్రీకి రైలు చార్జీలకు డబ్బుంటే తప్పక వస్తాడనుకుంటాను విశేషాలు ఇంకేమీ లేవు

ఉంటాను

P S

25నాడు ఉదయం 7-30 కి ఇక్కడి నుంచి బృందావన్ Express లో బయలుదేరి కాట్పాడిలో దిగితే అక్కడి నుంచి చిత్తూరుకు car లో తీసుకుపోతామని, 10-30కి మీటింగు పెడతామని, సాయంత్రం తిరిగి వెళ్ళవచ్చునని చిత్తూరువారు అన్నారు వారు I class ఇస్తారుట కాని నేను III క్లాసే తీసుకుంటాను మీరు మద్రాసు వచ్చి నాతోనే వస్తారా ? తిరుమల రామచంద్రకూడా ఆ రోజే వచ్చేటట్టున్నది మీరు కూడా ఇక్కడికి వస్తే అన్ని టిక్కెట్లూ ముందు reserve చేయొచ్చు అందుచేత మీ ప్రయాణం వివరాలు రాయండి

*

15-9-71

నమస్కారాలు విరసం కథలు పూర్తిగా compose అయింది 168 పేజీలు నేను పొరపాటున ఒక చెత్త కథ ఇచ్చాను పేజీలు పెట్టాక దాన్ని తీయవలసి వచ్చింది contents print అయ్యాయట ఆ కథను కలంతో కొట్టెయ్యాలి ప్రింటింగు అయిపోయింది పొద్దున్న వైజాగ్ ప్రసాద్ టెలిఫోన్‌లో చెప్పాడు మీరు మద్రాసు రావటం లేదని చిత్తూరు నుంచి నాకు ఉత్తరం ఏదీ లేదు నేను 25కు టిక్కెట్టు కూడా కొనలేదు నేను చిత్తూరు రావడం కాస్త అనుమానంలో పడింది ఉంటాను

*

4-9-72

నమస్కారాలు మీ ఉత్తరం ఇప్పుడే అందింది నియమావళిని నేను ఆమోదిస్తూనే సందేహాలు వెలిబుచ్చడంలో అర్థం ఏమున్నది ? నేను చెరబండరాజుగారికి రాసింది ఈ నియమావళిని అమలు జరపడంలో గల ఇబ్బందులు అవి నియమావళిని గురించి సందేహాలు కావు ఆత్మ విమర్శలోనూ, ఇతరుల విమర్శలోనూ ఉదయించే నమూనా ప్రశ్నలు కొన్ని తెలిపాను వాటిని సందేహాలు అనవసరం లేదు

నా ఉద్దేశం ప్రజలను చైతన్యవంతం చేసిన మేరకే ఉద్యమం ఉద్యమ కారులు తామై ఉద్యమం కారు విరసం ఒక సామాజిక స్వభావాన్ని సాధించలేదనుకుంటున్నాను విరసం సభ్యులను ప్రస్తుతం కలిపి ఉంచుతున్నది విప్లవ సాహిత్య దృక్పథం మాత్రమే ప్రతి ఇద్దరి సభ్యుల మధ్యా ఏదో ఒక నెర్ర ఉన్నట్టు నేను చాలా కాలం క్రితమే కనిపెట్టాను ఇప్పుడున్న వారంతా జీవితంలోని విప్లవ పరిస్థితులకు వేరు వేరు దూరాలలో ఉన్నవారు కాలక్రమాన, అంటే విప్లవసాహిత్యోద్యమం విస్తరించిన కొద్దీ, ఇప్పుడున్నవారికి క్రమంగా కాలదోషం పట్టి విరసం నిజమైన సామాజికులది అవుతుందని నా అంచనా ఇదే నియమావళి అప్పుడు సార్థకమవుతుంది

ఈ నియమావళిని అమలు చెయ్యటం ముఖ్యం అందులోగల ఇబ్బందులనే నేను చెరబండరాజు దృష్టికి తెచ్చాను Extreme case లో ఇప్పుడున్న వారిలో ఇద్దరు కూడా మిగలకపోతే అప్పుడేం చెయ్యాలి ? అది ఆలోచించటం అప్రస్తుతం కాదే

నేను చందమామ కథలు రాయటం నా జీవనోపాధి అయితే సినిమాపాటలు రాయటం శ్రీశ్రీ జీవనోపాధి కుటుంబ నియంత్రణ మీద విరసం సభ్యుడు నాటకం ఆడించటం ఎబ్బెట్టుగానే ఉంటుంది అందువల్ల విప్లవ సాహిత్యోద్యమం దెబ్బతింటుందని కాదు శత్రువులు అది ఎత్తిచూపి విరసం ఉద్యమాన్ని ఎత్తిపొడుస్తారని, విరసం ఆదర్శాన్ని ఆక్షేపించలేనివాళ్లు అందులో వ్యక్తుల జీవితాల్లోకి పోతున్నారని మనకు మొదటి నుంచీ తెలుసు రాచకొండ ఎన్నికలలో పాల్గొనడం గురించి మన "అభిమానులే" పత్రికల కెక్కించి కంపు చేశారు సరి అయిన విప్లవ సాహిత్యం కన్న సరి అయిన విప్లవ సాహితీపరుల మీదికి క్రమంగా దృష్టి మళ్లుతున్నది ఇందువల్ల విరసం ఉద్యమానికి చాలా నష్టం జరగవచ్చునని నా అనుమానం

ఈ భయంతోనే నేను విరసం సభ్యుల aberations ని ఒక విధంగా సమర్థిస్తూ వచ్చాను- అవి నాలో లేకపోయినా నిజానికి విరసం సభ్యుల కొందరి ప్రవర్తనకు సమర్థింపు ఏదీ లేదు వారు తమ రచనలలో చూపించే మార్క్సిస్టు అవగాహన జీవితంలో చూపలేరు దానికి గల కారణాలు తెలియకుండా విమర్శించే దశ వచ్చిందన్న ఉద్దేశంతో ఈ నియామవళి ఏర్పాటు చేశామనుకోవాలి నేను లోగడ చేసిన సమర్థింపులకు validity లేదు నేను చెప్పగలదల్లా విప్లవ సాహిత్యోద్యమాన్ని ఇగరబెట్టకుండా కార్యాచరణ చూడమనే ఒక వ్యక్తి విరసం నుంచి బయటికి పోయినంత మాత్రాన నష్టం ఏమీ లేదు కాని అదే పెద్ద సంఖ్యలో జరిగితే quantity కీ quality కీ గల సంబంధం arise కావచ్చు

సృజనలో మీ గేయం చాలా బాగున్నది నేను anti విరసం వాగుళ్లు ఏమీ చదవడం లేదు I take them for granted కొంత superstiousness develop చేశాను విప్లవ సాహిత్యానికి ఒక limited audience నికరంగా ఉన్నది అది enlarge కావాలి అవుతుంది జీవితం అందుకు అనుకూలంగా ఉన్నది ఉంటాను

*

15-9-72

నమస్కారాలు మీ నిన్నటి ఉత్తరం అందింది నీతికీ, చట్టానికీ గల భేదం గురించి రాశారు మనం చట్టాలు చేయలేం నీతి మనకు చట్టం లాంటిదే దాని ఉల్లంఘునపై చర్య తీసుకోవాలి విరసం సభ్యులు విప్లవ సాహిత్యం తప్ప ప్రచురించరాదని categorical నియమావళి చెబుతున్నది నా పాత రచనలు విప్లవ సాహిత్యమని వాదించనా ?

ఆత్మ విమర్శన ఎవరికి వారు చేసుకోవాలి కాని ఇతరుల విమర్శ ఉండకుండా ఎలా ఉంటుంది ? నియమావళి అంటూ వచ్చిన తరువాత ఒకసారైనా అందరూ కూర్చుని ఆ నియమాలను ఎవరెవరు ఎలా ఉల్లంఘించారో ఉల్లంఘిస్తున్నారో తెలుసుకోవద్దా ? అదే గోదాలోకి దిగటం అని నేను అన్నది

మనమందరమూ మార్క్సిస్టులమే గనక, తెలియక చేసేదీ, ఇతరులచేత చెప్పించుకునేదీ ఉండకూడదు మరి కాని ఉంటుంది వాస్తవానికి చాలామంది యథాశక్తి మార్క్సిస్టులు పూర్తి మార్క్సిస్టులు కూడా "మానసిక" మార్క్సిస్టులే కావచ్చు తాము జీవించే పద్ధతిని బట్టి, ఆచరణలో మార్క్సిస్టులు కాకపోవచ్చు ఈ పరిస్థితుల్లో వ్యక్తుల చిత్తశుద్ధిని బట్టి వారు నియమావళిని పాటించేటట్టుంటే అది చిత్తు కాగితం కింద తయారుకాక తప్పదని నా సందేహం

ఇది పార్టీ నియమావళి లాంటిది కాకూడదనే నేనూ అనుకుంటున్నాను కాని అది పార్టీ నియమావళిలాగే ఉన్నది దాన్ని అతిక్రమించినవారిపై చర్య తీసుకునే ప్రక్రియ క్షాళనం ఎందుకు కాదో నాకు అర్థం కావటం లేదు నచ్చచెప్పటం మొదటి మెట్టు వినక మొండికెత్తితే గెంటెయ్యటం తప్పనిసరి

సి యస్ రావుగారిపై చర్య తీసుకోవటం గురించి నాకు వ్యక్తిగతంగా అభ్యంతరం లేదు విరసం ప్రత్యేక వ్యక్తులపై ఆధారపడటం నాకు ఎన్నడూ ఇష్టం లేదు నాకు వ్యక్తి విశిష్టతలో ఏనాడూ విశ్వాసం లేదు ఆమాట నాకు సాధ్యమయినంతగా వ్యాసాల్లో స్పష్టం చేశాను కాని, సి యస్ రావు ముందుగానే నాటకాలాడటానికి commit అయ్యాడేమో తెలుసుకున్నారా ? అయి ఉంటే back out చెయ్యమనటం సబబేనా ? పరిస్థితులు నాకు సరిగా తెలియక అడుగుతున్నాను

మీరు చెప్పే తీర్మానం నాకు అందలేదు నియమావళి సాకుపెట్టి విరసం నుంచి కొందరు జారుకోవచ్చునని మీరు అన్నదాంట్లో నిజం వుంటే, వాళ్ళు ఎలాగు రాలుగాయలే వాళ్ళు పోవటం మంచిది గదా నియమావళి సమర్థనీయమని నమ్ముతున్నాను గనక సభ్యులకు దాన్ని గీటురాయిగా పెట్టటం ఎంతైనా వాంఛనీయమని నేను అనుకుంటున్నాను "నియమాలను తెలిసి, తెలిసీ ధిక్కరించటం సబబు కాదు" అని మీరంటున్నారు మీ ఉద్దేశంలో ఈ నియమాలు internally imposed but not informatically worthy అన్నట్టు నాకు స్ఫురిస్తున్నది నేనా మాట నమ్మను విరసం అభివృద్ధి చెందిన కొద్దీ ఆ నియమావళిని automatic గా అనుసరించేవాళ్ళు నాయకత్వం వహిస్తారు ఇప్పుడున్న సభ్యులకు ఇది పచ్చి వెలక్కాయేమోననే నా సందేహం ఉంటాను

❋

21-9-72

నమస్కారాలు మీ నిన్నటి వుత్తరం ఇప్పుడే అందింది నియమావళిని geneal body చేత approve చేయించటం అవసరం లోగడ సభ్యుల ప్రవర్తనను నిలవదీసి సంజాయిషీ అడగటంలో తాత్సారం జరిగింది సంకలనానికి శ్రీపతి కథ నిరాకరిస్తే కారణం అడిగాను ఎవరూ చెప్పలేదు పట్టించుకోలేదు నియమావళి అవసరం లేకుండానే C S Rao తో తాడోపేడో తేల్చుకోవచ్చు సి యస్ రావు కథల పుస్తకానికి ఉపోద్ఘాతం రాస్తావా అని అడుగుతూ నిఖిల్ రాశాడు పుస్తకం రాలేదు వొస్తే కథలు రాయదగినవయితే రాస్తాను నాకు పని జరగాలి నియమావళి గురించి అందరూ ఏమంటారో చూద్దాం ఉంటాను

❋

27-9-72

నమస్కారాలు మీ కార్డు నిన్న అందింది Ralph Fox పుస్తకం ఇప్పుడు అందింది దాన్ని ఏ విధంగా రాసినా పుస్తకంగా వెయ్యటమా లేక ఏ సృజనలోనో సీరియల్‌గా వెయ్యటమా? పుస్తకంగా వెయ్యటానికి అయితే పూర్తిగానో, సంగ్రహంగానో రాసుకుంటూ పోతాను సీరియల్‌గా వచ్చేటట్టుంటే మధ్య మధ్య నా సొంత పైత్యం బ్రాకెట్స్‌లో పెడతాను

❋

18-1-73

నమస్కారాలు నిన్న సాయంకాలం 3-30 ప్రాంతాల శ్రీశ్రీ నాకు టెలిఫోన్ చేసి "నేను రిజైన్ చేస్తున్నాను టెలిగ్రాం ఇస్తున్నాను విశాలాంధ్రకూ మిగిలిన పేపర్లకూ statement ఇస్తున్నాను ఇది ఎవార్డ్ విషయమై కాదు ఆంధ్రను విభజిస్తూ చేసిన తీర్మానం నాకు ఎంత మాత్రమూ సమ్మతం కాదు" అని చెప్పాడు

అది వర్కింగ్ కమిటీ తీర్మానమే గనక దాన్ని గురించి అభ్యంతరం ఉంటే రాయవచ్చునని, రిజైన్ చేసి statements పత్రికలకు పంపే అవసరం లేదన్నాను

తరవాత award విషయం వచ్చింది ప్రసాద్ strong గా ఉత్తరం రాసినట్టు శ్రీశ్రీ చెప్పాడు శ్రీశ్రీ award తీసుకోవటానికి నిశ్చయించినట్టు కనిపిస్తుంది "తీసుకోవటంలో నాకైతే తప్పేమీ కనిపించటం లేదు కానీ అందరి సెంటిమెంటూ తీసుకోకూడదని వుంటే దాన్ని నిరసించటం ఎలాగ ? వాదించి లాభం లేదు గదా ?" అన్నాను

"మరీ మంచిది రెట్టింపు డబ్బు వొస్తుంది" అని మొదట అని, "నేను award తీసుకుంటాను Fund reject చేస్తాను," అన్నాడు

నాకు చూడగా మొన్నటి మద్రాసు felicitation making శ్రీశ్రీని బాగా influence చేసినట్టున్నది ఆరుద్ర మొదలైన వాళ్లు చాలా WARM గా మాట్లాడారని విన్నాను అటువంటి warmth విరసం నుంచి రావటం లేదు శ్రీశ్రీకి If he begins to feel more happy with Arudra and other అరసం people, Virasam will certainly lose him శ్రీశ్రీ విశాలాంధ్రకు statement పంపుతాననటం నాకు symptomatic గా కనపబడింది I hope and wish I am wrong

Prasad letter లో ఏమి రాసిందీ నాకు తెలీదు మీకు రాస్తున్నట్టే ప్రసాదుకి కూడా ఈ పూట రాశాను ఏమి జరిగినా ముందుగా prepared గా ఉంటారని, అంతేగాని panic create చెయ్యటానికి కాదు ఉంటాను

❋

25-1-73

నమస్కారాలు మీ కార్డు అందింది నిన్న నిఖిల్ రాశాడు - శ్రీశ్రీ రాజీనామా (అధ్యక్ష పదవికి) పంపాడట "సాకు" అనుకోవాల్సిందే మరి నేను శ్రీశ్రీకి phone చేస్తే ఇంట్లో లేనట్టూ,

రేడియోకు వెళ్లినట్టు చెప్పారు ఇవాళ మరి ఇంటికి రాడట రేపు మాకు శలవు మీరు ఏ ఆదివారమో చూసుకుని వొస్తే ముగ్గురమూ కూర్చుని చర్చించుకుందాం ఉంటాను

❋

30-5-73

నమస్కారాలు మీరు మొన్న రాసిన ఉత్తరం ఇప్పుడే అందింది తెనాలి సభల తీర్మానాలు వచ్చాయి గాని అసలు వివరాలు తెలియలేదు శ్రీశ్రీ టెలిఫోన్ మీద అందటం లేదు Times of India లో శ్రీశ్రీ రాజీనామా ఇచ్చినట్టు పడిందట !

రాజకీయ పంథాలకు విరసంను దూరంగా ఉంచాలని మనం ఏ సదుద్దేశంతో చెప్పినా అది వుండదు నా బాధ ఏమంటే విరసాన్ని రాజకీయ పంథాలోకి ఈడ్చే ప్రయత్నం తీవ్రంగా చేసేవాళ్లు సాహిత్యరంగం గురించి దుగ్ధలేనివాళ్లు Exceptions ఒకరిద్దరు ఉండవచ్చునేమో ! విరసంలో వ్యతిరేక ధోరణులు రాసినవాళ్లు రాజకీయోత్సాహికులు వాళ్లు పేజీలు కొద్దీ quote చేసినవి విరసంకు సంబంధించవు రాసినవాళ్ల చిత్తశుద్ధి ఎలాటిదైనా విరసంకు సంబంధించినంతవరకూ ఆ document చాలా shallow గా వున్నట్టు నేను feel అయాను

విరసం కార్యదర్శిగా ఎవరున్నా పరవాలేదు నిఖిల్ సృజననూ, పిలుపునూ విమర్శించటం నాకు కూడా పొరపాటనే అనిపించింది మీరన్నట్టు అది వ్యక్తి స్వాతంత్ర్యం సమస్య కాదు

❋

30-5-73

మధుసూధనరావు సమ్యగ్దర్శి అనే నేను అనుకుంటున్నాను ఆయనకొక strong line ఉన్నట్టు నాకు పొడగట్టలేదు డివి వర్గం ఎవరు ?

మీరు self defence చేసుకోవటంలో తప్పేమీ లేదు చేసుకోవటం చాలా అవసరం నేను వరవరరావుకు ఒక చిన్న వుత్తరం రాశాను అది ఏమయిందో ? నన్ను గురించి కూడా ఆ document లో అబద్ధాలు రాశారు

“సమగ్రమైన అవగాహన” అన్నదాన్ని నిర్వచించటం కష్టం తమ తెలివితేటలు ప్రదర్శించుకునేటందుకు అసందర్భంగా విమర్శలు చేసే వారున్నారు లోగడ నేను మావో విప్లవశక్తుల కోసం కర్షకవర్గం మీద ఆధారపడ్డాడన్నందుకు ఒకరు విమర్శించారు - నేను చెప్పినది అబద్ధమైనట్టు మళ్లీ మే సృజనలో నా జాతీయ సమస్య సమీక్ష మీద మరొక “అతి తెలివి” విమర్శ వచ్చింది దానికి కూడా సమాధానం రాశాను అది ఏమవుతుందో ?

మే నెల సృజన నాకు రాలేదు మరొకరి కాపీ చూసి సమాధానం రాశాను సృజన రాదని రూఢి చేసుకుని చందా M O చేశాను చేసి వారం కావస్తున్నది ఇంతవరకు కాపీ రాలేదు

అన్నింటిలో లాగే విరసంలో కూడ contradictions పైకి రావలసిందే అవి resolv కావాలిసిందే కానీ shallowness & unnecessary cleavages అంత healthy కాదు

నా health మామూలుగానే వున్నది Strict routine కు కట్టుబడి వుంటే బండి నడుస్తుంది ఉంటాను

❋

4-6-73

నమస్కారాలు మీ రెండో ఉత్తరం అదివరకే అందింది ఇప్పుడు సృజన కూడా అందింది వరవరరావుగారికి నేను పంపిన M O రసీదు తిరిగివచ్చి 2, 3 రోజులైందిగానీ మే సంచిక మాత్రం రాలేదు కాపీలే లేవేమో ! మీరు 40 పైసలు అనవసరంగా అంటించారు Printed book గా 10 పైసలతో చేరి ఉండేది Thanks నేను రమణమ్మగారి మృతిగురించి పనిచేసుకుంటూ ఎవరో చెబుతుంటే విన్నాను కాని వెంటనే మరిచాను Psychopathological repression ! ఉంటాను

❋

7-12-73

నమస్కారాలు మీ ఉత్తరం నిన్న అందింది ఇవాళ రచన book post లో పంపుతున్నాను అది మీరు అనుకున్న విధంగా వచ్చిందో లేదో తెలీదు అందులో అసలు విషయం కాక ఇంకా ఇతర సంగతులు కూడా వచ్చాయి పరవాలేదనుకుంటాను ఉంటాను

❋

4-1-74

నమస్కారాలు మీరు ఒంగోలునుంచి రాసిన కార్డు అందింది నేను రిసెప్షన్ కమిటీ సెక్రటరీగారికి అదివరకే నా శుభాకాంక్షలు తెలుపుతూ రాశాను నేను సభ్యుణ్ణిగా ఉంటానని కూడా రాశాను ఇతర పదవులు వద్దు మీటింగులకు కూడా attend కాలేను నా ఆరోగ్యం ప్రస్తుతం బాగానే వున్నది కాని ఇంట్లో పరిస్థితి నా ప్రయాణాలకు అనుకూలంగా లేదు ఇప్పుడు ఇంట్లో నేనూ, నా భార్యా, చిన్న మనమరాలూ మాత్రమే ఉన్నాం రేపు మా అమ్మాయివాళ్ళు ఢిల్లీ వెళ్ళిపోతున్నారు రెండు రోజుల అనంతరం మా అబ్బాయి బొంబాయి వెళుతున్నాడు తరువాత మళ్ళీ మేం ముగ్గురం మిగులుతాం వాళ్ళను ఇంట్లో ఒంటిగా విడిచి నేను ప్రయాణాలు చెయ్యటం సాధ్యంకాదు

❋

18-3-74

నమస్కారాలు (భారత చైనా మిత్రమండలి) తరఫున త్రైమాసిక తేవటం బాగుంది చీనా జానపద ప్రదర్శనమీద ఒక చిన్న వ్యాసం పంపగలను వాటికి సంబంధించిన ఫొటోలు కూడా నావద్ద ఉండాలి మచ్చుకు రెండు మూడు పంపితే బ్లాకులు చేసి వేయగలరా ? మొదటి సంచిక ఎప్పుడు వచ్చేదీ కూడా తెలియజేయండి ఉంటాను

❋

16-4-74

నమస్కారాలు మీ 15 కార్డు అందింది 14 జాబు అందలేదు నా దగ్గిర Ln Hsun మీద ఒక దీర్ఘమైన వ్యాసమూ, చీనా ప్రదర్శనమీద చాలా చిన్న వ్యాసమూ ఉన్నాయి వాటిని ఇవాళే book post లో మీకు పంపుతాను మీరు వాటిని ఎలా ఉపయోగించుకున్నా సరే

వినోదిని కథలు తప్పక పంపండి ఉంటాను

❋

17-4-74

నమస్కారాలు మీరు ముందు రాశానన్న కార్డు ఇవాళ అందింది సోల్జినిట్సిన్ లాంటి మేధావిని సోషలిస్ట్ రాజ్యంలో ఏం చెయ్యాలో గురువుగార్లు అదివరకే చెప్పారు అతణ్ణి చీనాలో అయితే ఇంతగా పెరగనిచ్చేవారు కారు రష్యాలో నిజమైన Proletarian Dictatorship లేకపోవటం చేత బతికిపోయాడు Ruling class కు అడ్డం రాకపోతే ఇంకా కొంతకాలం పెరిగేవాడే అలా పెరుగుతున్నవాళ్ళు రష్యాలో ఇంకా చాలామంది ఉన్నారు నేటికీ నేను నిన్న పంపిన వ్యాసాలు అందాయనుకుంటాను ఉంటాను

❋

22-5-74

నమస్కారాలు మీరు తిరుపతి నుంచి రాసిన ఉత్తరం అందింది మధుగారమ్మాయి దుర్మరణం గురించి నాకు తెలీదు అయినా, వరవరరావూ, చెరబండరాజూ, ఎం టి ఖాన్‌లు అరెస్టయినట్టు Express లో చూసి శ్రీశ్రీకి telephone చేశాను ఇవాళ 10 కి మా ఆఫీసుకు వస్తాననీ, statements డ్రాఫ్ట్ చేసి ఆంధ్రపత్రిక్కి ఇద్దామనీ అన్నాడు 11 అయింది ఇంకా రాలేదు విరసం తరఫున మరొక statement రాసి press కు ఇయ్యరాదా ? ఈ arrests తో విరసం ఉద్యమం ఆగుతుందనుకోవటం ఎంత foolish ! ఆర్గనైజేషన్‌ని నిషేధించినా సాహిత్యం ఆగదు ఉంటాను

❋

8-1-75

నమస్కారాలు మీరు పంపిన కటింగ్ కాపీలు అందినవి నేను మీకు కార్డు రాసిన తరువాత మీ కార్డు అందింది మీరు పోస్టు చేసిన కటింగులు నాకు అందలేదు కారణం తెలియలేదు

విరసంలో కొందరు వ్యక్తులు anarchic గా వుంటే ఉండవచ్చు కాని జరిగిన పోలరైజేషన్ పూర్తిగా రాజకీయ పంథాల వెంబడి జరిగి, ఘర్షణకు దారితీసింది ఈ సంగతి ప్రభుత్వ ప్రవర్తనలో కూడ స్పష్టం అవుతున్నది M T Khan, రంగనాథం, చెరబండరాజు విడుదల అయినట్టు తెలుస్తున్నది మిగిలినవాళ్ళు ఎవరెవరు release అయినదీ తెలీదు

❋

మద్రాసు,

25-4-78

నమస్కారాలు చీరాల మహాసభలు జయప్రదంగా జరుగుతాయని ఆశిస్తాను మీరు నమ్మగలిగితే, నేను పద్మరాజువి 3 కథలు మాత్రమే చదివాను ఏమైనా, అతనూ, బుచ్చిబాబూ నికరమైన అభ్యుదయ రచయితలని Soviet Litt కితాబు ఇచ్చినాక నాకు అతని రచనల్లో ఆసక్తి పూర్తిగా పోయింది

❋

29-6-79

నమస్కారం మీరు నాకూ, నా భార్యకూ రాసిన ఉత్తరాలు ఇవాళ అందాయి నా వ్యాధి అనుకున్నంత ప్రమాదం కాలేదు మీకు ఉత్తరం రాసినరోజున డాక్టరును చూశాను మళ్ళీ అక్కడ కూడా మోకాలు fold up అయిపడ్డాను కాని డాక్టరు పరీక్షించి, పక్షవాతం భయంలేదని చెప్పి, ఏవో మందులు రాసి ఇచ్చాడు మళ్ళీ కాలు అవుడు చూపలేదు అన్ని పనులూ మామూలుగానే చేసుకుంటున్నాను రాజకీయ విప్లవోద్యమాలను కాదని విప్లవ సాహిత్యోద్యమం ఉంటుందని ఎవరూ అనరు కాని రాజకీయ విప్లవోద్యమాలలో చీలికలు ఏర్పడి విప్లవ రచయితలు ఒక చీలికను అభిమానించదలచినప్పుడు కలాలు పారేసి కత్తి పట్టటంలోఅవమానం ఏమైనా ఉందేమో నాకు తెలీదు ఈ పాయింటుమీద నాతో ఏకీభవించనివారు ఏదో dogma అవలంబిస్తున్నారని నాకు తోస్తున్నది దాని స్వరూపం తెలిస్తే సంతోషిస్తాను లేక అన్నిరకాల రాజకీయ విప్లవ సిద్ధాంతాలను బలపరిచేవారికే విరసంలో సమంగా స్థానం ఉంటుందా ? లోగడ ఇలా జరగలేదు మరి

క్రమశిక్షణ చర్యలకు మినహాయింపు లేమిటి ? నా దృష్టిలో ఎవరికీ కొమ్ములు రాలేదు నన్ను మీరు చేస్తున్నారుగాని, ఏ విధంగా చూసినా విరసంలో నా స్థానం నామమాత్రమైనది నేను ఏ మీటింగుకూ రాలేను అలాటి వాళ్ళను గురించి మీ అభిప్రాయం నాకు ఏనాడో

తెలిపారు విప్లవ సాహిత్యం నేను సృష్టించడం లేదు దానినుంచి చైతన్యం పొందుతున్నవారికి చాలా దూరంగా వుండిపోయాను కనీసం సాధారణ సభ్యుడిగానైనా ఉండమని మీరు మొదట రాసినప్పుడు నాకు అభ్యంతరం లేకపోయింది కలం పట్టిననాటి నుంచీ సాహిత్యోద్యమాల వెంట ఉండిన నాకు విరసంకన్నా సన్నిహితమైనది లేదు నా బుద్ధికి మార్క్సిజం సైన్సు ఆ దృష్టి లేనివారిని నా బుద్ధికొలత సిద్ధాంతంతో గందరగోళంలో పడేశాను ఇంక విరసం సభ్యుడిగా నాకు గల ప్రత్యేకత లేమిటో నాకే తెలియలేదు ఉద్యమకారులు ఏదైనా చెయ్యాలి, చేస్తున్నామన్న భ్రమలో అయినా ఉండాలి నాకు రెండూ లేవు

కార్యవర్గ తీర్మానం పంపండి మూర్ఛపోను

❋

11-12-79

శిష్ట్లావాడు మంచాళ అగ్రహారీకుడు "ఉమ్మయ్య" తాత పేరు అని జ్ఞాపకం తండ్రి శిష్ట్లా కిష్టయ్యగారు నా చిన్నతనంలోనే మంచాళ నుంచి గుంటూరు వెళ్ళి club life కు అలవాటు పడ్డాడు తరువాత కాంగ్రెసులో తిరిగాడనుకుంటాను నేను కిష్టయ్యగారిని అయిదారేళ్ళ వయసులో చూశాను తరువాత వారి కుటుంబంతో నాకు స్పర్శ ఏమీలేదు మళ్ళీ "ఉమ్మాయ్' ' 1936-37 ప్రాంతాల్లో తెనాలి చేరినదాకా ఆ రోజుల్లోనే పద్యాలు పుస్తకంగా వేసినట్టు గుర్తు 1938 కూడా కావచ్చునేమో తరువాత నేను తెనాలి వదిలాను మళ్ళీ మేం 1948 లో బొంబాయిలో కలుసుకున్నాం అప్పటికి వాడు mild charlatanism లో పడ్డాడు వాడి కవిత్వం folk lore లో కొత్త style అనుకుంటాను సామాజిక చైతన్యం ఉన్నదని నాకు తోచలేదు కాకపోతే వాడి వచన రచనల్లో "అగ్రహారబ్బడితె"brilliant self analysis" 1948 లో నాతోబాటు Air India accounts clerk గా పనిచేసి Homo Sexual mal activity కి అరెస్టు అయ్యాడు నేను బొంబాయి వదిలి ఇంకో గంటకు రైలు పట్టుకుంటాననగా నాకు కార్డు వచ్చింది SOS వాడికి సహాయం వీలైతే చెయ్యమని ఒక influential friend కు చెప్పి, నేను మద్రాసు పోతున్నానని వాడికి రాసి రైలెక్కాను ఆ రోజుల్లో వాడు ఏవేవో freehand బొమ్మలు వేసేవాడు నాకు చూపించి, "ఒరే ఇందులో గొప్ప భావాలున్నాయంటున్నార్రా" అని నాతో చాలా impersonal గా అన్నాడు Abstract ideas నాకు అర్థం కావని చెప్పాను తరువాత నేను మళ్ళీ వాడిని కలవనేలేదు మీరు విన్నట్టే నేను కూడా వాడిది Unnatural death అని విన్నాను వాణ్ణి వాడి తండ్రి ఏనాడో disown చేసినట్టు కనబడుతోంది

ఇంతే నాకు "ఉమ్మాయ్" గురించి తెలిసినది ఇది మీకు ఏ విధంగా పనికివస్తుందో తెలీదు Totally detached persons ఉండగలరనుకోను నాకు తెలిసినంతలో వాడు అలాంటివాడు

❋

11-12-79

Your P C of 10th I am sorry if I disappointed you with my reply Fact is I have no confidence in myself with regard to writing a preface to the good old writings of JARUK and SISTLA Actually I do not know how my own old writings stand in today's literary milieu I also don't know how these writings are going to be related to the revolutionary writers' set up I am also not in the habit of writing introductions which are to amount to critical appreciations which enhance my incapacity to place these writings in today's perspective

Jaruk's writings are now part of history and do not need an introduction Sistla was somewhat related to me and but for altering a line of algebraic symbols in one of his poems, I never took any interest in his poetry As a matter of fact, I asked Viswanatha who wrote an intro to Sistla's book, "Did you really admire the poems or simply wanted to encourage a young poet ?" Viswanatha said very sincerely "I may be able to write simultaneously about two things Sistla can handle 3 or 4 things I meant what I wrote" That shows how poor I was in estimating Sistla even in 1938-39

You will most certainly find somebody who can serve your purpose You must excuse my incapacity to meet your need

*

15-1-80

Your P C of yesterday It is really horrible that Cherabanda Raju is having cancer One doesn't worry about dying but being doomed is different Still I feel the Homeo drug CONIUM 200 given at the rate of a dose every week may rally him It is indicated both for tumours (in general) in the head as well as cancerous (malignant) tumours Will you kindly see that he gets this treatment as soon as possible ? It should not be repeated too often and in Lower potencies for this complaint

I am not familiar with Rajamma's literary activity

*

24-7-80

I consider Myself part of the movement for revolutionary literature At my age I am likely having young writers discussing a form of literature to which I never contributed I am not aware of the economic situation of the organization nor do I feel a party to it Still I do not want to gain financially by the efforts Virasam makes in bringing out my book I don't want the profits

If any Virasam member is in financial straits I feel it my duty to go his help with my pittance I am proud that చెరబండరాజు could collect 35,000 ! Every Virasam member should have such backing

*

29-1-65

రాంప్రసాద్‌గారికి,

నమస్కారాలు ఆత్మీయతతో మీరు రాసిన ఉత్తరం నాకు చాలా ఆనందం కలిగించింది ఈ కాలపు యువకులు ఈ కాలపు జీవిత చైతన్యాన్ని గురించి రాస్తే అవి "చదువు" లాగే ఉంటాయి జీవిత యుద్ధరంగంలో చొరబడి సంసారభారం, ఉద్యోగపు ఒడుదుడుకులు, ఇతర సొంత సమస్యల మధ్య నలుగుతూ నేను ఈ కాలపు జీవితాన్ని గురించి అంత విశాల దృష్టితో రాయటం సాధ్యంకాదు నేను వదిలేసిన చోట ఆరంభించవలసిన రచయితలున్నారు వాళ్ళు యుద్ధానంతర జీవితాన్ని యువకులుగా చూసి రాయాలి రాస్తారనుకుంటాను

ప్రస్తుత జీవితం ఆర్థికంగానూ, సాంఘికంగానూ, సాంస్కృతికంగానూ, సాంప్రదాయికంగానూ అయోమయావస్థలో ఉన్నమాట నిజమే ఇది నా దృష్టిలో రాగల జీవితపు ప్రసవవేదనగా తోస్తుంది ఈ దశలో యువకుల చైతన్యానికీ, శక్తియుక్తులకూ సరి అయిన application లేని మాట నిజమే

ఈనాటి ఆంధ్రరాష్ట్రం city కాదు, country కాదు ఒకరకం hybrid జీవితం అమలు జరుగుతున్నది అందరికీ డబ్బు దాహం డబ్బు బొత్తిగా వ్యక్తిపరమైనది గనుక సమష్టి సమస్యలను తలిచే నాథుడు లేడు డబ్బుకోసం మగవాళ్ళు నానాగడ్డీ కరుస్తుంటే సంసార స్త్రీలు సైతం శరీరాలమ్ముకునే దుర్దశ ఏర్పడింది ఏమాత్రం కట్టుదిట్టాలున్న సమాజంలో కూడా ఇలాంటి దుస్థితి ఎవరికీ పట్టకుండా అమలు జరగదు ఈరకం జీవితంలో anarchy లేకపోతే ఆశ్చర్యపోవాలి రాజకీయాలు (ఢిల్లీలో) కేంద్రీకృతమైన కారణం చేత ప్రాంతీయ రాజకీయవేత్తలకు ప్రాంతీయాభిమానాలు లేకుండా పోయాయి కాని ఇది ఆంధ్రులలో ఎక్కువగా కనబడుతుంది తమిళదేశంలో కూడా పై వర్ణాలలో ప్రాంతీయాభిమానం తక్కువే అయినా సామాన్యులలో చాలా ఉంది అందువల్ల కాలక్రమాన వాళ్ళు కొంత కష్టం కూడా పొందవచ్చు ముఖ్యంగా కళల విషయంలోనూ, భాషా సాహిత్యాల విషయంలోనూ వాళ్ళు conservative కావటం చేత చాలాకాలంగా వారి సాంస్కృతికాభివృద్ధి నిలిచిపోయింది కర్ణాటక సంగీతంలోగాని, తమిళ సాహిత్యంలోగాని కొన్ని శతాబ్దాలుగా అభివృద్ధి చెప్పుకోదగినంతగా కనబడదు అంతమాత్రాన మనం తమిళజాతిని ద్వేషించనవసరం లేదు నేను చూసినంతవరకు వాళ్ళు చాలా స్నేహపాత్రులు, సహాయం చేసే స్వభావం కలవారు వారి ఆచార వ్యవహారాలే నాకు బూజు వాసన కొడతాయి

ఎప్పుడైనా తీరిక ఉంటే మా ఆఫీసుకి రండి మాట్లాడుకోవచ్చు ఉంటాను

❋

5-2-69

నమస్కారాలు మీ ఉత్తరం ఇవాళ మధ్యాహ్నానికిగాని అందలేదు ఇటీవల రైళ్ళు సరిగా నడవకపోవటం కారణమై ఉంటుంది

ఆంధ్రదేశంలోనే కాదు, దేశమంతటా రకరకాల అపశ్రుతులు వినిపిస్తున్నాయి మనకు స్వాతంత్ర్యం అవసరమన్నది రుజావు చేసుకున్నది ధనికవర్గం ఒక్కటే మిగిలిన వర్గాలకు ఈ స్వాతంత్ర్యాన్ని ఏం చేసుకోవాలో కొంచెం కూడా తెలిసినట్టు కనబడదు డెమాక్రసీ పెద్ద ఫార్సుగా తయారయింది పార్లమెంటుకి ఎన్నికయ్యేవారిలో నూరింట 95 మంది నోరు విప్పరు వాళ్ళు చేతులెత్తినప్పుడు మాత్రమే ఎవరికి ప్రాతినిధ్యం వహించేదీ తెలుస్తుంది పదవులు దొరకని ఇద్దరు లీడర్లు జనాన్ని ఎగదోసి ఏ రాష్ట్రాన్నయినా 24 గంటలలో ఒక కొలిక్కి తీసుకురాగలరు ! ఇదీ మన దేశ పరిస్థితి బ్రిటిషువాళ్ళు మననెత్తికెక్కి కూర్చోక పూర్వం దేశం ఎట్లా ఉండేదో చదువుకోనవసరం లేదు ఇప్పుడున్నట్లే ఉండేది దేశం split up కావటానికి కారణాలు ఏమీ అవసరం లేదు కాని ఏకం కావటానికి కారణాలు కావాలి అవి లేనప్పుడు ఉభయ గోదావరి జిల్లాల మధ్య ముసలం పుట్టినా ఆశ్చర్యపోనవసరం లేదు

రచయితలు ఏదో చెయ్యగలరనే అపోహ మీకు అవసరం లేదు మీరు చెప్పిన వాళ్ళ కథలు చదివి ఏదో వికాసం పొందామనుకునేవాళ్ళు నూటికి ఇద్దరు కూడా ఉండరు మిగిలిన 98 మందిలో ఒక 18మంది సాహిత్యానికి అతీతులు వివాదాలూ, ఆవేశాలూ వాళ్ళని కదల్చగలుగుతాయి

కూచిపూడి భాగోతాలు నాకు అయిదో ఏట నుంచీ బాగా తెలుసు ఈనాటి కళలలాగా కాకుండా దానికి సంప్రదాయమూ, క్రమశిక్షణా ఉండటం చేత చాలాకాలంగా అది చక్కని పరిణితికి వచ్చింది అందుచేత సహజంగా నిండుగానూ, మనోరంజకంగానూ ఉంటుంది దానిలో ఉండే ఒకే ఒక దోషం అది ఒకచోట నిలిచిపోయింది వర్తమాన కళలలాగా అది కాలానుగుణంగా మారే అవకాశం లేదు కూచిపూడి వాళ్ళు ఇంకా feudal సంస్కారంలోనే ఉన్నారు ఉండక తప్పదు అందుకే వారిలో స్పర్థలు అవి నియోగి, వైదీకి స్పర్థలనుకోను ఉంటాను

❋

20-3-69

నమస్కారాలు మీ 14 ఉత్తరం ఇవాళ అందింది ఆంధ్ర రాజకీయాలు మీకు బాధ కలిగిస్తున్నాయంటే అర్థం చేసుకోగలను కాని పొయ్యి మీది కుండ ఉడకక ప్రశాంతంగా ఉండటం సాధ్యమా ? ఈనాడున్న జీవిత పరిస్థితిలో ప్రపంచంలో ఏ మూలా ప్రశాంతత ఉండటం సాధ్యం కాదు జీవితం ప్రకృతి ధర్మాలకన్నింటికీ ఎదురు నడుస్తున్నది - బాధ్యతలు లేని అధికారాలూ, కృత్రిమ దారిద్ర్యమూ, నిరుపయోగమైన వర్గవిభజనా, ఏనాడో పనికిరాకుండా పోయినా సాంఘిక, ఆర్థిక, రాజకీయ సూత్రాలను అమలులో ఉంచటానికి మారణాయుధ ప్రయోగాలూ, నిజానికి కళ్ళగంతలూ ఇవన్నీ జీవితాన్ని అర్థంలేకుండా చేస్తున్నాయి అర్థంలేని జీవితం ఉద్రేకాలు రెచ్చగొట్టుతుంది ఉద్రేకానికి వశుడైనవాడు ఎంత చదువుకున్నవాడైనా rational గా ప్రవర్తించడు లేకపోతే తిరపతి యాత్రలు ఇంత ముమ్మరమవుతాయా ?

భక్తీ, భజనలూ, మూఢ విశ్వాసాలూ ఇలా పరాకాష్ఠ అందుకుంటాయా ? ఇంత హత్యాకాండ జరిపి, ద్రవ్యనష్టం కలిగించినా శివసేనను కేంద్రం ఎందుకు నిషేధించదు ? మంత్రులమీదా, కోటీశ్వరుల మీదా నా తలవెంట్రుకలన్ని ఆరోపణలున్నాయి వాటిని గురించి విచారణ ఎందుకు జరగదు ? మొరార్జీ దేశాయిలాంటి క్షామదేవత ఇంత పెద్ద పదవిలో ఎలా ఉన్నాడు ? పెద్ద పదవులలో ఉండి అతను దేశానికి చేసిన మేలు ఒక్కటైనా ఉన్నదా ?

కాస్త అధికారమూ, నాలుగు డబ్బులూ ఉన్నంతకాలమూ మనం జీవితం వ్యక్తిగతమనీ, ఉన్న పరిస్థితి మేలనీ అనుకుని వేదకాలపు ఆర్యులలాగా 'ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః' అనుకుంటాం కాని పొయ్యి మీద కుండ కుతకుతమనగానే జీవితం సమష్టిఅనీ, పక్కవాడిల్లు అంటుకుంటే మన ఇంటికి అపాయం ఉన్నదనీ, కారు నడిపేవాడు తప్పతాగి ఉంటే రోడ్డు మీద ఎవడి ప్రాణానికీ క్షేమంలేదనీ తెలుసుకుని బాధపడతాం

నన్నడిగితే మనకెవరికీ శాంతిని కోరే హక్కు లేదు జీవితాన్ని సంస్కరించటానికి మనమేమీ చెయ్యలేం, మన చేతిలో ఏమీ లేదు కూడా

కాని ఒకటి చెప్పగలను తెలంగాణా చీలదు చీలితే తెలంగాణా పాట్లు కుక్కలూ, నక్కలు పడవు స్వాతంత్ర్యం రాకపూర్వం తెలంగాణా వాళ్ళు ఎలాంటి బానిస బతుకు బతికారో నాకు తెలుసు నేనక్కడ దాదాపు ఒక ఏడాది ఉన్నాను ఉంటాను

❋

23-9-67

నమస్కారాలు నిన్న మీరు రాసిన ఉత్తరం అందింది "కేయాస్" అన్నా, ఆరకం హాస్యం సృష్టించటమన్నా నాకు వాంతి వచ్చేస్తున్నది ఇక అటువంటివి రాయను పోతే ఏవైనా చిన్న చిన్న వ్యాసాలు రాద్దామని అప్పుడప్పుడూ అనిపిస్తూ వుంటుంది Humour వున్నా లేకపోయినా తోచినప్పుడల్లా రాసి పంపించగలను

Short Novel మాట ప్రస్తుతం ఒక lengthy novel లో ఇరుక్కున్నాను నేను రాసే short novels మీకు అయిదారు వారాల కన్నా రాకపోవచ్చు మీరైనా short novels వెయ్యదలిస్తే 5, 6 issues లో అయిపోయేటట్టు చూడటం మంచిదనుకుంటాను అవసరమైతే ఇన్‌స్టాల్‌మెంట్స్ కాస్త పెద్దవి వెయ్యండి నెలల తరబడి శ్రద్ధగా follow కావాలి ఏమంత absobring stuff ను సృష్టించడం లేదు నేను ఒకటి రెండు నెలల దాకా short novels గురించి ఆలోచించలేను గనుక మరెవరితోనైనా మొదలు పెట్టండి కొంచెం పెద్ద కథలు attempt చెయ్యమని బీనాదేవిగారికి ఒక సంవత్సరం చిల్లర క్రితమే సలహా ఇచ్చాను వారు ఆ ప్రయత్నం చేసినట్టు కనపడరు

నాకు వార పత్రిక వారం వారం అందుతున్నది Thanks కొన్ని వ్యాసాలు బాగుంటున్నాయి నార్లగారి పద్యాలు చాలా వరకు పడుతున్నాయి 'ఇల్లాలి ముచ్చట్లు' as a feature తృప్తికరంగా ఉన్నది కొన్ని మహా ఘాటుగానూ, కొన్ని అంత ఘాటు లేకుండా ఉంటున్నాయి కాని ఒక feature ను consistant గా నడపటం ఎవరికీ సాధ్యం కాదు నేను రాసిన మొదటి కథకు డబ్బు పంపారు తరువాత అచ్చయిన రెంటికీ పంపలేదు వీలుంటే వాటి విషయం కనుక్కోండి

❋

22-5-68

నిన్న మీరు రాసిన ఉత్తరం అందింది 'చెడిపోయిన మనిషి'లో మీరు చెప్పినదే పాయింటు Sex Morality గురించి realistic గా వుండాలి Spinster charity అన్నది చాలా irritate చేస్తుంది నేను 50 ఏళ్ళ నుంచీ చూస్తున్నాను పల్లెటూళ్ళలో sex గురించి చాలా realistic గానే ఉండేవాళ్ళు నా చిన్నతనంలో నా మిత్రుడొకడు ఎవరో ఆవిణ్ణి అత్తయ్యా అని పిలవటం చూసి ఆవిడ నీకు అత్తయ్య ఎట్లా అయిందిరా అని అడిగాను వాడు చెప్పాడు ఆవిడ భర్త నపుంసకుడట పబ్లిగ్గా ఆవిడ వాడి మేనమామతో sex సంబంధం పెట్టుకుని పిల్లల్ని కూడా కన్నది గ్రామానికంతకూ ఈ విషయం తెలుసు ఎవరూ ఆవిడను వెలివెయ్యలేదు పెళ్ళి చేసుకున్నవాళ్ళు sex morality కి కట్టుబడి ఉండటంలో అర్థం ఉన్నది Sex life కు పెళ్ళి అన్నది ఆధారం లేకపోయాక sex అవసరాలు ఆడది ఏ విధంగా తీర్చుకునేది పైవాళ్ళకెందుకు ? అందులో జోక్యం కలిగించుకోవటం damn fool-

ish మీరన్నట్టుగానే, ఆ కథలో progressive element ఉన్నదని కృష్ణాబాయిగారు కూడా ఇవాళే రాశారు

నా బుర్రలో long story theme ఏదీ లేదు తట్టితే రాసి మీకే పంపుతాను ప్రస్తుతానికి మీకు matter shortage ఏమీ ఉన్నట్టులేదు రాజగోపాలంగారు ఎందుకు వెళ్ళిపోతున్నారు ? కొంతకాలం క్రితం ఒకరిద్దరు జర్నలిస్టులుగా పనిచేస్తామనీ, నన్ను సలహా ఇవ్వమనీ అడిగారు కాని ప్రస్తుతానికి నాకెవ్వరూ తట్టటం లేదు బెజవాడలో వుండే వాళ్ళే అయితే జీతం మరింత గిట్టుబాటుగా వుంటుందేమో ! ఉంటాను

❋

31-7-68

నమస్కారాలు ఆంధ్రజ్యోతి వార పత్రిక సక్రమంగా అందుతూనే ఉన్నది ఖర్చుతో మా అమ్మాయిని contributor's list లో చేర్చగలరా ?

Address R Santha Sundari B A.,

BD 1006, Sarojani Nagar,

New Delhi - 23

మీ ఆఫీసువారు నాకింతవరకు payments certificates పంపలేదు 1-4-67 నుంచి 31-3-68 దాకా నాకు ఇచ్చే మొత్తాల certificate కావాలి లేకపోతే I T వాళ్ళు పేచీ పెడతారు కాస్త ఆ విషయం కనుక్కోండి

ఆ చేత్తోనే నాకు పంపవలసిన డబ్బు (minus my daughter's subscription) సాధ్యమైనంత త్వరలో పంపండి ఈ నెల మావాణ్ణి MIT లో చేర్చటానికే 7, 8 వందలు ఖర్చువుతుంది

'ఇల్లాలి ముచ్చట్లు' చురకలు కావలసిన చోట register అవుతున్నాయా ?

నార్లవారినీ ఇతర మిత్రులను అడిగానని చెప్పండి ఉంటాను

❋

2-8-68

నమస్కారం, మీరు 31 నా, 1నా రాసిన ఉత్తరాలు అందాయి Certificates అందాయి అన్నిటికీ thanks

దీపావళి సంచికకు ఏదన్నా కథ రాస్తాను వ్యవధి ఉన్నదనుకుంటాను 'ఇల్లాలి ముచ్చట్లు' పుస్తకంగా వేస్తే 'వీటి కన్నా' ఎంతో బాగుంటుంది అని నా భార్య నిన్ననే pocket books చూపించింది Sheer telepathy అనుకుంటాను ఆ feature గురించి నా అభిప్రాయాలు తప్పక రాసి మీకు సోమ, మంగళ వారాలలో అందేటట్టు చూస్తాను

ముర గారికి వేపకాయంత పైత్యం ఉన్నదని నా అనుమానం  కొంచెం కూడా self analysis లేదు  నన్ను వెనకేసుకొచ్చి ఆవిడను దులిపిన అబ్బి ఎవరు ?  (నిన్న అందిన సంచికలో)

'మరో ప్రపంచం' Lost Horizon కు కాపీ, అందులో తలకు ఎక్కదగినదేమీ లేదు మళ్ళీ చదవటం దండుగ  అది కూడా 'తార' లాగే కినిమాలో పడ్డ serial

కాళీపట్నం రామారావుగారి దగ్గర ఇంకా కథలున్నట్టు విన్నాను  అవి బయటికి రావా ఏం ?

'స్త్రీల గురించి' అన్నదాని మీద దుమ్ము రేపటం మంచి journalistic stroke ఇటీవల ఎవరూ ఆ పాటి తెలివి కనపరచలేకపోయారు  పత్రికకు dust raising చాలా మంచిది  ఉంటాను

❋

17-10-68

నమస్కారాలు  మీ ఉత్తరం ఇప్పుడే అందింది  విశాఖకు సకుటుంబ సమేతంగా వెళ్ళి చాలా రోజులున్నాను  అందరూ కనిపించారు మీ ముర తప్ప

'అల్పజీవి' మాట  మీకు వచ్చిన చిక్కు విడటానికి దివ్యమైన ఉపాయం ఉంది కొంతకాలం క్రితం 'భారతి'లో సుదర్శనంగారు 'అల్పజీవి' మీద అద్భుతమైన అప్రీసియేషన్ ప్రచురించారు  మీరు సుదర్శనంగారి పర్మిషనూ, శాస్త్రిగారి పర్మిషనూ తీసుకుని దాన్ని ప్రచురిస్తే ఎంతో బాగుంటుంది  శాస్త్రిగారిని pat చేసేందుకు నాకు guts లేవు  రాస్తే అప్రీసియేషనే రాయాలి  అదైనా 'అల్పజీవి' గురించి అయితేనే బాగుంటుంది  దాన్ని నేనింతవరకూ చదవలేదు  చదివినా సుదర్శనం గారి heights కు పోవటం నాకు సాధ్యం కాదు  కనుక ఆయనదే వేస్తే బాగుంటుంది  సుదర్శనంగారి address

Sri R S  Sudarsanam M A ,
Principal, Govt  College,
Vidavaluru (Nellore Dt )

బాపు Title drawing వేసే ఆశ ఉన్నదా ?  అతను రష్యా, తూర్పు యూరప్ తిరుగుతున్నాడేమో ?

❋

17-1-69

నమస్కారాలు  'పిపీలికం' పైకి చూడటానికి simple గా ఉన్నా చాలా లోతులు తరిచింది  ఫిలాసఫీ, సోషియాలజీ, పాలిటిక్స్ వగైరాలన్నిటికీ అదొక పాణినీ సూత్రం  దానిమీద ఏమైనా ఉత్తరాలు వచ్చాయా ?

గిరీశం అన్నట్టు మన వాళ్ళుత్త

నాకు 'ఆంధ్రజ్యోతి' దినపత్రిక regular గా కావాలి  నా ఆఫీసు ఎడ్రసుకు రోజూ వచ్చే ఏర్పాటు చేయగలరా ?  నా account లో ?

మా అమ్మాయి ప్రస్తుతం ఢిల్లీ ఎడ్రసు R Santha Sundari, K-52, Kirthi Nagar, New Delhi - 15  వార పత్రిక ఈ address కు పోతున్నదేమో కాస్త check up చెయ్యండి  మీకు చాలా పని పెడుతున్నాను  ఉంటాను

❋

22-1-69

నమస్కారాలు  మీ ఉత్తరం అందింది 'పిపీలికం' లాంటి రచనకు Mass reader respond కాడు  ఈ contradiction మీకు ఈ పాటికి అనుభవం అయ్యే వుండాలి  Circulation పెరగాలంటే మంచినీళ్ళలాంటి stuff పడాలి  జన బాహుళ్యానికి banalities ఇష్టం  జ్యోతి వార పత్రికలో కథల standard కొంచెం తగ్గినట్టే నేను feel అవుతున్నాను  కానీ readable nonsense రాసే వాళ్ళు కూడా తక్కువగానే ఉండటం చిత్రం  వాటి మధ్యన 'పిపీలికా'న్ని తోసివిడవచ్చు  'ఇల్లాలి ముచ్చట్లు' కూడా ఒక cross section కే appeal అవుతాయి  'ఇల్లాలి ముచ్చట్లు' శేషాచలం & కో వేసుకోవచ్చునే ? వాళ్ళు ఆ రకం రచనల్లో చాలా poor stuff కూడా వేశారు

చాసో కథల మీద నా రివ్యూ 'సంవేదన' 4లో వచ్చింది  మీకు అందే ఉంటుంది  చాసో మళ్ళీ కథలు రాయటం మొదలు పెడితే ఆ క్రెడిటంతా మీదే  Preface రాసినవాడే రివ్యూ చెయ్యటం ఏమీ బాగుండదు  ఆంధ్రప్రభవాళ్ళు నా preface లు గల పుస్తకాలు (గుడ్డిగా) నాకు ఇప్పటికి 3 పంపారు  రెండు చిక్కులు - preface ఆటే critical గా ఉండదు  అందుచేత reviewని contradict చెయ్యటం జరగవచ్చు  లేదా అదే మళ్ళీ ఏకరువు పెట్టవలసి ఉంటుంది- for the sake of consistancy

కన్యాశుల్కం first edition reprint చెయ్యటం గొప్ప idea  దాన్ని వీలుంటే పుస్తకంగా కూడా అచ్చు వేయించండి  అదే matter pages గా set చేస్తే కంపోజింగ్ కలసి వస్తుంది  500 కాపీలు తీసినా చాలు  గురజాడ జీవితం కూడా అలాగే చెయ్యవచ్చు  ఇటువంటివి common or general reader కు అంతగా పట్టవు  కాని students etc , కు ఆసక్తి కలిగించేటట్టుగా మీరు in advance కొంత ఊదర పెట్టినట్టయితే effect వుంటుంది

నేను ఎక్కడకు వెళ్లినా ఆడవాళ్ళ సమస్యలు గురించి ఎత్తి, నేనేదో feat చేసినట్టు చెబుతున్నారు  Credit అంతా మీదేనని వాళ్ళకు చెప్పేస్తున్నాను  Weekly editor పాఠకుల tastes ని pamper చేస్తున్నట్టు కనిపిస్తూనే వాళ్ళ tastes ను కొంతవరకు మార్చవచ్చు  పుస్తకాలూ, daily ఇంకా రాలేదు  వస్తాయి లెండి  ఉంటాను

❋

22-3-69

నమస్కారాలు  దినపత్రిక, వారపత్రిక regular గా అందుతున్నాయి  బహుశా ఏప్రిల్ మొదటి వారంలో నేనూ, నా భార్యా ఢిల్లీ పోతాం  అక్కడ నాలుగైదు వారాలుంటాం బయలుదేరేముందు మీ Circulation Manager గారికి రాస్తాను  పత్రికలు అక్కడి addressకు పంపమని

కన్యాశుల్కం 1897 edition నెల్లూరు వాళ్ళు foot notes తో సహా అచ్చు వేస్తున్నారు మీకు తెలిసే ఉండవచ్చు  Body printing అయిపోయింది  Appendix మిగిలి ఉంది చాలా శ్రమ పడుతున్నారు  కొన్ని వివరాల కోసం నన్ను అడిగితే చెప్పలేకపోయాను  My Mother Poem మాత్రం type చేయించి ఇచ్చాను

'ఇల్లాలి ముచ్చట్లు' ఆపేశారేం ?  ఇంక వేయరా ?  రామసంజీవిగారికి సంగీతం గురించి అంత accurate Ideas ఉన్నాయని నాకిదివరకు తెలీదు  చిట్టిబాబు గురించి నన్ను రాయమంటే 99% అదే రాసి ఉందును

Radio Review 'మంచి'గానే వుంటుంది గాని నిజంగానే బోర్  Weekly లో జంప్ తక్కువగానే ఉంది  ఏమిటి కారణం ?  ఎవరూ రాయటం లేదా ?

కాళీపట్నం రామారావుగారు 'యువ'లో మంచి కథ వేశారు

చాసో మళ్ళీ మొదలుపెట్టి మెరికలాంటి కథ రాశారు  More Power to his Elbow !  ఉంటాను

❋

26-3-69

నమస్కారాలు  మీ ఉత్తరం అందింది  మేం ఏప్రిల్ 4న G T కి టిక్కెట్టు బుక్ చేశాం  ఏప్రిల్ 5 తేదీగల daily నుంచి ఢిల్లీ అడ్రసుకు పంపవచ్చును

K Kutumba Rao, C/o Mr R S G Rao, K-52, Kirti Nagar, New Delhi - 15

అది మా అమ్మాయి address  మీ weekly dispatch లో వుంటుంది  అన్నట్టు నాకు weekly వేరే పంపనవసరం లేదు  మా అమ్మాయికి వచ్చేది చూస్తాను  Daily పంపితే చాలు

మేము బహుశా May 8న ఢిల్లీ నుంచి రైలెక్కుతాం  అప్పుడు మా అమ్మాయి మా వెంట వచ్చేస్తుంది  ఆ గొడవ తరువాత రాస్తానులెండి

పుస్తకాల రివ్యూలేవో రాస్తున్నానుగాని ఏమీ రాయబుద్ధి కావటం లేదు  ఆ మధ్య Emesco వాళ్ళ దెప్పుళ్ళు పడలేక ఒక నవల రాశాను  చాలా rugged గా తయారయింది నా జన్మలో మొట్టమొదట "దీన్ని తిరగ రాయక తప్పద"నిపించింది  ఈ లోపల అందులో ఉన్న కొన్ని సన్నివేశాలు కథల్లో వచ్చేస్తున్నాయి  ఢిల్లీలో ఒక నెలపాటు నాకు పనీ, పాటా

ఉండదు గనుక తిరగరాస్తాను అక్కడి నుంచే articles కూడా ఏమైనా రాసి మీకు పంపుతాను

డబ్బు గురించి మంచి కథలు రావటం లేదనుకోనవసరం లేదేమో ! ఒక్క ప్రభ వీక్లీవాళ్ళు తప్ప ఎవరూ అంత బాగా ఇవ్వటం లేదు యువ వాళ్ళు అంతే Lighter Veinలో articles ఇస్తే కథలకన్నా బాగుంటుంది మొత్తం మీద ఈ దశకంలో humour తక్కువయిందనే చెప్పాలి

నిన్ననే మొక్కపాటివారి 'బాతాఖానీ' రివ్యూ రాసాను మీరు దానిమీద రాసినది చదివాను కాని అందులో humour ఏమీలేదు గ్రాంథికంలో మాట్లాట్టం humour అనుకుంటే తప్పు

శాస్త్రిగారి 'పాత రైలు కదిలింది' (జయశ్రీ) పేజీన్నరే రాసినా అందులో ఉన్న హ్యూమర్ 'బాతాఖానీ' మొత్తంలో శతాంశం లేదు ఆయనను రాయించే వాళ్ళు కావాలి "అల్పజీవి" ఇంకా చదవలేదు రివ్యూ పుస్తకాలూ, చందమామా, gastric trouble నన్ను గానుగాడించేశాయి తాపీగా చదువుతాను అందర్నీ అడిగానని చెప్పండి ఉంటాను

❋

10-5-69

నమస్కారాలు అనుకున్న ప్రకారం మే 1న చేరాను 'ప్రగతి'లో మరింత (పోనీ మనమంతా) చేస్తున్న noise ద్వారా తెలుగుదేశంలో కన్యాశుల్కానికి ప్రచారం జరుగుతుందా అని సందేహం లేకపోలేదు ఎమెస్కోవాళ్ళ మొదటి ముద్రణ కాపీలు అయిపోయాయంటున్నారు గుడ్ నేను కాస్త తిక్కరేగి కన్యాశుల్కం మీద "నోట్స్" రాయటం మొదలుపెట్టాను అయిదో వంతుకు పైగా రాశాను ఈ నెలాఖరులోగా పూర్తి చేస్తానని ఆశ దీన్ని మీ వారపత్రికలో వారం వారం కనీసం రెండేసి పేజీల చొప్పున వేసే ఆలోచన ఉంటే అయినంత వరకు పంపుతుంటాను కాని ఒక వార్నింగ్ - దాని వల్ల వారపత్రిక ఒక్క కాపీ కూడా హెచ్చు అమ్మకపోవచ్చు అందుకు క్రెడిట్ మీరు కూడా కొంత noise చేసినట్టుంటుంది ఏ సంగతీ రాయండి

'ఇల్లాలి ముచ్చట్లు' serious అయిపోతున్నాయి ఇంకొంచెం light గా ఉంచరాదా?

"జ్యోతి"లో ఏదో ప్రారంభిస్తారట ఏమిటి కథ ?

Daily & Weekly regular గానే అందుతోనే ఉన్నాయి ఉంటాను

❋

17-5-69

నమస్కారాలు కన్యాశుల్కం నాలుగంకాలని నిన్న Regd Book Post లో పంపాను అందే ఉంటుంది

ఢిల్లీలో నేను ఏమీ చెయ్యలేదు - లోఫ్ (రొట్టె కాదా) చేశాను నేను అసలు తీసుకుపోనేలేదు అది జ్ఞాపకం వస్తే భయం భయంగా వుంది సొంత రచన అంటే వాళ్ళు ఏమీ వంగటం లేదు

ఇవాళ weekly issue వచ్చింది Daily రాలేదు మీ వాళ్ళు ఆ daily ఇన్నాళ్ళూ ఇక్కడికీ అక్కడికీ కూడా పంపారుట నేను ఢిల్లీ నుంచి వచ్చాక కూడా అక్కడికి పంపుతూనే ఉన్నారుట ఆపండి అని మీ Circulation Manager కు ఓ కార్డు ముక్క రాశాను ఇక్కడికి వచ్చేది రక్కున ఆగిపోయింది బహుశా అక్కడికి వెళుతూనే ఉందేమో ? అంతా అయోమయం అడవి మేళంగా ఉంది

ఈ issue లో continue అవుతున్న రామారావు కథ 'ఆర్తి' చూశాను ఎంత బాగా రాస్తాడు దేవుడు ! కృష్ణంరాజు కూడా పాత కథని చాలా మజాగా రాశాడు సంచిక్కొక్కటైనా ఆ మాత్రం దరువు వుంటేనేగాని మజా లేదు 'ఇల్లాలి ముచ్చట్లు' కూడా సరదాగానే ఉంది గానీ, అంత రాజకీయంగా ఉండకపోతే బాగుండును పొదిలో ఇంకా అస్త్రాలు ఉన్నాయి కదా పైకి తీయండి

'ప్రగతి'లో గిరీశం మీది చర్చ అంతకంతకూ గొడవగా ఉంటున్నది "బూజు కర్ర గిరీశం" చూసే వుంటారు ఉంటాను

❋

12-6-69

నమస్కారాలు ఉత్తరాలు మళ్ళీ బట్వాడా అవుతున్నాయని ఇవాళ మిగతా "నోట్స్" రిజిష్టర్ చేసి పంపించేస్తున్నాను వీటి మీద మళ్ళీ ఏమన్నా విమర్శలు వస్తే అవి నాకు చేరేటట్టు చూడండి నా లోపాలూ, తప్పులూ ఉంటే సవరించుకునేటందుకు వీలవుతుంది నాకు కిందటి నెల 31న 30వ తేదీ సంచిక వచ్చింది ఇవాళ 13వ తేదీకి వచ్చింది మధ్యలో 6వ తేదీ సంచిక రాలేదు అది కాస్త పంపండి ఉంటాను

విశేషాలేమీ లేవు

❋

21-7-69

నమస్కారాలు దినపత్రిక, వారపత్రిక వస్తూనే ఉన్నాయి గానీ మీ ఆఫీసు నిద్రపోతున్నట్టున్నది

Income Tax returns పంపించటానికై, కిందటేడు (1-4-68 నుంచి 31-3-69 దాకా) ఒక certificate ఇవ్వమని మీ మేనేజరు గారికి రాశాను మిగిలిన వాళ్ళంతా ఏనాడో సర్టిఫికేట్లు పంపారు మీ ఆఫీసు నుంచి జవాబు లేదు 6-6-69, 4-7-69 వీక్లీ సంచికలు నాకు రాలేదు దయచేసి పంపవలసినదిగా మీ Circulation Manager గారికి రాశాను అతీగతీ లేదు

అందుచేత మిమ్మల్ని బాధ పెట్టవలసి వచ్చింది వీక్లీ కాపీల మాట దేవుడెరుగును ! Payments Certificates తిరుగు టపాలో వచ్చేటట్టు చూడగలరా ? నేను ఇంకో వారం లోపుగా I T Returns పంపాలి

రామ్మోహన్‌రావుగారిని అడిగానని చెప్పండి ఆయన వైజ్ఞానిక వ్యాసాలు చాలా బాగుంటున్నాయి ఉంటాను

❋

23-7-69

నమస్కారాలు Certificate చేరింది బతికించారు

నిన్నా మొన్నా ABK ను ఇక్కడ కలుసుకున్నాను అతనికి మీ జ్యోతిలో చేరాలని ఉందిట నిన్ననే నార్లగారికి ఆ విషయం ఉత్తరం రాశాను మీ గృహ రాజకీయాలూ, నండూరి వారి వైజ్ఞానిక రచనలూ చూస్తున్నాను చాలా బాగుంటున్నాయి రీడర్లు గుర్తించారు గనుకనే నేను పని పెట్టుకుని రాయలేదు లేకపోతే ఒక ఉత్తరం చెక్కేవాణ్ణే

ఈ మధ్య ఒక రోలు కాదు, నాలుగు రోళ్ళలో తలదూర్చి ఉక్కిరి బిక్కిరి అయాను అన్నీ ఒక్కొక్కటే విడిపోయాయి నేను చేసిన బండ పనుల్లో ఒకటి సృజనకు బంగోరె పుస్తకం మీది రివ్యూ ఈ "కన్యాశుల్కం" ఏ నక్షత్రాన పుట్టిందోగాని రాసిన కొద్దీ విషయం ఊరుతున్నది తెలిసో తెలియకో తెలివితేటలు ఎక్కువయో ఎవరో ఒకరు ఏదో ఒకటి అనటమూ, దాంతో నాకు ఆవేశము రావటమూనూ కన్యాశుల్కానికి వీరేశలింగం నాయకుడని రమణారెడ్డి ! అటువంటి statements ని ఎట్లా పోనివ్వడం ?

నాకు కథలూ, కాకరకాయలూ రాసే మూడ్ లేదు ఒక నవల రాసి పడేశాను నాక్కావలసినట్టు రాలేదు తిరగరాయటం దాదాపు అసంభవంగా ఉన్నది ఈ నోట్స్ అయాక ఆ చేత్తో వేస్తానంటే మీకు పంపిస్తాను కొంత అపఖ్యాతి పాలు కావటానికి నాకు slightest objection లేదు నాకు భయం ఖ్యాతి అంటేనే

వ్యాసాలు రాయొచ్చు మీరేదన్నా incentive create చెయ్యండి కొంచెం దుమ్ము లేపుదాం ఆడవాళ్ళు fizzle అయినట్టున్నారు

నార్లగారికి నా నమస్కారాలు చెప్పండి ఉంటాను

❋

9-8-69

నమస్కారాలు మీ ఉత్తరం అందింది ప్రశ్నలకు జవాబులిస్తామని పత్రికలో వేశారు, చూశాను ఈ జవాబులకు ఒకరి authorship ఉండాలా ? ఈ విజ్ఞానంలో ఒక్క నలుసు కూడా మనం సృష్టించినది కాదు వ్యాసాలు రాయటంలో చెప్పే ఒడుపు ఉంటుంది గనుక రచయిత పేరు ఉండవచ్చు సమాధానాలకు అవసరం లేదనుకుంటాను అన్ని ప్రశ్నలకూ

రామమోహనరావుగారే జవాబులివ్వగలుగుతారు నాకేమైనా ప్రశ్నలు పంపదలిస్తే నాకు సాధ్యమైనమటుకు నేనూ జవాబులిస్తాను నా సహకారం ఎప్పుడూ ఉంటుంది

ఒక్కమాట ఇన్నేళ్ళు జర్నలిజంలో నాని ఉండి నేను నేర్చుకున్నదేమంటే వైజ్ఞానిక విషయాలు ఆకర్షించేది 1 in 1000 పాఠకులను అటువంటి వాటితో సర్క్యులేషన్ పెరగదు కాని కీర్తి వస్తుంది (మామూలు పాఠకులు పత్రిక్కి ఏనాడూ కీర్తి కట్టబెట్టరు డబ్బులిచ్చి కొంటారు సర్క్యులేషన్ పెంచుతారు కొంత అప్రతిష్ఠ కూడా తెస్తారు) అదీ సంగతి మీకైనా తెలిసే ఉండొచ్చు ఉంటాను

❋

5-9-69

నమస్కారాలు దాదాపు రెండు నెలలుగా మా అమ్మాయికి వీక్లీ వెళ్ళటం లేదు వెళ్ళటం లేదని నాకు రాస్తే మిమ్మల్ని బాధించటం ఇష్టం లేక ఆఫీసుకు రాయమన్నాను రాసిందిట రాస్తే "నీవు మాకు subscriber వి కావు డబ్బు పంపించు పత్రిక పంపిస్తాం' అని మీ ఆఫీసువారు రాశారట సంవత్సర చందా తీసుకోలేదో, తీసుకున్నది అయిపోయిందో, లేక మా అమ్మాయి చందాదార్ల లిస్టులోనే లేదో ఏమీ తెలియటం లేదు మీ ఆఫీసు నుండి వచ్చిన ఉత్తరాన్ని నాకు పంపమని మా అమ్మాయికి రాశాను రాగానే మీకు పంపుతాను

కిందటి financial year లో నాకు credit చేసింది చందా కింద సరిపోయిందో, మిగిలిందో, నేనే బాకీ పడ్డానో నాకు గుర్తులేదు నాకు మీరు పంపిన అంకెలు పారేసుకున్నాను నాకేమన్నా రావలసింది ఉంటే పంపించమనండి మీ ఆఫీసుతో వచ్చినంత గొడవ నాకు మరే ఆఫీసుతోనూ రావటం లేదు ఉంటాను

❋

8-10-69

నమస్కారాలు నాగపూరు యూనివర్శిటీవాళ్ళు 'ఇల్లాలి ముచ్చట్లు' పెట్టటంలో joke ఏమీలేదు Essay writing కు అవి బాగా పనికొస్తాయి దాన్ని annotate చేస్తే ఇంకా మజాగా ఉంటుంది ఇంటర్‌లో మాచేత Hozli (Spelling సరిగాలేదు), Dryden మొదలైన వాళ్ళ ఎస్సేలు చదివించి చావగొట్టారు వాటిలో ఉన్న satire వగైరాలు 'ఇల్లాలి ముచ్చట్ల' లోనూ ఉన్నది So there's nothing funny about it It will be great fun if the book has a good demand and comes in for a second edition

ప్రశ్నలు రేపు చేరతాయేమో !

గురజాడ డైరీలు అచ్చవుతాయా ? అందులో స్పెల్లింగు లోపాలుంటే ఆయన omit చేసిన అక్షరాలు brackets లో చేర్చి అచ్చు వేయించవచ్చు గద ! లేక మీరు మళ్ళీ తెలుగు చేస్తున్నారా ?

రమణారెడ్డిగారు శ్రీశ్రీ పని పూర్తి చేశారా ? దీపావళికి కథ రాయను ఇంక అసలు కథలే రాయను రేపో ఎల్లుండో రావిశాస్త్రి వగైరాలు ఇక్కడికి దిగుతారు 11న నిజం నాటకం ఉంది శ్రీశ్రీ మీద వేదమంత్రాలు చదివి పూర్ణకుంభం చూపిస్తారు Damned tribalism, pity Sri Sri

❋

13-10-69

నమస్కారాలు ప్రశ్నలు అందాయి ఉత్తరం అందింది మీరు నన్ను ఊదరగొట్టి ఊబిలో దించటానికి ప్రయత్నిస్తున్నారు కథలు రాయనవసరం లేదనుకున్నాక మీ వంటి వాళ్ళ పోరు పడలేక ఆరేడు కథలు రాశాను అదే mood లో ఇంకోటి రాస్తే కొంప మునిగేదేమీ లేదు రాయటానికి ప్రయత్నిస్తాను

ఇవాళే book post లో ఆంధ్రుల వెధవాయిత్వం గురించి చాలా మర్యాదగా నాలుగు ముక్కలు రాసి మీకు పంపిస్తున్నాను నా అసలు feelings బయట పెట్టాలంటే ఈ రాసిన దాన్ని 100 పెట్టి హెచ్చించాలి

నిన్న రా వి శా గారూ, భార్యా (advocate), వారి ఇద్దరు పిల్లలూ మా ఇంటికి వచ్చి కొంచెం సేపు కూర్చున్నారు 'నిజం' నాటకం story writers' stuff అనీ, dramatist's stuff గా లేదనీ చెప్పాను చదువుకున్నవాళ్ళే నాటకం purpose miss అయి, తిలా పాపం తలా పిడికెడూ అన్న నీతి అందులో ఉందనుకుంటున్నారు వాళ్ళు ఆ పొరపాటు పడటానికి కారణం శాస్త్రిగారిది కాదు వాళ్ళు సినిమా విలన్స్‌ని చూసి చూసి sefl justification చాతయిన విలన్ మాటలకు బుట్టలో పడ్డారు శాస్త్రిగారి నాటకంలో ఉన్న genius అంతా అక్కడే వుంది సార్వభౌమరావు స్టేజీ మీద పాత్రల్నే కాదు, ఆడియన్స్‌లో చాలామందిని అంత తేలిగ్గా fool చేయగలిగాడు నాటకం చదివినప్పుడు good drama అనుకున్నాను గాని, performance ద్వారా audience reaction చూసిన దాకా ఇంత amazingly good drama అన్నది నాకు తట్టనే లేదు

శ్రీశ్రీ సన్మానం రిపోర్టు మీ daily కి వస్తుందనుకుంటాను ఆ మధ్య శ్రీశ్రీ విద్యార్థుల కథల (Emesco) పుస్తకం ఆవిష్కరించినప్పుడు ఆ రిపోర్టు ఎంచేతో ఆంధ్రజ్యోతిలో రానే లేదు శ్రీశ్రీ ఫంక్షన్ low light ఏమిటంటే ఆరుద్రా, రామలక్ష్మీ దగ్గర నుంచీ గైరు హాజరు కావటం DVK కూడా రాలేదు

తెలుగు వాళ్ళ cultural affairs చూస్తుంటే జబ్బు చేస్తున్నది బహుశా మీరు రా వి శా చేత కూడా రాయించలేరు మిగిలిన కథకులు (బీనాదేవి తప్ప) అయనను బొత్తిగా ఒంటరిగాన్ని చేశారు నేను రోజుకు రెండు మూడు కథలు రాసే రోజుల్లో నా వెంట డజన్ల మంది కథకులున్నారన్నది ఉత్సాహం ఇచ్చేది చాలామంది fame చాలుననుకుంటారు Lonliness కు ఎంత కీర్తి కూడా compensation కాదు ఇది అనుభవంతో చెప్పిన మాట

గురజాడ వారి డైరీలు ఒక్కసారి చదివి చూడాలని ఉన్నది అవకాశం దొరక్కపోతుందా? రామమోహనరావుగారిని అడిగానని చెప్పండి ఉంటాను

*

15-10-69

నమస్కారాలు Latest సంచికలో నార్లవారు నన్ను గురించి మంచిగా రాసిన నాలుగు ముక్కలు చూసి చాలా ఆనందించాను వారికి నా కృతజ్ఞతలూ, నమస్కారాలూ అందజేయండి

మీ పోరు పడలేక నిన్న రాత్రి కూర్చుని ఒక outrageous woman character తో కథరాసి ఇవాళ మీకు post చేశాను ఆ పాత్రను పదిమందీ తిట్టితే ఆ moral responsibility మీదే ఆ పాత్రను సృష్టించటంలో నా moral furpitude ఉందేమో ! ఎందుకంటే ఆ పాత్రను నేను like చేస్తాను నేను like చెయ్యనిది కథలు రాయటం మటుకే ఉంటాను

PS మీరు వేసిన నా ఫోటో 21 సంవత్సరాల నాటిది

PPS వరుసగా రెండు రోజులు తెల్లారుఝామున లేచి Orin Constellation, Betelgense, Right, Sirins చూసి ఆనందించాలి ఒక ప్రశ్న కింద పాఠకులను వాటిని చూడమని హెచ్చరించాను కాని ఆ మాట రాసినప్పటి నుండీ ఆకాశం నిండా మబ్బులూ, వానలూనూ అక్కడ కూడా ఇలాగే ఉందేమో తెలీదు

*

30-10-69

నమస్కారాలు “నా షష్టి పూర్తి” అందినదనుకుంటాను దీపావళి సంచిక అందింది రామారావుగారి కథ చాలా బాగుందనుకోండి నవల నుంచి Extracts లాగుంది హోటలు సీను వాళ్ళు ఏమయ్యారు ? ఎన్ ఎస్ ప్రకాశరావు బాగానే రాస్తాడు అతని “మనిషి - మహిషి” కూడా బాగున్నట్టు జ్ఞాపకం అడపా దడపా నన్ను ప్రశ్నలు వేసి సమాధానాలు తెప్పించుకుంటూంటాడు ఆస్థగల మనిషి

నా నవల ఎక్కడో పడి ఉంది దాన్ని ఆ రూపంలో అచ్చుకివ్వను ఎప్పుడో నేనే తీరిక చూసుకుని తిరగరాస్తాను

ABK కు జ్యోతిలో chance వస్తుందా ? ఇస్తున్నారా ? ఇస్తే చాలా బాగుంటుంది

‘ఇల్లాలి ముచ్చట్లు’ ఇంగ్లీషులో పుస్తకంగా వేస్తారా ? puns కొన్ని పోతాయేమో ! వాటిని translate చేసేకన్నా ఇంగ్లీషులోనే ఆలోచించి మళ్ళీ రాయటం మంచిది దాన్ని ఏ Hindustan Times Weekly లోనైనా ముందుగా అచ్చువేస్తే పుస్తకానికి అచ్చు ఖర్చులు గిట్టుబాటవుతాయి ప్రయత్నించి చూడండి

అక్కడా అక్కడా వచ్చిన నా మీది వ్యాసాలు నన్ను బాగా depress చేశాయి ఈ గొడవ అయిపోయాక గాని కోలుకోను ఉంటాను

*

14-11-69

నమస్కారాలు ABK మీ కాంపౌండులో ప్రవేశించినట్లు తెలిసి చాలా సంతోషించాను ఆయనగారికి నా కాంప్లిమెంట్స్ అందజేయండి

"నా షష్టిపూర్తి" చదివిన వారు ఇద్దరు నాకు ఉత్తరాలు రాశారు (అందులో ఒకరిని చూసి 40 ఏళ్ళు అయింది విజయనగరంలో నాతో B A చదివారు, hostel mate కూడా 29 ఏప్రిల్ తరువాత ఒకరినొకరు చూసుకోలేదు నేను చందమామలో పనిచేస్తున్నట్టు కూడా ఆయనకు తెలీదు మా ఆఫీసుకు ఉత్తరం రాస్తే నాకు redirect అయి వచ్చింది ) నిన్న రాసిన రెండో వ్యక్తి ఎవరో నాకు అసలే తెలీదు ఈ ఇద్దరి చేత ఉత్తరాలు రాయించిన అంశం ఏమిటో తెలియటం లేదు

ఇంతకూ చెప్పొచ్చిందీ అది కాదు నాకు ఆ కాపీ చేరలేదు (14) తరవాతది కూడా వచ్చే వేళ అయింది కాపీలు అన్నీ hot cakes లాగా (నా వ్యాసం ఉందని కాదు) అమ్ముడైపోకుండా ఉంటే నాకు ఒక కాపీ పంపించ ప్రార్థన

మీ పేర మీ సర్క్యులేషన్ వారికి వ్రాసిన రెండో ఉత్తరంలో కూడా ఒక చిన్న దూడ వేశాను EA 124/2, DDA Flats, Tagore Nagar, New Delhi-27 అని వుండాలి EA అనేది రాయలేదు అది రాయకపోతే కాపీ సరిగా చేరదు

రాయటం మానేసినందుకు చాలామంది నన్ను మందలిస్తున్నారు ఏమిటి చెయ్యటం?

రామమోహనరావుగారికి ఒక చిన్న సూచన ఆల్ఫాసెటారీ, గామాలిబ్రి అనకూడదను కుంటాను Cignus, Cigni, Libra, Libri, సెంటారై, లిబ్రై, సిగ్ని అనాలి రేడియస్, లోకస్ - రేడియై, లోకై లాగా ఆయన ఉదహరించే నక్షత్రాలకు తెలుగు పేర్లు దొరకవచ్చు కొంచెం శ్రద్ధ తీసుకుని కనుక్కొని రాస్తే బాగుంటుంది కద ఉదాహరణకు plenites అంటే కృత్తికలు, spries చిత్త 27 నక్షత్రాలకూ ఇంగ్లీషు పేర్లు సంపాదించి రాసిపెట్టుకున్నా చాలు మిగిలిన వాటికి తెలుగు పేర్లు దొరకవు

ఇంకో interesting thing ఇది నా ఊహ మాత్రమే కృత్తికలను మనవాళ్ళు సప్తమాతృకలు అన్నారు ఈజిప్షన్లు కూడా 7 నక్షత్రాలను చూశారు ఇప్పుడు ఆరే కనిపిస్తున్నాయి ఏడోది ఏమయింది ? ఎప్పుడు పోయింది ? Investigate చెయ్యదగిన విషయం అందరినీ అడిగానని చెప్పండి ఉంటాను

PS 21 సంచిక ఇప్పుడే బల్లమీదికి వచ్చింది 14 ఇక రానట్టే దయచేసి పంపండి

*

30-12-69

నమస్కారాలు డాక్టరు వద్దన్నా మళ్ళీ ఆఫీసుకు వెళుతున్నాను Brain Work ఆటే చెయ్యటం లేదు (అంటే చందమామలో ప్రచురణకు వచ్చే కథలు చదవటం, కోడి రామ్మూర్తి గుండెల మీద ఏనుగు నెక్కించుకున్నంత పని అది )

రావిశాస్త్రిగారి కథల్లో నేను అదివరకు చదవనివి ఒకటీ అరా లేకపోలేదు పుస్తకం ఇంకా కంప్లీట్ చెయ్యలేదు ఇంటి దగ్గర ఏమీ చదవటం లేదనే చెప్పాలి మా అమ్మాయీ, అల్లుడూ, అబ్బాయీ అంతా ఉన్నారు Full House

లోకాయతా, భారతీయ నాస్తికవాదం మీద వ్యాసాలు వేసేముందు Morgan రాసిన 'Ancient Society' లోని అంశాలు సంగ్రహంగా నాలుగైదు వ్యాసాలలో ప్రచురించినట్టయితే, ఆ తరువాత లోకాయత విషయాలు కాస్త బాగా అర్థమవుతాయి Ancient Society నుండి అనువాదాలుగానీ, వ్యాసాలు గానీ విశాలాంధ్ర వాళ్ళు ప్రచురించారేమో విచారించండి ఈ పుస్తకం నా దగ్గర ఉన్నది ఓపిక చేసుకుని 4, 5 వ్యాసాలుగా అందులోని gist రాసి పంపిస్తాను

నాకు డబ్బేదైనా పంపేది ఉంటే వీలైనంత త్వరలో పంపమని మీ వాళ్ళకు చెబుతారా దయచేసి

మీకూ, రామమోహనరావుగారికీ, నార్లగారికీ, ఇతర మిత్రులందరికీ ఇవే నా నూతన సంవత్సర శుభాకాంక్షలు

ఉంటాను

❋

3-1-70

నమస్కారాలు మీ ఉత్తరమూ, శాస్త్రిగారి ఉత్తరం copy అందాయి "ఇల్లాలి ముచ్చట్లు" literature కింద ఆయన accept చెయ్యటం usual గా జరిగేదే నేను జర్నలిస్టుగా రాసిన కథలు కొన్ని సాహిత్యం కింద accept కావటం జరిగింది ఆరుద్ర నా best stories లో ఒకటిగా mention చేసినది pure journalistic effort So good luck to 'ఇల్లాలి ముచ్చట్లు'

రేపు 4న గురునానక్ సెమినార్ ఉన్నది నన్ను రమ్మని ఢిల్లీవాళ్ళు ఆహ్వానం పంపారు నేను రానని, నాకు గురునానక్‌తో పరిచయం లేదని ఢిల్లీకి రాశాను పోనీ అయితే మానెయ్యి అంటూ ఢిల్లీ నుంచి రాశారు ఇంతకూ సెమినార్ మద్రాసులో నార్లగారు బహుశా దానికి వస్తారు నేను ఆయనను కలుసుకుంటే చెబుతాను

బీనాదేవి సీరియల్ వీక్లీలో వెయ్యరా ? తరువాత, పుస్తకం బాగా అమ్మే chance ఉంటుంది

Accidental discoveries నాకు తెలిసినవి రెండు మూడు పైన లేవు X-Rays, Penicillin, Vitamin D Cycle అనేది ఒకటి ఉంది గానీ, దాని follow up గురించి ఎక్కడా లేదు అది strict గా accidental కాదు Unfathomed discovery Source ఏదన్నా ఉంటే కనీసం 10 అయినా దొరికితే ఒక series కింద రాయొచ్చు

"కన్యాశుల్కం" నోట్స్ నా అంతట నేను ఎవరికీ offer చెయ్యలేదు నవోదయ రామమోహన్రావు ఏదన్నా పుస్తకం కావాలంటే ఇదే ఉందని చెప్పాను అతను కావాలని

అనలేదు  ఇంతలో వరవరరావు తాను వేస్తానన్నాడు  వేసుకోమందామనుకుంటుండగా రామ్మోహన్రావు తానే వేస్తానని రాశాడు  అదీ జరిగింది

శ్రీశ్రీ పుట్టకపోతే ఈనాటి కవిత్వం ఎట్లా ఉండేదో నాకు చచ్చినా తెలీదు  సంగీతం విషయంలోలాగే కవిత్వం విషయంలో కూడా నాకు Very best అనిపించింది తప్ప తలకు పట్టదు  I am almost the worst authority on poetry  అందుచేత అది నా వల్ల అయ్యే పని కాదు

నా ఆరోగ్యం బాగవటానికి ఇంకా కొంతకాలం పడుతుంది  ఏవో విటమినులూ అవి మింగుతూనే ఉన్నాను  B P ఒకటీ, Urine ఒకటి periodic గా test చేయించుకుంటూ ఉండాలి  మొత్తం మీద ఆఫీసు బండి ఏదో విధంగా నడుస్తున్నది  ఉంటాను

PS ఈ ఉత్తరం ఇవాళ పోస్టులో పోదు  సోమవారమే

❋

2-3-70

నమస్కారాలు  మీ ఉత్తరం అందింది  తెలుగువాళ్ళ tribal habits గురించి రాయాలంటే ఒక ప్రత్యేకమైన దృక్పథం గల పాత్రను తీసుకోవలసి ఉంటుంది  అటువంటి పాత్ర ఒకటి నా తలలో చాలా కాలంగా మెదులుతూ ఉన్నది  కాని set up ఇంకా నిర్ణయం కాలేదు  అయితే కాస్త దీర్ఘంగానే రాయాలని ఉంది

'అనుభవం' మొదటి నుంచి చివర దాకా hasty గానూ, curse చేసుకుంటూనూ రాసిందే  ఢిల్లీలో కొందరు మిత్రులు దాన్ని గురించి ఘనంగా మాట్లాడితే అది ఎట్లా రాశానో చెప్పేశాను  అప్పటికీ వాళ్ళ అభిప్రాయం మారకపోతే వాళ్ళ ఖర్మ ! మీరు గౌరీ, గణపతులను గురించి మొదలుపెట్టండి  Morgan రాసిన పుస్తకం Ancient Society  అందులో చాలా repetition ఉన్నది  దాన్నంతా condense చేసి మన పురాణాల నుంచి parallels జోడించి 4 లేదా 5 వ్యాసాలు చేద్దామనుకుంటున్నాను  నాకు తీరిక బొత్తిగా లేకుండా ఉన్నది

మీమీద కొన్ని restrictions ఉన్నట్టు విన్నాను  అయినా ఒక విధంగా మీరిప్పుడున్న చోట ఉన్న freedom కూడా ఇంకో చోట దొరక్కపోవచ్చు

బీనాదేవిగారి నవల ఒక instalment వచ్చింది  అది చదివాను  ఇంకా ఎటూ రిజిష్టరు కాలేదు  నవీన్ రాసిన 'ఫక్‌మిక్స్‌క్' లాగుంది  ఈ 'హాంగ్‌మిక్స్‌క్' ఇంగ్లీషు టైటిల్ అవసరమా నవలక్కూడ ?

NBT వాళ్ళకు సైరంధ్రి దేనికి ? దుష్టగ్రహం వంటిదైతే బాగుంటుందేమో ? అది చాలామందికి నచ్చినట్టు కనబడుతుంది  కానీ మా ముగ్గురిలో ఎవరిదీ ఒక్క లైను కూడా ఉండరాదనుకున్నాం  అందుచేత నా కథ ఏదీ చేర్చకండి  కుర్రకారువి 75% ఉండేటట్టు చూడండి

మిమ్మల్ని 14 ఏళ్ళ పిల్ల ఎట్లా భయపెడుతున్నది ?

ఉంటాను

❋

5-12-70

నమస్కారాలు  మీరు తయారు చేసిన సంకలనం గురించి నార్లగారిని, కేస్కర్‌గారికి రాయమనండి  తెలుగులో లోగడ లేదు గనక తెలుగులో కూడా వెయ్యవచ్చునని

"ఇల్లాలి ముచ్చట్లు" పురాణం సీత పేరనే పోవాలని నా నమ్మకం  కావాలంటే కొటేషన్ మార్కులు పెట్టుకోవచ్చు  ఇల్లాలి ముచ్చట్లు హిందీలోకి అనువాదం చేయించి ఏ వారపత్రికలోనన్నా వేయించి, తరువాత పుస్తకంగా వేస్తే గిట్టుబాటుగా ఉంటుందేమో ! హిందీ అనువాదం బాగుండాలంటే రమేష్ చౌదరిగాని, దయామతిగాని చేయాలి  పుస్తకం మీద కొంత గిట్టుబాటు కాలేదా ?

"వేదాల్లో ఏముంది ?" జనవరి దాకా రాయటం పడదు  అప్పుడు వేద్దురు గాని

ఎ బి కె  ఇంటి అడ్రసు కావాలి  ఆయన్ని అడిగానని చెప్పి ఇంటి అడ్రసూ రాయమనండి  ఉంటాను

PS మీ ఉత్తరం దగ్గర లేకుండా జవాబు రాస్తున్నాను  నేను మీకు కలలోకి రావటానికి కారణం నేను జాస్తిగా ఆమధ్య మీ గురించి ఆలోచించటం కావచ్చు  రెండు మూడేళ్ళ క్రితం పి పుల్లయ్య నాకు రోజూకు నాలుగుసార్లు జ్ఞాపకం రాసాగాడు  తరువాత కలసినప్పుడు రోజూ నేను జ్ఞాపకం వచ్చానని తనంతట తానే చెప్పాడు  Telepathy కావచ్చు  నాకు telepathy అనుభవాలు కొల్లలు

❋

24-9-71

నమస్కారాలు  మీ ఉత్తరం అందింది  వెంటనే ఒక ట్రుమి రాశాను  దీనిలో పంపిస్తున్నాను  'నరావతారం' close గా చదవలేదు  ఒకటి రెండు issues miss కూడా అయ్యాయి  Complementary copy కనుక నేను మీకు రాయలేదు  'వేతన శర్మ' కథ' issue miss అయిన వాటిలో ఒకటి

విరసం కథలు పుస్తకం చూశారా ?  చాలా భాగం మంచి కథలే వచ్చాయనుకున్నాను

ABK ది త్వరగా మొదలు పెట్టండి

ఉంటాను

❋

1-11-71

నమస్కారాలు  జ్యోతి దీపావళి సంచికలో మీ 'ఉప్పు బస్తాలు' చదివాను  New wave picture కి బ్రహ్మాండమైన subject  దానికి ఒకటే లోటు - climax  అది చిట్టచివరగాని, దానికి కొంచెం ముందుగాని వస్తే బొమ్మ తీసేందుకు మీ మిత్రుడు కృష్ణంరాజు ఉన్నాడు  మీరిచ్చిన short story ending resolution కింద సరిపోతుంది  దానికి పూర్వం ఒక చిన్న dramatic crisis సృష్టించడం సాధ్యమవుతుందా ?  నేనీలోపల వీలుంటే

కృష్ణంరాజుతో మాట్లాడతాను కథ చదువుతున్నంతసేపూ నా కళ్ళముందు సినిమా ఆడుతూనే ఉన్నది Types చాలా బాగున్నాయి (మనుషులు దొరకటం కాస్త కష్టమే మరీ low types వెయ్యటానికి highly cultured అమ్మాయిలు కావాలి )

దీన్ని గురించి ఆలోచించండి "సంస్కార్" తీసిన పరాభి ఇంకో పిక్చరు తియ్యటానికి ready గానే ఉన్నట్టున్నాడు ఉంటాను

*

11-12-72

నమస్కారాలు మీ 22 ఉత్తరం అందేదాకా ఎటువంటి కథ రాయాలో తెలీక దిబ్బ కథ ఒకటి ఆలోచించి పెట్టాను తీరా ఉత్తరం చూసుకున్నాక మరొక కథ ప్రారంభించి అది కొండవీటి చాంతాడులా పెరిగిపోకుండా దిగ్బంధం చేసి మీ పేరనే పంపాను అది ఈ పాటికి జయశ్రీకి చేరి ఉంటుందనుకుంటాను

మీరు 6న మళ్ళీ రాసిన ఉత్తరం చూసుకున్న మీదట N R గారి 'నరావతారం' మీద review రాసి ఈ రోజే మీ పేర పంపించాను

మీ సరి అయిన ఎడ్రస్ తెలుపుతూ కథా, రివ్యూ అందిన సమాచారం తెలపండి అంతకన్నా అర్జెంటుగా ఈ ఉత్తరం మీకు అందకపోతే వెంటనే నాకు సమాచారం తెలియచేయండి ఉంటాను

PS మీ ఆరోగ్యం విషయం ఏమిటి ? మానసికమా ? శారీరకమా ? ఎంత ? మీ పరిస్థితులు అక్కడ ఎలా ఉన్నాయి ? ఎందుచేత ?

PPS మీ latest 'ఇల్లాలి ముచ్చట్లు"లో ఇల్లాలూ, ముచ్చట్లూ లేకపోయినా ఎక్కడో ఎముకలు విరిగిన చప్పుడు వినిపించింది వెధవ ఎముకల్ని విరిచిపారెయ్యండి

*

24-2-73

నమస్కారాలు మీ 25-1-73 ఉత్తరం ఇప్పుడే అందింది మీ 26 వారపత్రిక తరువాతది అందలేదు మిగిలినవి క్రమంగా రావచ్చు ఇప్పుడు బెజవాడ కుమ్ము చల్లారినట్టు పత్రికల్లో చూస్తున్నాం

మీకు అక్కడ ఉక్కిరి బిక్కిరిగా ఉండటం అర్థం చేసుకోగలను న్యాయంగా చందమామలో మీ వంటి మనిషికి తప్పక మంచి అవకాశం ఉంది Private and personal freedom చాలా ఉంటుంది పనిలో కూడా interference ఉండదు కాని ఇక్కడ కూడా కొన్ని చిక్కులు ఉన్నాయి ఒకటి చందమామ గొడ్లపాక పై నుంచి చూసినవాళ్ళు చందమామ ఆఫీసంటే కనీసం ఆరంతస్తుల భవనం అనుకోవచ్చు అది ఒక గది అందులో అయిదుగురు పర్మనెంట్ staff + 2 ఆర్టిస్టులు మిగిలిన వారంతా మాసికాలు పుచ్చుకున్నవారే

ఆఫీసుకు రారు రెండు రాసిన ప్రతి అక్షరమూ చక్రపాణిగారు O K చెయ్యాలి ఆయన reject చేసిన కథలు దాచి ఉంచినట్టయితే ఒక్క సంవత్సరం పాటు చందమామకు సరిపొయ్యేవి మూడు చూస్తూ చూస్తూ మావాళ్ళు చందమామ staff పెంచరు నేను రేపు విరమించుకున్నా నా స్థానంలో కొత్తవాణ్ణి వెయ్యటం అనుమానం మీకిప్పుడు వచ్చే జీతంగాని, దానికి దరిదాపుల్లో గాని రావటం దాదాపు అసంభవం అందుచేత మీరు కొంతకాలం భరించండి ఏదన్నా అవకాశం ఉంటే నేనే మీకు తెలియజేస్తాను

ఇన్నాళ్ళూ ఆంధ్రలో నడిచిన movement అట్టడుగున ఉన్న రాజకీయాలు తెలియ రావటం లేదు పైపైన కనిపించే forces తెలుస్తున్నాయి Grass roots లో అసలు రాజకీయాలు లేవేమోనని నా అనుమానం

ఇక్కడ అంతా క్షేమం మీ క్షేమం తెలియజేయండి అందరినీ అడిగానని చెప్పండి

ఉంటాను

*

29-9-73

నమస్కారాలు మీరు కులాసాగా ఉన్నారా ? మళ్ళీ 'ఇల్లాలి ముచ్చట్లు' వస్తున్నాయి ప్లాస్టిక్ సామాను గురించి ఒక సంగతి మీకు గుర్తు చెయ్యాలి అవి ప్రాణం ఉన్నవి మన చెయ్యి తగలకముందే ఎగిరి మన మొహానో, దూరంగానో పడతాయి ప్లాస్టిక్ సరుకుతో నేను నానా యాతన పడుతున్నాను నా కష్టాలు సీతకు మాత్రం ఉండవా ఆలోచించండి

నేను "బ్రాహ్మణులు" అన్న ఒక పెద్ద వ్యాసం అంటే నా ప్రాణానికి కాస్త పెద్దది రాస్తున్నాను అందులో నేను అక్కడక్కడా చదివిన చరిత్రాంశాలు ఒక క్రమం పాటించకుండా రాస్తున్నాను తెలిసిన వాళ్ళకు అందులో కొత్త విషయాలుండవు కాని మామూలు పాఠకులకు చాలా ఉండవచ్చు పూర్తి అయితే మీకు పంపనా ? అవసరమైతే రెండు మూడు issues లో వేసుకుంటారా ?

నేను అక్టోబర్ 6 GTలో ఢిల్లీ పోతున్నాను అక్కడ ఓ నెల రోజాలుందామను కుంటున్నాను బహుశా నా రచన ఈ లోపుగా అయిపోతుంది అయిపోకపోతే ఢిల్లీ నుంచి అయినా పంపగలను - మీరు కావాలంటే

శ్రీ జి రాధాకృష్ణమూర్తిగారు మీ దగ్గర 'తిరస్కృతి' తీసుకున్నారా ? నాకు 'గోవులొస్తున్నాయి' పంపుతానని మరచిపోయారు ఉంటాను రామ్మోహన్రావు గారిని అడిగానని చెప్పండి

*

18-11-74

నమస్కారాలు మీ 13 ఉత్తరం ఇంతకు ముందే అందింది 'అనామిక' ఏ ధోరణిలో నడుస్తుందో తెలపలేదు కథలు ఉంటాయనుకుంటాను నన్ను వ్యాసం రాయమన్నారు

గనక వ్యాసాలు కూడా ఉంటాయనుకోవచ్చు పత్రిక రాజకీయమా ? సాంస్కృతికమా ? సాహితీపరమా ? దాని ధోరణి తెలిస్తే ఏదన్నా రాసి తప్పక పంపుతాను

మీరీ మధ్య మద్రాసుకేసి రాలేదా ? కులాసాగా ఉన్నారా ? ఈనాడులో 'భట్టు' మీరేమో అనుకున్నాను గాని శైలి అనుమానంగా కనిపించింది ఉంటాను

❋

22-2-75

నమస్కారాలు 'ఇంటి చాకిరి' పడ్డ సంచిక అందింది కాని తరవాతది రాలేదు వార పత్రిక కాంప్లిమెంటరీ లిస్టులో నా పేరు కొట్టేసినట్టున్నారు దినపత్రిక వస్తూనే ఉన్నది నేను అప్పుడప్పుడూ వారపత్రికకు రాసేదానికి adjust చేసి వారపత్రిక వచ్చేటట్టు చేయండి అది నాకు కొంత inspiration గా ఉంటుంది ఇంకా ఆడవాళ్ళ మీద వ్యాసాలు రాయమని కాకినాడ నుంచి అడవికొలను పార్వతిగారు (మార్క్సిస్టు) రాశారు ఇతరులు రాసేవి చూడటం ముఖ్యం ఆడవాళ్ళు అధోగతిలోకి రావటం గురించి కూడా ఒక వ్యాసం రాయాలను కుంటున్నాను చెయ్యి వీలు చూసుకుని రాస్తాను

నా పుస్తకాలు వెయ్యమని ప్రకాశరావుగారికి మీరు చెప్పారు నేను ఏ రెండేళ్ళ కిందటో రిటైరవుతాననీ, అప్పుడు అందుబాటులో ఉన్న నా నవలలూ, పెద్ద కథలూ, చిన్న కథలూ మొత్తంగా సంపుటాలుగా ఒక్కోటి 600 పేజీలకు తక్కువ కాకుండా వేద్దామనీ కలలు కన్నాను కనీసం నవలలూ, పెద్ద కథలూ ఇప్పుడు వస్తే చిన్న కథల సంగతి తరవాత చూసుకోవచ్చు అవి కూడా పెద్ద బౌండ్‌లు వేస్తే తప్పకుండా అమ్ముతాయి చిన్న పుస్తకాలకు లేని గౌరవం వాటికి ఉంటుంది ప్రకాశరావుగారు 300 పేజీలకు పరిమితం కాకుండా రెట్టింపు సైజు పెట్టి 15/- ధర పెట్టి ఉండవలసింది

'అనామిక' వాళ్ళు డబ్బులు పంపకపోతే పంపకపోయారు పత్రికనైనా పంపరాదా ? ఆవిడగారు మీ మాట వినే మూడ్‌లో వుంటే చెప్పి చూడండి వేదవతిగారి రెండో కథ అచ్చయిందేమో ?

రామ్మోహన్రావుగారి అమ్మాయి పెళ్ళిట అడ్వాన్సుగా నా felicitations అందజెయ్యండి ఉంటాను

❋

13-11-78

నమస్కారాలు మీ ఉత్తరం అందింది చలంగారి గురించి మీకు కావలసిన వివరాలు ఒక ఆదివారం ఇక్కడికి వస్తే దొరుకుతాయి ఇక్కడ చలంగారి కూతురూ, అల్లుడూ (వజీర్ రహమన్) ఉన్నారు చలంగారి తమ్ముడు (మా మామగారు) అట్లా గాకుండా specific గా కొన్ని వివరాలు కావాలంటే నేను సంపాదించి పంపగలను

మీరు అడిగిన కొన్ని వివరాలు

1) ఆయన 'జనన' తండ్రి కొమ్మూరి సాంబశివరావు పెంపుడు తండ్రి ఆయన మాతామహుడు గుడిపాటి వెంకట్రామయ్య (దివాన్ బహదర్) ఈ వెంకట్రామయ్యగారికి ఒక్కతే కూతురు కొడుకులు లేరు కాని ఆ కూతురు చాలామంది కొడుకులనూ (5గురు), కూతుళ్ళనూ (4గురు) కన్నది వారిలో పెద్దవాణ్ణి (చలంగారిని) ఆయన పెంచుకున్నాడు

2) ఈ గుడిపాటి వారిది తెనాలి వారికి అక్కడ పెద్ద ఇల్లూ తోటా వగైరా ఉండేవి

3) చలంగారి జన్మస్థలం తోట్లవల్లూరైతే ఆ సంగతి మాకెవరికీ తెలీదు తెనాలి అనే అనుకుంటున్నాం

4) ఆయన ఆత్మకధ (నేను చూడలేదు నా భార్య చూసి అసహ్యించుకున్నది ) అందులో పొడి అక్షరాలు ఇతరులకు తెలియరాదనే !

ఇతర వివరాలు

ఆయన టీచరుగానూ, స్కూళ్ళ ఇనస్పెక్టరుగానూ పని చేశాడు ఆయన life లో పెద్ద influence, ఆయనకు అంకుశం లాంటి మనిషి, ఆయన వదినగారు డా॥ రంగనాయకమ్మగారు రచయితలలో ఆయన best friend చింతా దీక్షితులుగారు నాకు తెలిసిన మటుకు ఆయన ఎప్పుడూ social recluse గానే ఉంటేవారు తరువాత transformation లో spiritual recluse అయారు ఇది పైకి కనిపించేటంత పెద్ద transformation కాదనుకుంటాను

మిమ్మల్ని influence చెయ్యటం నా ఉద్దేశం కాదు కాని నా ఉద్దేశం ఆయనలో strongest urge escape social inhibitions నుంచి escape కావటానికి excuses అన్నీ ఆయన రచనలలో చూడవచ్చు ఆ మధ్య రజనితో Radio interview లో కూడా 'ఈ చలం నన్ను వదలకుండా ఉన్నాడు' అని complain చేశాడు This urge for escape can be dignified by calling it an urge for freedom

Personal life details కొన్ని stray గా విన్నప్పుడు interesting గానే ఉన్నాయి రాజమండ్రిలో చలంగారికి ఎవరూ ఇల్లు అద్దెకు ఇయ్యలేదనీ, untouchables locality లో ఉన్నారనీ విన్నాను ఆయన love affairs లో కొన్ని striking గా ఉండవచ్చు ఇలాంటి details రహమాన్ చెప్పగలుగుతాడు మీరు personal గా వచ్చి అడిగితే one thing leads to another మీకు బోలెడంత పిండి దొరుకుతుంది Questions కు answers తెప్పించి అంత ఉపయోగం ఉండదేమో

ఉంటాను

*

1-6-79

నమస్కారాలు మీ 29 ఉత్తరం ఇప్పుడే అందింది మీకు టెలిఫోన్‌లో చెప్పినట్టు రహమాన్ పద్యమూ, నేను చలంమీద వ్యాసమూ పంపాము దినపత్రికకు పంపిన రహమాన్ పద్యం మీరు వేసుకున్నారు మీకు పంపిన నా వ్యాసం దినపత్రికలో వచ్చింది

'ప్రతిభ'లో పద్మరాజుగారు రాసింది బెజవాడలో దొరకదా ? నా దగ్గర వున్నదేమో చూస్తాను

'ధర్మసాధని' సంపుటాలు గురించి నేను వినను కూడా వినలేదు

5 నుంచీ రైళ్ళు తిన్నగా నడుస్తాయట మీరు త్వరలో వస్తారనుకుంటాను ఉంటాను

❋

25-1-80

నమస్కారాలు పొద్దున మీ ఉత్తరం (23) అందగానే రామారావుతో చెప్పాను మీ వాడి శాంపిల్స్ కట్టకోసం ఆయన వెతకడం మొదలుపెట్టాడు ఇవాళ సాయంత్రం లోపల బహుశా మీకు రాస్తాడు రేపు సెలవు ఎల్లుండి ఆఫీసుకి పోగానే సంగతి కనుక్కుంటాను

జ్యోతిచిత్ర బయటికి వచ్చింది ఇంకా చదవలేదు

మీవాడు ఇక్కడికి వచ్చి మా వాళ్ళ గొంతు మీద కూచుంటే పని బాగా జరుగుతుందేమో ! మీరు కూడా వచ్చినప్పుడు మాట్లాడుకుందాం

నండూరినీ, శ్రీ రమణని అడిగానని చెప్పండి మీ వాళ్ళనందరినీ అడిగానని చెప్పండి ఉంటాను

❋

మద్రాసు,

14-4-80

*ఆంధ్రజ్యోతి వీక్లీ ఎడిటర్ గారూ,*

ప్లేజియరిజం ! ఫోర్జరీ ! చేతివాటు !

"పునరపి జననం పునరపి మరణం" స్వర్గీయ విశ్వనాథ సత్యనారాయణగారిది పి ఎస్ గోపాలకృష్ణను కోర్టు కీడవటానికి ఆయన "పునరపి" అయిపోయాడు గదా అని ఎంత సాహసం చేశారు !

❋

19-2-68

శ్రీ సదాశివ గారికి,

నమస్కారాలు మీరు ఎంతో అభిమానంతో రాసిన ఉత్తరం ఇవాళే అందింది చాలా కృతజ్ఞుణ్ణి

ఆ అవార్డు 'తార' కు కాకుండా నేను రాసిన మరే నవలకిచ్చినా నేను ఇంతకన్న సంతోషించి ఉండేవాణ్ణి దాన్ని ఎవరు సిఫార్సు చేశారో, దానికే బహూకృతి ఇవ్వాలని ఎవరు నిర్ణయించారో మీటింగులో అయినా ఎవరూ చెప్పలేదు అవార్డు సంపాదించినందుకు నన్ను అభినందిస్తూ రాసిన వారిలో ఒక్కరు కూడా 'తార' అన్న నా నవల ఒకటి ఉన్నట్టు ఎరగరు ఒక్కరు కూడా దాన్ని చదివిన పాపాన పోలేదు దీన్ని నేను సన్మానం కింద పరిగణించలేకపోయాను

బాగా రాసేవాళ్ళు లేరంటే నేను ఒప్పుకోను రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి రచనలంటే నాకు చాలా అభిమానం కొన్ని బీనాదేవిగారి కథలు కూడా చాలా బాగున్నాయి కాళీపట్నం రామారావుగారు రెండేళ్ళ క్రితం కాబోలు "యజ్ఞం" (అని జ్ఞాపకం) పెద్ద కథ రాశారు అది గొప్ప classic అనిపించుకోగలదు

కాని ఎక్కువమందికి, మీరన్నట్టు, భాష లేదు, భావం లేదు, శిల్పం అంతకన్న లేదు ఆంధ్రప్రభ వారపత్రికలో ఇటువంటి రచయితల రచనలు రివ్యూ చేయటానికి చదువుతుంటే నిరాశ ముంచుకొస్తున్నది ఉంటాను

❋

1-4-68

నమస్కారాలు మీ 26 లేఖ ఇప్పుడే అందింది 'తార' మంచి నవలే నన్న అభిప్రాయం మరొకరు కూడా ఇంతకు పూర్వం వెలిబుచ్చారు నిజానికి నేను దాన్ని తిరిగి చూడనేలేదు నా రచనలేవీ నేను తిరిగి చదువుకోను చాలాకాలం క్రితం రాశానన్నది కూడా నన్నంతగా బాధించదు కాని నేను దాన్ని ఏ ఆశయంతోనూ రాసినట్టు జ్ఞాపకం లేదు అంతకన్న దీక్షగానూ, ప్రయోజనాత్మకంగానూ రాసిన నవలలు నావి చాలా ఉన్నాయి ఒకవేళ నేను పొరబడ్డాననుకోవటానికైనా 'తార'ను మొదట పుస్తకరూపంలో తెచ్చిన ఏలూరు పబ్లిషర్లు దాన్ని ప్రకటించటానికి కొద్ది అభ్యంతరం కనబరచినప్పుడు, అది మంచి రచన అని నేను అనుకోవటం లేదనీ, తిప్పి పంపెయ్యమనీ రాశాను తర్వాత వారే అభిప్రాయం మార్చుకుని దాన్ని అచ్చువేశారు వారు అచ్చువేసిన కాపీలు ఏమయాయో తెలీదు అది బాగుందని కాని, బాగాలేదని కానీ ఒక్కరు కూడా నాతో అనలేదు పైపెచ్చు, దానికి బహుమతి వస్తున్నదని తెలియగానే నాకు ఉత్తరాలు రాసినవారిలో ఒక్కరు కూడా దాన్ని చదివినట్టు రాయకపోగా, దాన్ని ఎప్పుడు రాశాననీ, ఎవరు ప్రచురించారనీ అడిగారు ఉన్నమాట చెప్పాలంటే తార "సోదిలోకి రాకుండా" పోయిన రచన

తారను ఉర్దూలోకి అనువదించేటట్టయితే ప్రచురణ కూడా చేయించండి  మీ శ్రమ ఎందుకు వృథా పోవాలి ?

మీ రుబాయీల అనువాదానికి బహుమతి వచ్చినందుకు చాలా సంతోషం  మీరు చెప్పినట్టు కీర్తి విషతుల్యమేగాని, డబ్బు రావటం వల్ల నష్టమేమీ లేదు  అందులోనూ శ్రమఫలితం పనిచేసే వాడికి చాలా ప్రోత్సాహాన్నిస్తుంది  అందుచేత మీకు బహుమానం రావలసినదానికి ముందే వచ్చిందనుకోనవసరం లేదనుకుంటాను  రచయితలు పంపకుండానే పుస్తకాలకు బహుమానాలు వచ్చేటట్టు కనబడుతుంది  'తార'ను ఎవరు పంపారో తెలీదు  నేను పంపలేదు పంపేటందుకు నా దగ్గర కాపీ లేదు కూడా  ఉంటాను

❋

మద్రాసు,
11-7-68

మిత్రులు శ్రీ రారా గారికి

నమస్కారాలు  సంవేదన-6 ఇప్పుడే అందింది గురజాడ మీద మీ వ్యాసం చదివాను బంగోరె పుస్తకాన్ని సృజన కోసం రివ్యూ చేస్తూ ఇంచుమించు మీరన్నదే నేనూ అన్నాను గురజాడకు Ritual సంస్కారం అంటే చాలా రోతగా కనబడుతుంది అందుకే Widow Marriage Reform ఊకదంపుడుంతా గిరీశం చేత చెప్పించాడు  సంఘం ఒప్పని పెళ్ళిళ్ళు విధవా వివాహాలు మాత్రమే గాదు, సానివాళ్ళ పెళ్ళిళ్ళు కూడానూ  అన్ని పెళ్ళిళ్లను గురించీ తన అభిప్రాయాలు మధురవాణి ద్వారా చెప్పించాడు  సానిదైతే ఎలాంటి వాణ్ని చేసుకున్నా ఫరవాలేదని సంస్కార్తల ఉద్దేశమా ? వీరేశలింగం గారు చేయించిన విధవా వివాహాలలో హెచ్చు భాగం ఎలాంటివి ? వీరేశలింగంగారే అయితే  గిరీశం, బుచ్చమ్మల పెళ్ళి ఎగిరి గంతేసి చెయ్యడా ? అదే ఇద్దరికీ తేడా  మీరు దాన్ని చక్కగా బయటపెట్టారు  నాకేం తోస్తుందంటే వీరేశలింగం గారు యావజ్జీవం పోరాడిన ప్రతి సంఘ దురాచారాన్నీ, ఆయన బళ్ళ కొద్దీ రాసిన విషయాలన్నిటినీ Genious అయిన అప్పారావు ఒక్క 'కన్యాశుల్కం'లో నగ్నంగా ప్రదర్శించాడు మిగిలిన వ్యాసాలు తాపీగా చదువుతాను  ఇది  ఆఖరు సంచిక అని మీరు Announce చెయ్యలేదా ?

నిన్న SVETLANA కు ఒక ఉత్తరం రాశాను  వాళ్ళు RUSSIAN  లో ప్రచురించే తెలుగు కథలలో చలం గారి కథ ఉందిట  వాళ్ళు ఏమిస్తారు ? ఎంత ఇస్తారు ? అని చలం గారి అల్లుడు తెగ అడుగుతున్నాడు  ఆ విషయం తెలపడానికి రాశాను  మిమ్మల్ని రష్యాకు తీసుకుపోతున్నందుకు COMPLIMENTS  కూడా తెలిపాను

విశేషాలేమీ లేవు  ఉంటాను

❋

5-3-69

నమస్కారాలు, మీ ఉత్తరం నిన్న అందింది మీరూ, దేశరాజు అప్పారావూ కలిసి రాసిన ఉత్తరం కూడా అందింది దానిద్వారా నన్ను కాస్త Educate చేశారు అంతేకాని నన్నేమీ అడగలేదు జవాబు రాయటానికి ఏమీలేక రాయలేదు కాకపోతే దిగంబరకవులను గురించి కొంచెం over educate అయాను నాకన్నా ఇంకా backward గా ఉండి, దిగంబర కవులది కవిత్వమే కాదంటున్న రాచమల్లు రామచంద్రారెడ్డిగారి వంటివాళ్ళను మీరు educate చెయ్యటం మంచిదనుకుంటాను అదంతా మీ ఇచ్ఛకు వదలుతున్నాను

మీరు కొన్ని ప్రశ్నలు అడిగారు Social or (and) Political Ideologies ను కథల్లో పెడతారని నాకు తెలీదు అవి జీవితంలోనే ఉంటాయనీ, వాటిని తెలుసుకోవటం ద్వారా జీవితం ఇంకా బాగా అర్థమవుతుందనే నేను అనుకుంటున్నాను

నా మటుకు నేను ఏ రెండు నవలలూ ఒక విధంగా రాయలేదు దానికి నియమాలున్నాయనుకోను నియమాల లాంటివి రచించిన నవలలో కనబడాలి

త్యాగం గురించి చలంగారి సిద్ధాంతమే నాదేను ఎంత మహత్తర త్యాగం చేసేవాడు కూడా higher value కోసమే త్యాగం చేస్తాడు అందుచేత వాడికది 'త్యాగం' కాదు ఇంకోడు త్యాగం చేశాడని మనకు అనిపించినప్పుడు వాడి sense of value ని మనం తెలుసుకుంటాం Edward VIII కు సింహాసనం కన్నా Mrs Simpson ఎక్కువనిపించినట్టు తాను "మిగతా వ్యక్తుల కంటె భిన్నంగా" ప్రవర్తిస్తున్నాననుకునే హంతకుడు, లేక acrobat లేక dictator తాను త్యాగం చేస్తున్నా ననుకుంటాడా ? నాకు మీ statement అయోమయంగా వుంది

రచయితల్లో రెండు రకాలు ఉన్నారు - కడుపులోది కక్కేసేవాళ్లూ, నేను ఈ పాఠకులని ఉద్ధరించేటందుకే ఉన్నానంటూ పద్మాసనం వేసుకుని రాసేవాళ్ళూనూ రెండు రకాలలోనూ కీర్తిమంతులు కూడా ఉన్నారు

ఆంధ్రప్రభలో నేను చేసే సమీక్షలు - వాటికి విమర్శలన్నంత పెద్ద పేరు పెట్టను - ఎవరికి ఏ మాత్రం ఉపకరించినా శ్రమ వృధా కానట్టే ఉంటాను

❋

15-3-69

నమస్కారాలు మే 11 ఉత్తరం అందింది దిగంబరకవుల మీది రివ్యూకి ఆక్షేపణ కొద్దిగా తెలుపుతూ రారాగారికి అప్పుడే రాశాను దిగంబర కవులది గొప్ప కవిత్వం అంటున్నారనీ, అది కవిత్వం కాదనీ ఒప్పుకుంటే వాళ్ళ రచనల్లో ఉండే ఇతర గుణాలను గురించి తనకు ఆక్షేపణ లేదని ఆయన రాశారు దిగంబర కవులు తమ రచనలను ఆవిష్కరించే spirit తో ఆయనకు సానుభూతి లేని పక్షంలో అదంతా భేషజంగా కనిపించటం సహజం మీ విమర్శ పంపి చూడండి

ఒకరినొకరు educate చెయ్యటం చాలా సహజం నేను educate కావటానికీ, చెయ్యటానికీ కూడా సంసిద్ధుణ్ణే దిగంబర కవులను గురించి మీ అభిప్రాయాలు అర్థమయ్యాయని నేను రాసినాక కూడా కాఫ్‌మన్‌నూ, ఇంకెవరెవర్నో కోట్ చేస్తూ నన్ను ఊదరగొట్టేస్తే over educate అయిపోయానేమో ననిపించింది అంతేగాని educate అవడానికి నాకు least objection లేదు

ఒక ideology ఉన్నవాడు, జీవితాన్ని తదనుగుణంగా అర్థం చేసుకున్నవాడు, కథల్లో జీవితాన్ని విశ్లేషించడానికి దాన్నే వినియోగించుకుంటాడు రాచకొండవారు జీవితంలో ప్రతిబింబించే ideology ని కొంతవరకు ప్రచారం కూడా చేస్తున్నారు ఆ ప్రచారం లేకపోయినా ఫరవాలేదు మీరు వనఫూల్ రచనలు చదివారా ? ఆయన మనుషులకు ideology లోపించటాన్ని చాలా తమాషాగా చిత్రిస్తాడు

"నాకు నచ్చిన ఇద్దరు" అని ఆయనగారు రాశారు కాని ఆయనకు నచ్చినవారు ఇంకా చాలామంది ఉండాలి ఆ రచనలో లోతు లేదనిపించింది అందులో పెద్ద పరిశీలనా లేదు నవలలు రాయటంలోనైనా నేను సిద్ధహస్తుణ్ణని ఒప్పుకొనటానికి సిద్ధంగాలేను నవలలు ఎంత బాగా రాయవచ్చునో నాకు తెలుసు నవల నిజంగా బాగా రాయాలంటే ఒక ప్రాజెక్టు కట్టినంత పని నేను నా నవలల్లో హెచ్చుభాగం వారం కూడా రాయలేదు వాటిలో పనితనం ఏముంటుంది ? (ఇతివృత్తం సంగతికాదు నేను చెప్పేది)

మళ్ళీ త్యాగం గురించి రాస్తున్నాను కిందటిసారి నేను రాసినది సమగ్రంగా ఉన్నట్టు లేదు త్యాగం చేసేవాడు ఇతరులతో తనను ఎప్పుడూ కొలుచుకోడు వాడి convictions వాడికుంటాయి తన convictions సామాన్యులు ఆదరించేదీ లేనిదీ వాడికి తెలిసివుంటుందని ఒప్పుకోవచ్చు ideal ఉన్నవాడు త్యాగం చేసినా, చెయ్యకపోయినా lower ideals వాణ్ణి తక్కువగానే చూస్తాడు "ఆహా, నేను గనక ఈ త్యాగం చేస్తున్నాను" అనుకునేవాడిది false ideal subconscious గా వాడికా త్యాగం చెయ్యాలని లేదనుకోవాలి స్వార్థపరుడి ప్రవర్తన స్వార్థపరుడికెంత సహజమో, త్యాగం త్యాగికి అంత సహజమని నా నమ్మకం

Sense of freedom, struggle, purpose అనేవి సామూహికంగానే రావాలి వాటిని వ్యక్తిగతంగా సాధించగలవాళ్ళు rare-specimens, born leaders etc ఉంటాను

*

27-3-69

నమస్కారాలు ఈ నెలాఖరున ఒక నెల రోజులు శలవు పెట్టి ఢిల్లీపోబోతున్నాను అందుచేత రెండు నెలల చందమామ పని పూర్తి చెయ్యవలసిన పని కలిగి మీ కథలు చూడడం కొంచెం ఆలస్యమయింది

కథ బాగున్నది కాని మీ కసి సిద్ధాంతం నాకు తృప్తికరంగా లేదు మీ హీరో చేసిన పని instinctiveగా ఎవరన్నా చేయవచ్చు కిందటి యుద్ధమప్పుడు అమెరికన్ టౌన్‌లో

కొందరి మధ్య ఒక hand granade వచ్చిపడితే దగ్గరలో ఉన్నవాడు ఒకడు చప్పున దానిమీద పడుకుని తాను చచ్చాడు - కాని మిగతా వాళ్లను save చేశాడు వాణ్ణి కొందరు సైకో ఎనలైజు చెయ్యటానికి యత్నించారు వాడికి జీవితం మీద అదివరకే రోతపుట్టి ఉండవచ్చుట వాడి భార్య ఇంకెవడితోనన్నా పడుకుని ఉండవచ్చట ! "మానవత్వం ఒకటి ఉందనీ, అది rational channelsతో పని లేకుండానే associate అవుతుందని" వాళ్లకు తట్టలేదు ఇంగ్లీషు కథ ఒకటి చదివాను అందులో ఒక పెద్దమనిషి ఎవరూ ఏ పరిస్థితుల్లోనూ ఆత్మార్పణం చేసుకోరని తన స్నేహితులతో చర్చ సాగిస్తాడు ఇది జరిగిన కొద్ది రోజులకి రైలుకింద పడనున్న ఒక పిల్లను రైలుపట్టాల మధ్యకు దూకి, ఆ పిల్లను ఎత్తి ఇవతలకి గిరవాటేసి మరుక్షణం రైలుకిందపడి మరణిస్తాడు ఆ మనిషికి మానవత్వం అయితే ఉన్నదిగాని అందులో నమ్మకం లేదు

మీ ప్రకాష్ స్థానంలో నేనుంటే, నా ప్రమేయం ఏమీ లేకుండానే అచ్చు అలాగే ప్రవర్తించి ఉండేవాణ్ణి అనుకుంటున్నాను ఎందుకంటే చిన్న చిన్న మోతాదుల్లో అటువంటి పనులు - అసహ్యపడే వాళ్లకు సహాయపడటం - చేశాను కనికాదు, నాలో బుద్ధి మార్చాలన్న ఉద్దేశం కూడా లేదు ఉంటాను -

❋

6-6-69

నమస్కారాలు మీ కవరు నేను ఆఫీసుకు రాని రోజు వచ్చినట్టుంది నా tray లోనే ఉండిపోయింది

నవలకు సైజు లెక్కలేమిటి ? నోరి నరసింహశాస్త్రిగారి నవలలూ పెద్దవే అన్నిటికన్న సైజులలో పెద్ద నవల రావూరి భరద్వాజ 'పాకుడురాళ్లు' లతగారు కూడా కొన్ని "'బండలు" రాశారు కౌసల్యాదేవి, సులోచనారాణి (సెక్రటరీ) పెద్ద నవలలు రాశారు సీతాదేవి నవలలూ పెద్దవే విశ్వనాథ, బాపిరాజుగార్లు చేసిన ప్రత్యేక కృషి గురించి నాకు ఏమీ తెలీదు

శ్రీశ్రీకి షష్టిపూర్తి జరపటం సముచితమే గదా ! సన్మానాలు చేయించుకునే సరదా ఆయనకుంటే మనం ఎందుకు వద్దనాలి ? సన్మానాలు భేషజాలని నేను ఒప్పుకుంటాను కొన్ని కొన్ని సన్మానాలు ఎవరి భేషజాలో నిర్ణయించటం కష్టం

కోరికలు లేకుండా ఉండడమనేది utter nonsense కోరికల Natureను Social setup తో సమన్వయించి వాటి మంచిచెడ్డలు నిర్ణయించడమే ethics స్త్రీ, పురుషులు ఒకరినొకరు కోరరాదనటం surprising ఫలానివాడి పెళ్లాం, లేక ఫలానిదాని మొగుడు కావాలని కూర్చుంటే అది సాగవచ్చు సాగక బెడిసికొట్టవచ్చు గంజినీళ్ల కోసం అలమటించటమూ, కాపు సారా కోసం అలమటించటమూ ఒక levelలో ఉండవు గదా !

Struggle కథ వేరు Social ethics stand point నుంచి వాటి కోసం struggle అయేవాళ్లు ఉన్నారు చెడ్డవాటి కోసం అయేవాళ్లు ఉన్నారు Struggleలో కూడా చాలా

రకాలు Revolution కోసం struggle చేసే వాళ్లు existing political ethics ను పాటించరు Social reform చేసేవాళ్లు existing social ethics మీద తిరగబడతారు Struggle తరవాత పర్యవసానం progress అవుతుందా, కాదా తేల్చుకోవాలి

మానవత్వం సరిగా అర్థం చేసుకోవాలంటే conditioned reflexes గురించి తెలుసుకోవాలి పుట్టుకచేత మనిషి అయిన వాడిలో మానవ సంబంధమైన biological tendencies మాత్రమే ఉంటాయి మిగతా skills, mental and moral and spiritual human values పరిసరాల నుంచీ, సమాజం నుంచీ ఏర్పడిన conditioned reflexes మాత్రమే చిన్నతనం నుంచీ తోడేళ్ల మధ్య పెరిగిన వాడికి భాష నేర్పాలని చూస్తే లాభం లేకపోయింది మనం మాట్లాడే భాష దగ్గిర నుంచి conditioned reflex మాత్రమే మనం instinct అనేదాన్ని పావ్‌లోవ్ chain of reflexes అంటాడు

మీ కథ చూస్తాను చూసి నా అభిప్రాయం రాస్తాను మనం రాసేవాటి గురించి ఇంకొకరి అభిప్రాయాల మీద ఆధారపడటం అంతమంచి అలవాటు కాదు వాటి మంచిచెడ్డలు మనమే నిర్ణయించుకోవాలంటాను ఉంటాను

❋

25-6-69

నమస్కారాలు, నేను చిన్న పొరపాటు చేశాను నా దగ్గిర చదవకుండా ఉండిపోయిన కథ మీ కథ కాదు వాల్తేరు నుంచి శ్రీ బి టి రామానుజం పంపిన 'నిప్పు' కథ మీరు నాకు ముందు ఒక కథ పంపారు దాన్ని గురించి నా అభిప్రాయం రాస్తూ మీకు తిప్పి పంపాను అదిగాక నాకు మరొక కథ పంపారా ? పంపితే రాయండి ఎందుకంటే నా దగ్గిర మీ కథ ఉన్నట్టు కనబడటం లేదు

'వేయి పడగలు' నేను సొంతం చదవలేదు బాపిరాజుగారి నవలలు కూడా ఏవీ చదవలేదు అందుచేత అది విజ్ఞాన సర్వస్వాలో కావో చెప్పలేను స్థూలంగా చెప్పాలంటే విశ్వనాధ వారు బోధపరిచే విలువలకు భవిష్యత్తు లేదు ఆయన దృక్పధం నాకు హరికథలు చెప్పే భాగవతార్ల ధోరణిని స్ఫురింపజేస్తుంది బాపిరాజు బొత్తిగా కళాప్రియుడు కాని సహృదయుడు వ్యక్తిగా ఆయనంటే నాకు చాలా ఇష్టం

సన్మానాలు చేయించుకోడం శ్రీశ్రీకి ఇష్టం కాదనగలనా ? నేను దాన్ని సమర్థించను కాని అడిగి సన్మానాలు చేయించుకునే జాబితాలో అతన్ని వెయ్యవద్దనే నేననేది శ్రీశ్రీ అంత గొప్పవాడయాక సన్మానాలు చేయించుకోవటంలో ఆనందం ఉంటుందేమో !

Social ethics భౌతిక పరిస్థితుల నుంచే ఏర్పడతాయి వాటి మంచి చెడ్డలు వర్గ దృక్పధాన్ని బట్టి మారతాయి ఒక వర్గానికి చెడ్డది, మరొక వర్గానికి మంచిదవుతుంది అంచేత అన్ని వర్గాలకూ పనికివచ్చే ethics ఎప్పుడూ ఉండవు జాతిక్షేమంకోరి ఆదిమ సమాజం వారు నాయకులను ఎన్నుకున్నారు ఆ నాయకత్వం క్రమంగా నిరంకుశత్వంగా వర్గ సమాజంలో

మార్పు చెందింది ఈ రాజరికంవల్ల స్పష్టంగా అధిక సంఖ్యాకులకు హాని కలిగినప్పుడు రాజుల అధికారాలను limit చేస్తూ ethics ఏర్పాటు చేశారు కాని అందువల్ల రాజులు పోలేదు, వాళ్లు ఆ ethicsను ఉల్లంఘించటమూ పోలేదు పరిస్థితులు భౌతికంగా రాజరికాన్ని దెబ్బతీశాకనే రాజరికం పోయింది ఇదంతా dialectical' గా వేరు వేరు contradictions ఏర్పడటమూ, resolve కావటమూ బట్టే జరుగుతుంది

జీవితంలో contradictions ను face చెయ్యలేని వాళ్లు struggleకు దూరంగా ఉండి ప్రవాహంలో కొట్టుకుపోతారు

కన్యాశుల్కం మీద నేను notes రాయటానికి అసలు కారణం గట్టి విమర్శకులే దాన్ని సరిగా అర్థం చేసుకోనట్టు కనబడటం నేను కథలూ, నవలలూ రాయకుండా ఉండటానికి అయిదేళ్లుగా విశ్వప్రయత్నం చేస్తున్నాను అయినా నాచేత బలవంతాన రాయించగలవాళ్లు కొందరుండడం చేత రాయక తప్పలేదు ఇటీవల ఏమీ రాయలేదు - చిన్న చిన్న చిల్లర వ్యాసాలు తప్ప ఉంటాను "మందు" కథ మీ దగ్గిరే ఉంటే యువకు పంపి చూడండి

*

19-7-69

నమస్కారాలు మీ ఉత్తరం అందింది చెఖోవ్ కథలు నేను అనువాదం చెయ్యలేదు విశాలాంధ్రవారు రష్యన్ ప్రచురణ పంపించగలరు

మానవత్వం, పశుత్వం, రాక్షసత్వం అన్నని social plane నుంచే ఆలోచిస్తాం దురాక్రమణ చేసిన శత్రువుపట్ల రాక్షసత్వం చూపటం తప్పు కాదు ఔదార్యం చూపటం ఒప్పు కాదు ఒక మనిషిలో ఒక సందర్భంలో మానవత్వం లోపించవచ్చు అసలే మానవత్వం లేనివాడుండడు కాని congenital criminal types ఉంటాయనీ, వారిలో మామూలు xy క్రోమోజోమ్ బదులు xyy ఉంటుందనీ ఇటీవల ఒక theory వచ్చింది ఇది రుజువైతే మానవత్వం బొత్తిగా లేని congenital types కూడా ఉంటాయన్నమాటే

Human Values orbitrary అని ఎవరంటారు ? అవి పరిస్థితులనుబట్టి మారినా, ఎప్పటికప్పుడు validగానే ఉంటాయి ఆ validity గుర్తించని వాడు anti social గా తయారవుతాడు వాడి conscience వక్రిస్తుంది Conscienceను human valuesకి condition చెయ్యటానికి fear of God, fear of Hell etc సృష్టించారు కాని అవి తప్పనిసరికావు Irrational fear లేకుండా సరిగా ప్రవర్తించేవాళ్లున్నారు

Communism అన్నది ఒక movement కాదు ఒక goal జీవితంతో అసంతృప్తి చెందనివాడికి revolutionary ideas ఏమీ బాగుండవు జనాన్ని రివల్యూషనరీగా తయారుచెయ్యాలన్న తొందరలో కమ్యూనిస్టులు చాలా పొరపాట్లు చేస్తున్నారు మన జనానికి sense of historical materialism కూడా లేదు వీళ్లు social revolution తెస్తారా ? వీళ్లకి social reform అంటేనే భయం కట్నాలు తీసుకోవడం చాలా నీచం అన్న నమ్మకం

ఉంటే కూడా "నాకు కట్నం వద్దు" అంటే నలుగురూ "చవట" అనేస్తారని భయపడే వాళ్లు కూడా మన చదువుకున్న యువతలో ఉన్నారు

నేను వయసు పేరు చెప్పి కథలు మానలేదు రాయటం శుద్ధదండగ అని మానేశాను ఇప్పుడున్న సమాజానికి కావలసింది కల్పనా కథలూ, నవలలూ కాదు, రాజకీయ పరిజ్ఞానం యువకులక్షు సాహిత్యం ద్వారా చైతన్యం కలిగే మాట నిజమే నేను 30 ఏళ్లుగా ఈ మద్రాసులో పాతుకుపోయి తెలుగు యువకులను చైతన్యవంతులను చేసే రచనలు చెయ్యటం సాధ్యం కాకుండా ఉన్నది వట్టి ధర్మపన్నాలు చెప్పే రచనలు నేను రాయలేను చదవవలేను వ్యాసాలేవో రాస్తూనే ఉన్నాను కదా

మీ కథ ఒకటి ఆగస్టు యువలో వచ్చింది ఇంకా చదవలేదు చదువుతాను ఉంటాను

❋

6-8-69

మీ ఉత్తరం అందింది Congenital Criminal types అంటూ ఉన్నమాట నిజమే వాళ్ళ దుష్ప్రవర్తనకూ, సమాజ స్వరూపానికీ సంబంధం ఉండదు కాకపోతే వర్గరహిత సమాజంలో వాళ్లను ఉపయోగించుకునే వాళ్లుండరు Congenital tribes మాయమవుతాయనుకోను ముందు ముందు మనిషి genes బతికుండగానే మార్చే పద్ధతులు వస్తాయేమో

ప్రస్తుత పరిస్థితి chaoticగా ఉన్నది సాంఘిక పురోగమనానికి అడ్డుగావున్న శక్తులన్నీ ఒకేసారి విజృంభించి ఉన్నాయి - మతోన్మాదం, ఫ్యూడల్ హక్కులు, సంబంధాలు, tribal customs, capitalist greed మన సమాజం క్రమ పరిణామం పొందినది కాదు పాశ్చాత్య దేశాల్లో ఒక్కొక్క శక్తిని జయించి ఒక్కొక్క శక్తి సమాజంలో తన పలుకుబడిని ప్రతిష్ఠించుకున్నది ఫ్యూడల్ శక్తులు మతశక్తులను అదుపు చేశాయి బూర్జువా శక్తులు ఫ్యూడల్‌శక్తులను అదుపు చేశాయి శ్రామిక శక్తులకూ - బూర్జువా శక్తులకూ straight contradiction ఏర్పడింది మనం డెమోక్రసీ పేరుతో స్థాపించిన institutionsలోనే ఫ్యూడల్ శక్తులు బాహాటంగా పనిచేస్తున్నాయి పంచాయతీ ఎన్నికల్లో గెలిచేవాళ్లెవరు ? ఎంతమంది అధికార్లు ఆఫీసు జవాన్లచేత ఇంటి పనులు చేయించుకోవటం లేదు ? అసలే బీదదేశం అయినా కూడా దేవుడి పేరిట కోట్ల లెక్కన ముడుపులు చెల్లించటమేమిటి ? ఈ Maze of contradiction నుంచి ఒక్కొక్క contradiction resolve చేసుకుంటూ రావాలి కనీసం మతాన్ని సామాజిక శక్తిగా అంతరింపజేస్తేగాని picture clear కాదు Dictatorship నశించాలని కమ్యూనిస్టులు కలలుగనే working class కూడా మతవిశ్వాసాలకూ, ఫ్యూడల్ దౌర్జన్యాలకూ బలి అయిపోతున్నది ప్రస్తుతం ప్రజల్లో ఉన్న చైతన్యం "After me the deluge !" అన్నదే ఎవడికి దక్కినంతవాడు ఒడుచుకుంటున్నాడు - ఇందిరాగాంధీ నుంచి సరికొత్త పెళ్లికొడుకుదాకా నలిగి చచ్చేది నెలకు నూరు రూపాయలన్నా కళ్లచూడలేని కుటుంబాలు వారిలో ఉన్న వర్గ చైతన్యమేమిటో, రాజకీయ పార్టీలవారు వారిలో కలిగిస్తున్న రాజకీయ చైతన్యమేమిటో తెలీదు

కట్నాల సమస్య మీద ఏమి రాసినా ఒకటే తమిళ్ సాహిత్యం చదవలేదు తమిళంలో రాసే శక్తిగల తెలుగువాళ్లు ముగ్గురు నలుగురున్నారు తమిళ సాహిత్య సభ secretary కమల తెలుగు స్త్రీ 'యువ' రాగానే ఎవరో తీసుకుపోయారు తిరిగి వచ్చినాక మీ కథ చదువుతాను

మహాత్మాగాంధీ sexual repressions శ్రీశ్రీ సన్మానానికి రావడానికి ప్రయత్నిస్తాను సన్మానాలను గురించి కాళీపట్నం రామారావుగారు రాశారు

రచయితకు ఒకప్పుడు ప్రతిభే ప్రధానంగా ఉండేది వసుచరిత్ర, మనుచరిత్ర, రాఘవ పాండవీయం లాంటి పుస్తకాలు రాయటానికి sincerity అక్కర్లా అది ఈనాటి రచయితకి అవసరం అవుతున్నది కాని అందరూ పాటించరు

❋

5-9-69

నమస్కారాలు తిలక్‌గారి కవిత్వం నాక్కూడా చాలా బాగుండేది Overall గా అతను పెద్ద progressive కాదని తెలిశాక చాలా disappoint అయినాను శ్రీశ్రీకీ తిలక్‌కూ పోలిక ఉన్నదని నేను అనుకోలేదు దిగంబరకవులు ఇటీవలి గేయాల్లో నాకు చాలా improvement కనిపిస్తున్నది మీరు "వేడి" అన్నది నాకు కొంత పొగలాగా కనిపించింది They are going to grips with essentials of real poetry

భగవద్గీతలో ఉన్నది idealism అయితే అందులో చెప్పిన సాంఖ్యం, యోగం వగైరాలు proto materialism సాంఖ్యంలోకి దేవుణ్ణి దూర్చింది భగవద్గీత వేదయుగం పూర్తికాక పూర్వమే ఆర్యుల జీవితం చాలా మారింది అందుచేత వేదాలు అంతమై బ్రాహ్మణ్యాలూ, ఉపనిషత్తులూ వచ్చాయి

నవాలక్ష controdictions లో primary controdictions ఏవి అన్నది కార్యరంగంలో తప్ప తేలదు Marxism వీటిని చర్చించే పద్ధతులు చెబుతుంది మనలాంటి arm chair revolutionaries వీటిని గురించి ఏదో చెయ్యబోయేవారిలాగా చర్చించటం అనవసరం మనం సాహిత్యంవరకూ మాట్లాడుకోవచ్చు

చలంగారి 'మైదానం'లో నాకు ఏమీ కనిపించదు popular గా ఉండకేం చేస్తుంది? సెక్స్ పత్రికలు popular గా లేవా ? 'మైదానం'లో ఆడది కనీసం వాస్తవిక పాత్ర అయినా కాదు, చలంగారి కామేచ్ఛలోంచి పుట్టుకొచ్చిన ఒక వింత అవతారం Inverted పతివ్రత చలంగారు అంతకన్నా మంచి రచనలు చేశారు

కథలు ఎలా రాస్తే బాగుంటుందో పాఠకులుగా మనమే నిర్ణయించుకోవచ్చు గదా ఒకరికి సూటిగా చెబితే బాగుంటుంది ఇంకొకరికి కప్పిపెట్టి చెబితే బాగుంటుంది మీ "మందు" కథ నాకు అంతగా నచ్చలేదు ఉంటాను

❋

18-9-69

నమస్కారాలు మీ 9 ఉత్తరం అందింది "మందు" కథ పంపాననుకుంటాను ఒకవేళ నా దగ్గిరే ఉన్నదేమో వెతికి చూస్తాను

సరిగా కాలని కట్టెనుంచి పొగవచ్చి ఊదరపెడుతుంది అది వేడికాదు గదా ! వేడి versus వాడికాదు వేడి versus పొగ

ఒకప్పుడు శ్రీశ్రీ కూడా "Pure Poetry" ఉండదా అని సందేహం లేవదీశాడు ఉండరాదని నా వాదం painting లో colourism ఉన్నది, నాట్యంలో నృత్యం ఉన్నది, సంగీతంలో ఆలాపన, తానం వగైరాలున్నాయి ఒక విధంగా ఇవి pure arts నా ఉద్దేశం poetry లో ఇది సాధ్యంకాదని మాటలు లేని poetry ఉండదు భావంలేని నృత్యం, తానం, colour composition ఉన్నట్టు, మాటవెంట చచ్చినట్టు భావం వుంటుంది Pure Poetry అంటే భావ రహితమై శ్రవణానందకరంగా వుండేది, అంతేకాని రాజకీయాలూ, సంఘమూ లేనిదికాదు

భవిష్యత్తుపైన దృష్టిగలది progressive poetry తిలక్ poetry మొత్తం progressive కాదని ఎవరన్నారు ?

బీనాదేవిగారి style ఎవరి అనుకరణ ? ఎవరు ఏం చేసివుంటే ఇంకా బాగా రాసేవారో ఆలోచించే శక్తిసామర్థ్యాలు నాకు లేవు రాసినది బాగున్నదీ, లేనిదీ తేల్చుకోగలను

చాసోతో మీకు జరిగిన experience typical గా వుంది ఆయనతో మాట్లాడి మీరు నేర్చుకున్న పాఠం కూడా విలువైనదే సాహిత్యంలో impulsive judgements పనికిరావు ఏదన్నా critical గా చదివితేనేగాని దాని నిజం తెలీదు

చందమామ Canada కు పంపవచ్చు Surface Mail (ship) పంపడానికి anual subscription Rs 16/- కాపీ చేరటానికి రెండు నెలలు పడుతుంది Air Mail పంపితే 2, 3 రోజుల్లో చేరుతుంది గాని postage మాత్రమే 4 రూపాయలవుతుంది చందమామ time marked కాదు గనుక surface mail లోనే పంపవచ్చు మా circulation manager కి 16/- రూపాయలు పంపుతూ Canada address పంపితే చందమామ వెళుతుంది ఉంటాను

*

9-10-69

నమస్కారాలు వారం రోజుల క్రితమే మీ ఉత్తరం అందింది కాని జవాబు రాయటానికి వెంటనే పడలేదు మీ ఉద్దేశం బీనాదేవిగారి శైలి రాచకొండవారి శైలికి అనుకరణ అని అయినట్టయితే నేను ఒప్పుకోను రెండు styles లోను తేడా ఉన్నది వాళ్ళు కథచెప్పే పద్ధతుల్లో కూడా తేడా ఉన్నది కాని, బీనాదేవిగారి కథలపైన రావిశాస్త్రిగారి ప్రభావం లేకపోలేదు ప్రతి రచయితపైనా ఏదో పూర్వ రచయిత (ల) ప్రభావం వుండి తీరుతుంది 'కార్నర్‌సీట్', 'రిలీవర్' కథలు విడివిడిగా చదివాను 'రిలీవర్' కథ 'కార్నర్‌సీట్' చదివి రాసినది కాని టెక్నికల్‌గా

'రిలీవరు' superior అని నేననుకున్నాను అయినా బీనాదేవి కథలను గురించి మీ అభిప్రాయం మార్చాలనే ఉద్దేశం నాకే కోశానా లేదు వాటిని గురించి ఇన్ని ఉత్తర ప్రత్యుత్తరాలు అనవసరమనుకుంటాను మీరు బీనాదేవి, రావిశాస్త్రిగార్లను compare చేస్తూ మంచి క్రిటికల్ వ్యాసం ఒకటి రాయగూడదా ?

గురజాడకు అనేక విధాల ప్రాతినిధ్యం వహించే పాత్ర గిరీశం మాత్రమే అని నేనన్నాను సో సుందర్‌గారు నేనన్న దానికి అందరితోనూ చెప్పి బాధపడడమే తప్పిస్తే ఆయన స్వయంగా గురజాడ గురించిగాని, గిరీశం గురించి గాని ఏమీ చెప్పదలచుకున్నట్టు లేదు ఇటువంటి private-cum-drawing room విమర్శలు ఎవరికీ ఉపకరించవు సో సుందర్‌గారికి నాపైన prejudice ఉన్నదని నేను అనుకోను

చిన్న కథ టెక్నిక్ గురించి మహామహులే రాయలేమని చేతులెత్తేశారు (The Anthology of English short story - Author పేరు జ్ఞాపకంలేదు)

సీతప్పలో ఉన్న భయం సర్వవ్యాప్తమైనది బతుకు భయం దానికి అచ్చుగా మూఢ విశ్వాసాలే basis కాదు Industrialisations లో సీతప్పలు అడుగంటిపోతారు unemployable, unbearable అయి దిగజారతారు Survival of the fittest అన్నది natural evolution లోనేగాక, social evolution లో కూడా ఉన్నది మధ్యతరగతి నశించదు నిజమే అందులో ఒక section social revolution లో కొంత పాత్ర వహిస్తుంది దాన్ని నిర్మూలించటానికి Chineese type revolution కావాలి Bureaucracy కి China వాళ్ళ Cultural revolution లాటిది మాత్రమే ప్రస్తుతానికి విరుగుడుగా కనిపిస్తున్నది ముందు ముందు ఇతర remedies వస్తాయేమో !

వచన కవులంతా అంతో ఇంతో రాణిస్తూనే వున్నారు గేయకవులే రాణించటం మానేస్తున్నారు "పురుషుడు" అన్నది వేద కాలానికి ముందే ఉన్నది కాని అది ఈనాటి "దేవుడు"కు సమం కాదు Dr Kosambi పుస్తకం ఒకటి ఉన్నదిట నేనింకా చదవలేదు అది భారత చరిత్రను Marxist దృక్పథంతో రాసినదేనట

*

17-11-69

నమస్కారాలు మీ ఉత్తరానికి వెంటనే సమాధానం రాసే తీరిక లేకపోవటంతో దాదాపు పక్షం రోజులు అది కాగితాల కింద పడి ఉండిపోయింది

మానవతావాదం అంటే ఒకరికి కష్టం వస్తే, అది మనకే వచ్చినప్పుడెలా ఉంటుందో జ్ఞాపకం చేసుకుని, చాతనైన సహాయం చేయటం అంతేగాని హంతకుణ్ణి ప్రేమించటం కాదు బాధలు పెడుతున్న వారిని నిగ్రహించలేకపోతే చంపెయ్యటం మంచిదే అయితే దాన్ని మానవతావాదం కింద జమచేర్చం జీవితంలో మానవతావాదం కిందికి రానివి ఎన్నయినా ఉండవచ్చు గద !

స్వేచ్ఛ అంటే recognition of necessity అని ENGLES అన్నాడు అని విన్నాను మన వేదాంతంలో మోక్షమే స్వేచ్ఛ "స్వేచ్ఛకు absolute terms లో అర్థం ఉండటం" అంటే అర్థం కాలేదు Absolute స్వేచ్ఛ ఉన్నదా అంటే లేదు సమాజ శృంఖలాలలో ఎంతో అవసరమైనవి ఉన్నాయని చలంగారికి తెలిసి ఉండకపోవచ్చు ఈ నాడున్న విజ్ఞానమూ, సాంకేతిక జ్ఞానమూ సామాజికజీవితం నుంచే వచ్చాయి Social evolution లేకపోతే ఏ కళలూ, విద్యలూ ఉండేవి కావు Neanderthals లో ఒక శాఖ social evolution కి గురికాక రాక్షసులుగా మారిపోయిందనీ, ఈనాడు Yeti అనే మానవమృగం ఆ బాపతేనని ఒక theory ఉన్నది వ్యవస్థకంతటికీ స్వేచ్ఛ ఉండటమంటే వ్యక్తుల సుఖజీవనానికి తగిన స్వేచ్ఛ ఉండటమే

రచయితలు సాధారణంగా ఉపన్యాసాలు దంచటం మంచిది కాదు దంచదలిస్తే దానికి తగిన సన్నివేశం కథలో కల్పించుకునే నేర్పుండాలి పాత్రలు ఉపన్యాసాలు దంచినా అందుకు తగిన పరిస్థితి ఉండాలి తప్పుడు తోవన పొయ్యే కొడుక్కు తండ్రి బుద్ధులు చెబితే అది శిల్పానికి దెబ్బకాదు తప్పుడు సూచనలు చేసే తండ్రికి కొడుకు కూడా ఉపన్యాసం ఇవ్వొచ్చు జీవితంలో కూడా ఉపన్యాసాలు లేకుండా జరగదు Deep గా ఆలోచించటం జీవితంలోనే నేర్చుకోవాలి అది temparament ను బట్టి కొందరిలో ఉంటుంది, కొందరిలో ఉండదు కొన్ని పరిస్థితులలో కొందరు ఆలోచనాపరులయిపోతారు

రావిశాస్త్రిగారి సుబ్బయ్యకూ, సీతప్పకూ పోలికలేమీ లేవు సుబ్బయ్య introvert Stream of consciousness కు introvert పాత్రలు బాగా పనికి వస్తాయి సుబ్బయ్య కేవలమూ వ్యవస్థ వల్లే తయారైతే అతని లాంటి పాత్రలన్నీ అలాగే ఉండాలి గద ! అల్పజీవిలో మిగిలిన వాళ్ళు ఆ వ్యవస్థలో జీవించే వాళ్ళేగా ? సీతప్పకు మార్పంటే భయం అతను కళ్ళ ఎదుట ఉన్నదాన్ని మరోలా చూసి ఆత్మవంచన చేసుకుంటాడు అనుభవం నుంచి ఏమీ నేర్చుకోలేడు సీతప్ప మీద మీరు రాసిన వ్యాసం ఏమైంది ?

'యువ'లో మీ కథ చదివాను (యువలోనేనా ?) మళ్ళీ చూసి నా అభిప్రాయం రాస్తాను ఉంటాను

*

29-8-70

నమస్కారాలు నేను 20న ఢిల్లీకి బయలుదేరి వెళ్ళి, నిన్ననే ఆఫీసుకు తిరిగి వచ్చాను ఢిల్లీలో సాహిత్య అకాడమీ వాళ్ళు Lenin Symposium ఒకటి పెట్టారు చాలా పేపర్లు చదివారు Interesting గానే ఉన్నది

మీ నలుగురి కథలూ నా దగ్గిర ఉన్నాయి ఇంకా చూడలేదు ఏ మాత్రం బాగున్నా కథల సంపుటిలో వేయాలనే నా ఉద్దేశం ఇది స్తన శల్య పరీక్షలకు సమయం కాదు శిల్పం కాదు, స్పిరిట్ ఇప్పుడు ముఖ్యం

శిల్పం గురించీ, వాగర్థాల ఏకత్వం గురించీ ఉమాశంకర్ జోషీ సెమినార్‌లో చాలా ఊక దంచాడు లంచ్ ఇంటర్వల్‌లో అతనికి 'మాకొద్దీ తెల్ల దొరతనమూ' ఉదాహరణ ఇచ్చి, శిల్పం కూడా గణనకు రాని పరిస్థితులు ఉంటాయని చెప్పాను విప్లవ రచనలకైనా అంతే

విరసం కథలకు మనం కృత్రిమంగా ఒక మార్గం వెయ్యలేం Critical Realism అనేదానికి కట్టుబడక తప్పదు Critical స్థాయి పెరగాలి అది స్పష్టం అరసం ఆమోదించిన విలువలను కూడా తిరగదోడాలి "విప్లవం" సమస్య మరీ గడ్డు సమస్య మధ్య తరగతికి తన వర్గ శత్రువులు ఎవరో తెలీదు కారణం వాళ్ళ జీవితంలో ఉన్న contradictions లో నిజమైన antagonistic contradiction కానరాదు మధ్యతరగతి internal contradictions విప్లవానికి దారి తీయవు నిజమైన antagonism కింది తరగతుల్లోనే చూడాలి విప్లవ కథకులం Lower Depths నుంచే విప్లవ భావాలను తోడుకు రావలసి రావచ్చు

మధ్య తరగతిలో తిరుగుబాటును అరసం కొంతవరకు చిత్రించింది ఆ పని ఇంకా సమర్థంగా కొనసాగించవచ్చు మధ్య తరగతిలో కూడా విప్లవావకాశాలు కనిపిస్తే వాటిని exploit చెయ్యవలసిందే

రామారావుగారు ఉత్తరం రాశారు వారి కథకోసం ఎదురు చూస్తున్నాను

"ఎనార్కిస్టు" ధోరణి అన్నది మనని బాధించనవసరం లేదు సాహిత్య రంగంలో దానికంత అర్థం లేదు చలం రచనల్లో చాలా ఎనార్కిస్టు ధోరణి ఉండేది కాని దాన్ని గురించి ఆక్షేపించిన వాళ్ళెవరూ లేరు దిగంబర కవులది "తీవ్ర"వాదం అన్నాడు మోటూరి రాజకీయాలలో ఆ మాటకు అర్థం ఉన్నట్టుగా సాహిత్యంలో లేదు వీరేశలింగం "తీవ్రవాది" అయితే కొంప మునిగిందా ? Actual revolution లో కూడా anarchists కొంత ఉపయోగకరమైన పాత్ర వహిస్తారట అందుచేత, otherwise జీవితాన్ని correct గా రిప్రజెంట్ చేసినట్టయితే, కథలలో ఎనార్కిజం కోసం వెతకటం అవసరం ఉండదు అని నా అభిప్రాయం

Long March లో ప్రాణం అన్న కథ చదివే ఉంటాను కాని గుర్తు రావటం లేదు మళ్ళా చూస్తాను ఉంటాను

❋

3-9-70

నమస్కారం 'విరసం' కథా సంకలనంలో నేను కథ రాయను Bad example set చెయ్యటం అవుతుంది లోగడ మీరు పంపిన 4 కథలు కాక ఇవాళ ఒకటి వచ్చింది మొత్తం 5 ఇంకెన్ని వస్తాయో, అందులో ఎన్ని ప్రచురణ యోగ్యంగా ఉంటాయో తెలీదు Time కూడా ఇంకెంతో లేదనుకుంటాను

'ఆశోకవనం' 1937లో కాబోలు రాశాను అంతకు పూర్వం 'అశోకం' అని ముద్దుకృష్ణ రాసిన భావకవిత్వపు కథ మీద react అయి రాశాను అందులో రామరావణుల politics పెట్టినట్టు జ్ఞాపకం ఇవాళ అయితే రామాయణం సీరియస్‌గా తీసుకుని రాయను అది utter nonsense భారతంలో కొంత నిజమైన anthropology ఉన్నది

పురాణ కథలను reorientate చేసి జనానికి గల మూఢ భావాలను కొంత వరకు మార్చవచ్చు కాని అది ఊబిలో దిగిపొయ్యేవాణ్ణి సగం పైకి లాగటం అవుతుంది శాస్త్రిగారు రాముణ్ణి మంచితనానికి ప్రతీకగానూ, రావణుణ్ణి దుర్మార్గానికి ప్రతీకగానూ వాడటం నాకు తెలుసు కాని అది radical outlook అవుతుందా ? రామాయణంలో బ్రాహ్మణ క్షత్రియ సంఘర్షణ అనే సిద్ధాంతం ఉన్నది రావణుడు బ్రాహ్మణుడు, రాముడు క్షత్రియుడు ఆ కులాల మధ్య confrontation రావటం ఒక్క పరశురాముడి కథలో తప్ప మనం చూడం రామాయణంలో ఈ confrontation స్పష్టంగా చెప్పబడలేదు కాని ఉన్నదనుకుంటే ఉన్నది అయితే రావణుడు రాక్షసుడు ! దాంతో picture చెదిరిపోయింది

ఏమైనా ప్రజల heart కు appeal చెయ్యటమన్నది ఈనాటి జీవితం గురించి అయితే సాధ్యంకాని, పురాణ కథలను గురించి కాదు పురాణ కథలను గురించి మనుషుల minds చిత్రంగా condition అయి ఉన్నాయి రాముడు killer కిందికి వస్తాడు కృష్ణుడు rake, scoundrel ఈ విషయాలు రామాయణం, భాగవతాల్లో ఉన్నాయి కాని అవి చదివి కూడా జనం realise చెయ్యరు వాళ్ళు దేవుళ్ళు ! వాళ్ళకు మన values వర్తించవు ! అదీ conditioning "రాముడు ఏ విషయంలో ఆదర్శ పురుషుడు ?" అంటే చాలామంది చెప్పలేకుండా ఉన్నారు ఇదంతా ఒక గొప్ప irrationalism జనానికి rational attitudes మప్పటం తప్ప మనం చెయ్యగలిగింది ఏమీలేదు

పురాణాలను objective గా చూపటమనేది లేనేలేదు మల్లంపల్లి కృష్ణారావు కథలో దశరథుడి 360 భార్యలను serious గా తీసుకున్నాడు Patriarchal families లో అదేమీ వింత కాదు Group marriages లో కూడా 50 మంది స్త్రీలూ పురుషులూ సమష్టి దాంపత్యం జరపటం కద్దు ఈనాటి మన దృష్టికి అది permissive society కి పరాకాష్ఠ అనిపిస్తుంది కాని అది permissive society కానేకాదు

లెనిన్ సింపోజియంలో నార్లగారు paper చదివారు శ్రీశ్రీగారు రెండు పద్యాలు (ఇంగ్లీషు తర్జుమా) చదివారు నన్ను నార్లగారి paper మీద చెప్పమన్నారు తెలుగు సాహిత్యం మీద Lenin impact మొదట్లో ఏమీలేదనీ, fighting literature వస్తున్న కొద్దీ లెనిన్ ప్రభావం బలపడుతున్నదనీ, ముందు ముందు ఇంకా ఉంటుందనీ, మొదట్లో Marx ప్రభావం బాగా ఉండేదనీ అన్నాను

ఆంధ్రప్రభవారు నాకు రివ్యూ పుస్తకాలు పంపటం మాని అయిదారు నెల్లయింది ఈ మధ్య పడినవి కూడా నేను అప్పుడు రాసినవే ఒకవేళ వాళ్ళు పంపినా నేను రివ్యూలు రాయను నాకు time లేదు, ఓపిక అసలే లేదు ఉంటాను

*

25-1-73

నమస్కారాలు చాలా రోజుల తరువాత మీ ఉత్తరం విరసం విశేషాలు లేకపోలేదు శ్రీశ్రీ award తీసుకోవటం గురించి పెద్ద గాలిదుమారం లేచింది శ్రీశ్రీకి ఆ అయిదువేలు

కావాలి అప్పులలో ఇరుక్కొని ఉన్నాడు భార్యకు heart attack వచ్చి చాలా డబ్బు ఖర్చయింది శ్రీశ్రీ award తీసుకోవటంలో నాకు breach of principle ఏమీ కనిపించలేదు అది ప్రభుత్వంవారి honour ఏమీ కాదు దానితో ప్రభుత్వం శ్రీశ్రీని కట్టేసుకోలేదు Political గా dictate చెయ్యలేదు అయితే, మనవాళ్ళందరూ against గా ఉన్నారు Central Academy Award తీసుకోవటమంటే విరసం ideals ని నీరుగార్చటమేనని వాళ్ళ నమ్మకం తీసుకోకపోవటమంటే వాళ్ళకు 5000 ఆదా చెయ్యటం తప్ప మరేమీ కాదని శ్రీశ్రీ నమ్మకం నన్నడిగితే అంతమంది sentiment hurt చెయ్యటం మంచిది కాదనీ, నాకు స్వయంగా అభ్యంతరం లేదనీ అన్నాను

ఈ కోతి పుండుకు బ్రహ్మరాక్షసిలాగా ఒక working committee resolution జరిగింది వాళ్ళు విశాలాంధ్ర విభజన చేసి, దాని ద్వారా విప్లవం తేవాలని resolution pass చేశారు Award విషయంలో అసలే irritate అయి ఉన్న శ్రీశ్రీ "నేను విశాలాంధ్ర విభజనకు ఎంతమాత్రం ఒప్పుకోను" అంటూ resignation పంపించాడు Press కు statements ఇస్తానంటే నేను అడ్డుపడ్డాను నిజానికి W C Meeting కి శ్రీశ్రీగాని, నేనుగాని, రావిశాస్త్రిగాని వెళ్ళలేదు KVR ఆధ్వర్యాన ఆ మీటింగు జరిగింది నేను వెళ్ళని మీటింగులో జరిగే తీర్మానాలకు కట్టుబడి ఉంటానని మొదటినుంచీ నా principle శ్రీశ్రీ దాన్ని కూడా పాటించలేదు తీర్మానానికి ఆక్షేపణ తెలుపుతూ రాయమన్నాను Resignation వద్దన్నాను అయినా శ్రీశ్రీ తన అధ్యక్షపదవికి రాజీనామా పంపాడు దాన్ని ఉపసంహరింప చేయాలి Press statement ఇచ్చినట్టు లేదు విశాఖ వాళ్ళందరూ శ్రీశ్రీ award com-money తీసుకోవటానికి dead against గా ఉన్నారు

కథ shock చేసినా, surprise చేసినా, enliven చేసినా అది reader కు ఒక అనుభూతి కావాలన్నది స్పష్టం ఏ తరగతి reader అన్నది ఎవరి కమిట్‌మెంట్‌ని బట్టి వారు తేల్చుకోవాలి కమిట్మెంట్ మాత్రమే చాలదని నా నమ్మకం ఒక జమీందారు గారబ్బాయికి శ్రామికులను గురించి ఎంత సానుభూతి ఉన్నా వారికి ఉపయోగించే సాహిత్యం రాయలేడు అక్కడే reality కీ fiction కీ organic connection ఉండేది నేను slums లో వుండేవాళ్ళను గురించి కావాలన్నా రాయలేను రాస్తే అది కృత్రిమంగానే ఉంటుంది వాళ్ళ జీవితానికి external గా ఉండి రాయవచ్చు అందులోకి దూరి రాయటం సాధ్యం కాదు Poet కి ఈ externality సాధ్యం, fiction writer కి కాదు కాళీపట్నం rare & precious exception విప్లవ రచయిత తన లక్ష్యాన్ని రచనలో సాధించాలంటే తన శక్తికీ, అనుభవానికీ, ఆశయానికీ తగిన దృక్పథం నుంచి రాయటం అలవరచుకోవాలి Externalization తప్పదు మీ 'గోడ' కథ external గా వుండి కూడా effective గా లేదా ? చాలామంది మగవాళ్ళు ఆడదాని మనస్తత్వాన్ని internal గా view చెయ్యబోయి బోల్తాపడతారు - class distinction లేకపోయినా కొందరు జమీందార్లనూ, పెద్ద capitalists నూ, జడ్జీలనూ పాత్రలుగా తీసుకుని చాతా వాతా కాకుండా చిత్రిస్తారు ఈ internal - external contradiction సాహిత్యంలో అంతటా ఉన్నదే ఇది విప్లవ రచనలకు ప్రత్యేకం కాదు

నాకు personal గా జానపద రూపాలంటే పెద్ద గౌరవం లేదు Folk lore & pastoralism feudal culture లో నుంచి వచ్చినవి ఆ forms కు ప్రజలు సన్నిహితంగా ఉన్నారంటే అందుకు కారణం వారింకా feudal culture నుంచి బయటికి రాకపోవటమే బూర్జువా art forms చాలా advanced గా ఉంటాయి కాని tactical గా ఆ forms ను వినియోగించి జనానికి కొత్త content ఇవ్వటం వల్ల ప్రయోజనం ఉండవచ్చు అంతవరకే మనం folk lore forms ని tolerate చెయ్యాలి Folklore songs లో గాని, art లో గాని, music లో గాని social realism ప్రవేశపెట్టినా అది art గా ఎంతోకాలం నిలవదు హిట్లర్ భాగవతం, క్రిప్స్ రాయబారం వీధి నాటకాలుగా ఆడారు జనం హర్షించారు కూడా కాని వాటికి permanence లేదు Socialist realism aim అయినప్పుడు art forms లో అభివృద్ధి బూర్జువా art forms నుంచే రావాలి

జానపద గేయాలు నిలిచిపోయాయంటున్నారు కాని వాటిని మీరు శ్రద్ధగా వింటే కృష్ణశాస్త్రి, నండూరిల కవిత్వం లక్షరెట్లు మేలని మనక్కూడా అనిపిస్తుంది రేడియోలో ఏనాది పాటలూ అవీ వొస్తే నాకు చెడ్డ కంపరం ఎత్తుతుంది వాటికీ మనం ఊహించే భవిష్యత్తుకూ మధ్య ఎలాంటి వంతెనా సాధ్యం కాదు

విమర్శకులలో అయినా, రచయితలలో అయినా ఈనాడు predominent గా ఉన్నది మధ్యతరగతి మనస్తత్వం Form కు ప్రాముఖ్యం ఇచ్చిన మాత్రాన మనం విమర్శకులను ఆక్షేపించి లాభంలేదు నేను open గా form గురించి ప్రస్తుతం stress చెయ్యటంలేదు, content గురించే stress చేస్తున్నాను కాని form correct గా ఉండటం విరసం సాహిత్యానికి ఎంతైనా అవసరం అందుకు రెండు కారణాలు - ఒకటి అందరికీ తెలిసినదే bad form makes even good content ineffective రెండోది అందరికీ స్పష్టంగా తెలీదు good form makes the content acceptable even to those who oppose it గూడవల్లి రామబ్రహ్మం పచ్చి anti-communist మా భూమి నాటకమూ, నాజరు బుర్రకథా చూసి thrill అయిపోయి, ప్రజానాట్యమండలి వాళ్ళను ప్రొడక్షన్ ఆఫీసుకు పిలిపించి ఎంతో friendly గా treat చేశాడు Politics పోలేని regions లోకి arts పోయి ground prepare చేస్తుంది శ్రీశ్రీని అందరూ చచ్చినట్టు accept చేస్తారు ఎందుచేత ?

విరసంవాళ్ళు forms ను బాగా పదును పెట్టుకోవాలి అది అనుకోగానే అయేది కాదు Content కు aptగా ఉండే form geneiuses కు మాత్రమే దొరుకుతుంది మనం విరసం geneiuses ను వెతుక్కోవాలి

రచయితల్లాగే విమర్శకులు కూడా class basis చూపిస్తారు మనకు బూర్జువా విమర్శకులు ఎక్కువగా సహాయపడరు త్రిపురనేని విమర్శలు నాకు faultless గా ఉన్నట్టు కనబడతాయి KVR అప్పుడప్పుడూ learnedగా ఉన్నా కొంత bookish అనిపిస్తుంది అంతా క్షేమంగా ఉన్నాం మీరూ మీ ఆవిడా కులాసాగా ఉన్నారని తలుస్తాను ఉంటాను

❋

5-1-74

నమస్కారాలు మీ 2 ఉత్తరం అందింది మిమ్మల్ని కుక్క కరవడం ghastly గా ఉంది అది rabis కాకపోవచ్చు కాని ఇంజక్షన్లు తీసుకోకపోవటం risky Rabis కి హోమియోలో ఏమీ మందులేదు దాని symptom అయిన Hydrophobia కు ఏవో మందులున్నాయి Rabis గురించి మీరు విన్నదాంట్లో exaggeration ఏమీ ఉండదు అది brain ను affect చేస్తుంది అందుచేత మీరు course అంతా తీసుకోండి దాని bad effects కు Homeo చూడొచ్చు

వచ్చే 12, 13, 14లలో కర్నూలులో విరసం మహాసభలు ఎలా వెళ్ళాలో నాకు పాలు పోలేదు మద్రాసు నుంచి తిన్నగా రైలు లేదు బొంబాయి బళ్ళలో ticket (berth) దొరకాలంటే యజ్ఞమే మా అబ్బాయి ఇక్కడికి వచ్చి ఉన్నాడు ఇవాళకు టికెట్ బుక్ చేద్దామని పది రోజుల క్రితం వెళితే ఉదయం 9కల్లా అయిపోయాయన్నారు! Advance booking నాకు impossible ఒకవేళ ఏ Travel Agencyకైనా 5 రూ॥ పారేసి తెప్పిద్దామంటే నాలుగు రోజులు నా భార్య, మా చిన్న మనుమరాలిని, ఏణ్ణర్ధం దాన్ని పెట్టుకుని, ఇంట్లో ఒక్కత్తే manage చెయ్యాలి ఆవిడ health మంచిది కాదు నా routine మారితే నా health కూడా మంచిది గాదు అందుకే నేను బెజవాడ, ఒంగోలు (easy journey) meetings కు కూడా పోవటం లేదు ఇది నా ప్రాణానికి చాలా difficult journey

ఇదంతా ఇలా ఉంటుందనే నన్ను vice-president గా తీసెయ్యమని గుంటూరులోనే అన్నాను ఎవరూ వినిపించుకోరు ఇప్పటికీ విరసంతోనూ, పౌరహక్కుల ఉద్యమంతోనూ out of contact అయాను ఇది నాకు చాలా బాధాకరంగా వున్నది రేపు (6న) ఒంగోలులో China-India Friendship Conference పెద్ద ఎత్తున జరుపుతున్నారు దానికి Hon President గా గాని, VP గా గాని ఉంటారా అని రమణారెడ్డి (KV) రాశాడు ఏదీ ఉండలేననీ ordinary member గా ఉంటాననీ రాశాను ఈ ఉద్యోగం మానేసి మా ప్రసాద్ ఉద్యోగం ఉండే చోట settle అయితే తప్ప నాకు personal freedom రాదని తోస్తుంది

*

29-11-76

నమస్కారాలు మీ 27 ఉత్తరం ఇప్పుడే అందింది మీరు మళ్ళీ ఒక జవహర్లాలును కన్నారన్నమాట ! 1932 లో నాకూ ఒక జవహర్లాలు పుట్టాడు వీళ్ళు జవహర్లాలు లాగా కాకుండా ఉండటమే మంచిదేమో

నా ఆరోగ్యం ఒక నెలనుంచీ సరియైన దారిలో పడింది Root Cause was shortage in haemoglobin అది remove అయింది కొంచెం బలం పట్టితే వేరే complaint ఏమీలేదు

శ్రీశ్రీ, రావిశా అరసంలో చేరారని వాళ్ళ శత్రువులు కూడా ఇక్కడ అనటం లేదు CPI వాళ్ళను నమ్మరాదేమో !

Emergency వల్ల literary creativity దెబ్బతినటమే గాక కుళ్ళు activity విస్తరించింది The costumes show signs of getting false అప్పుడప్పుడూ కథలు

చదువుతున్నాను చాలావరకు మాదక ద్రవ్యం ! Social consciousness చాలా లోపించింది ఇటీవల విజయ అనే పత్రికలో బీనాదేవి కథ వచ్చింది Most unbelievably it is quite morbid and to an extent in bad taste Restrictions అనేవి writers పెట్టుకోకపోతే పత్రికలవాళ్ళు పెడతారు నా దగ్గర రెండు articles ఉన్నాయి వాటిని ఎవరూ వేసుకోరు !

ప్రభాకర్‌ను అడిగానని చెప్పండి - వింటే వింటాడు లేకపోతే లేదు ఉంటాను

*

27-6-77

నమస్కారాలు మీ 24 ఉత్తరం అందింది నేను జనవరి మధ్యనుంచీ ఆఫీసుకు పోవటం లేదు నా జబ్బు ఏమిటో కిందటి నెల ఉజ్జాయింపుగా తెలిసింది TB of the kidney Prolonged treatment అవసరం అందుచేత నేను ఇల్లు కదలటం లేదు ఎక్కువగా నడవటం కూడా సాధ్యంకాదు చందమామ పని ఇంటిదగ్గరే చేస్తున్నాను

ఇందిరాగాంధీ బూర్జువా డెమోక్రసీ నిభాయించలేక ఫాసిజంకు దిగింది జనతావాళ్ళు బూర్జువా డెమోక్రసీ అమలుచెయ్యగలమని అంటున్నారు వాళ్ళు గెలవటానికి కారణం కాంగ్రెసు వాళ్ళ దౌర్జన్యకాండ - ప్రజలలో రాజకీయ పరిజ్ఞానం పెరగటం కాదు దీన్ని రివల్యూషన్ అని చెప్పి ప్రజలకు "తైర్" కొట్టుతున్నారు వీళ్ళు అంతః కలహాలతో కొట్టుకు చావకపోతే గ్రామాలలో చిన్న పరిశ్రమలు పెట్టి, వాటిద్వారా పెద్ద పరిశ్రమలు లాభం పొందేటట్టు చేసి, గ్రామీణుల labour power చవగ్గా కొని, వాళ్ళు urban areas కు పెద్ద ఎత్తున వచ్చి పడకుండా చేయగలరేమో అంతకన్న ఏమీ చెయ్యలేరని నా ఉద్దేశం Compradar capitalistsదే ఇప్పటికీ రాజ్యం States కు దాదాపు Emergency లో ఉన్నంత power ఉంటుంది - decentralization నెపంతో National Integration ఇంకో నూరేళ్ళు పట్టవచ్చు అప్పుడైనా genuine communist party వస్తేనే ఇప్పుడున్నవి ఏవీ కమ్యూనిస్టు పార్టీలని నాకు తోచలేదు

భారతీయ విప్లవం దాని సరియైన రూపాన్ని అది ఎప్పటికైనా తెలుసుకుంటుంది, అపజయాల నుంచి నేర్చుకుంటుంది ఆ మధ్య సాహిత్యోద్యమ కర్తలకు రాజకీయ ఆవేశాలు రావటమూ ఒక వర్గాన్ని ఇంకో వర్గం విరసం నుంచి వెళ్ళగొట్టటమూ లాంటి disgraceful things చేశారు వారంతా విరసంలో ఉన్నారు అనుభవం నుంచి వారు ఏం నేర్చుకున్నారో కాలక్రమాన గాని తెలీదు అందుచేత మీరు ఇంకొంతకాలం ఆగి విరసంలో చేరినా కాలాతీతమైపోయిందన్న భయం లేదు

నేను మళ్ళీ ఎప్పటికి మామూలుగా ఆఫీసుకు పోయి బయటకు రాగలుగుతానో తెలియదు ప్రస్తుతం ఇంచుమించు ఇల్లుదాటి (కారులో తప్ప) ఎక్కడికీ పోవటం లేదు ఇంత పెద్ద దెబ్బ నేను ఎన్నడూ తినలేదు మీరూ, మీ భార్యా, పిల్లవాడూ కులాసాగా ఉన్నారని తలుస్తాను ఉంటాను

10-5-69

*శ్రీ రామానుజంగారికి,*

నమస్కారాలు మీ ఉత్తరం అందింది చదివే కథలతో influence కావద్దనటంలోని ఉద్దేశం, కథావస్తువు విషయంలో మాత్రమే Technique విషయంలో influence అనేది ఏమీ ఉండదు భాష విషయంలో కూడా ఒకరిని అనుకరించటం అంత మంచిది కాదు రావిశాస్త్రిగారి భాష విశాఖ జిల్లా వారందరి సొత్తూ అనుకున్నా ఆయన style ఆయనదే గదా దాన్ని కాపీ కొట్టేవాళ్ళు ఏమంత రాణిస్తున్నారు !

పోతే, మనం నిజంగా ప్రేమించిన రచనల influence మనమీద ఎట్లాగూ ఉంటుంది ఆ రచనలు ఉత్తమ తరగతికి చెందినవైతే వాటి influence మంచికే ఉపయోగిస్తుంది తనమీద డికెన్స్ influence ఉందని రావిశాస్త్రిగారన్నారు అందువల్ల ఆయనకు నష్టమేమీ కలగలేదు ఎంత మంచి రచనలు చదివినా పనిపెట్టుకుని వాటి ఛాయలకు దూరటం రచయితకు అభివృద్ధి చేకూర్చదు

శిల్పం అంటే సూక్ష్మంగా మలచటమూ, నిర్మించటమూ అన్నది నిజమే కాని అది మంచి కళా ప్రక్రియ కాదు, creative element అందులో చాలా ఉంటుంది శిల్పానికి మొదటి గీటురాయి economy ఒక వాక్యంతో సరిపోయే దానికి రెండు వాక్యాలు రాయటం, కథకు అవసరమైన వివరాలు సరిగా establish కాకపోవటమూ లాంటివి శిల్పంలో లోపాలు Economyతో పాటు రచనలో సమగ్రత కూడా ఉండాలి కథలు రాసే వాళ్ళంతా కథలు చదువుతారు కూడా గనుక, మంచి కథలు చదివేటప్పుడు వాటిని analyse చెయ్యటం చాలా మంచి అలవాటు ఉదాహరణకు, రిలీవర్ అన్న బీనాదేవి కథ చూడండి అది technically perfect అనిపిస్తుంది అందులో కొన్ని కొన్ని విడి మాటలకు కూడా ఎంతో significance ఉంది

దురదృష్టవశాత్తూ బుచ్చిబాబు రాసిన ఏ పుస్తకమూ నాకు నచ్చలేదు అందరూ 'చివరకు మిగిలేది' మాస్టర్ పీస్ అంటున్నారు కనక దాన్ని చదవండి నా పుస్తకాలన్నీ ఒకచోట దొరకవు లైబ్రరీలో try చెయ్యండి ఉంటాను

*

25-6-69

నమస్కారాలు మీ 24 ఉత్తరం అందింది 13-5-69న మీరు రాసిన ఉత్తరమూ, కథా ఇప్పుడే చూశాను అది రాగానే నేను చూడకపోవటానికి తొందరపని ఏదో అడ్డు వచ్చి ఉంటుంది

నవలక్కూడా శిల్పం ఉండాలి Short story technique దానికి పనికి రాదు నవల పాశ్చాత్యులనుంచి మనం అరువు తెచ్చుకున్నదే గనుక దాని శిల్పం గురించి కూడా మనం వాళ్ళ వద్దనే నేర్చుకోవాలి నవల శిల్పం గురించి నేనేమీ పుస్తకాలు చదవలేదు అట్లా

చదవటం వల్ల ప్రయోజనం కూడా లేదని నా ఉద్దేశ్యం కాకపోతే మంచి ఇంగ్లీషు (పాశ్చాత్య) నవలలు చదివి వాటిని analyse చేసి చూసుకుంటే మనకు అనేక రకాల అభిప్రాయాలు ఏర్పడతాయి Critics నవల techniques గురించి రాసేటప్పుడు చేసేపని కూడా అదే

మీరు ఇచ్చిన list లో plot అన్నది ఈనాడు ముఖ్యమైనది కాదు 19వ శతాబ్ది నవలల్లో plot అనేది ఉండేది అలాంటి వ్యూహాలు ఈనాడు అంతగా గణనలోకి రావు Characterisation తప్పక ఉండాలి అది వాస్తవంగా ఉండాలి Progressive Writers అయితే class nature కు కూడా ప్రాముఖ్యం ఇస్తారు ఇది వాస్తవికతలో చేరుతుంది కనుక దాన్ని గురించి ప్రత్యేకంగా చెప్పుకోనవసరం లేదు Dialogue కూడా characterisation లో ఒక భాగమే నాటకాలలో ఉండే ప్రాముఖ్యం దానికి నవలలో ఉండదు Philosophy అన్నది రచయితకుంటే అది నవలలో ప్రతిబింబిస్తుంది దాన్ని కావాలని బలవంతాన ప్రవేశపెడితే మిగిలిన అంశాలు దెబ్బతింటాయి Tragedy, pathos, humour అనేవి సందర్భానుసారం కలిగేవి వీటన్నింటికీ తెలుగు నవలల్లో ఉదాహరణలివ్వటం నాకు సాధ్యమయ్యే పనికాదు ఎందుకంటే నేను చదివిన కొద్ది తెలుగు నవలలనూ రచయితల ఆశయం దృష్ట్యా చదివాను గాని, ఈ text-book analysis కు గురి చెయ్యలేదు నేను చదివిన తెలుగు నవలల్లో కూడా నన్ను బలంగా impress చేసినవి తక్కువే

మీ 13-5-69 ఉత్తరంతో బాటు 'నిప్పు' అన్న కథ కూడా ఉన్నది దాన్ని చదివి నా అభిప్రాయం తెలియబరుస్తాను ఏమైనా మీరు రాయదలచిన కథలను గురించి మీరే నిర్ణయించుకోవటం మంచిది నేను ఏనాడూ నా కథలను ఇతరులకు చూపి వారి అభిప్రాయాలు అడిగి ఉండలేదు కథ రాయటానికి తగిన ప్రేరణ, రాసే శక్తి మనలో ఉంటే అది రాయదగిన కథే అవి లేని పక్షంలో ఇతరులు విమర్శించి మన చేత మంచి కథలు రాయించలేరనుకుంటాను

❋

6-8-69

శ్రీ ప్రకాశరావుగారికి,

నమస్కారాలు మీ ఉత్తరం చదివి, నేను చేస్తున్న రచనలు కొందరికైనా ఉపయోగపడు తున్నందుకు సంతోషించాను చాలామంది నాకు ఉత్తరాలు రాస్తారు నా ద్వారా తమ సందేహాలు తీర్చుకునేటందుకే రాస్తారు ఉత్తరాల ద్వారా జవాబులు చెప్పటానికి వీలుంటే తప్పక జవాబు రాస్తాను కాని కొందరు ముఖాముఖీ చెప్పుకోవలసిన కబుర్లన్నీ రాస్తారు అటువంటి వాళ్ళకు రోజు విడిచి రోజు ఉత్తరం రాయటానికి నాకు తీరిక ఉండదు

ఒక మనిషి మీద ఏర్పడే వల్లమాలిన సదభిప్రాయం చాలావరకు పరిచయంతో పోతుంది కొన్ని సందర్భాలలో పరిచయం లేకపోయినా కాలక్రమాన సన్నగిల్లుతుంది చాలా rare casesలో మాత్రమే అది ఆసాంతం నిలుస్తుంది అదే నికరమైన భావం, అది exaggerated గా ఉండదు

ఆంధ్రప్రభకు నేను రాసే రివ్యూలలో గొప్ప critical standards ఉంటాయనుకోను రివ్యూకు వచ్చే పుస్తకాలు చాలా భాగం విమర్శకు నిలిచే విధంగా ఉండవు అందుచేత రివ్యూలు readable గా ఉండటానికి చూస్తాను బుచ్చిబాబు విషయం వేరు అతను కొన్ని శక్తులు గల రచయిత అనేక మందికి అభిమాన రచయిత నాకు స్వయంగా మిత్రుడు అతనిలో bad points మాత్రమే చూపవలసి వచ్చింది బుచ్చిబాబును విమర్శించినట్టే బాల గంగాధర్ తిలక్‌నూ విమర్శించవలసి వచ్చింది అప్పుడూ కొందరికి కోపం వచ్చింది సృజన శ్రీశ్రీ సంచికలో శ్రీశ్రీ వ్యవహారాలను కూడా విమర్శించవలసే వచ్చింది (ఆ సంచిక 1970 జనవరిలో గాని రాదు) ఇలా పేరుగల వాళ్ళలో లోపాలు చూపించి నేను కొందరి ఆగ్రహానికి గురికాక తప్పదు శ్రీశ్రీ కవిగా నాకొక demi god అంత మాత్రాన లోపాలుచూడకుండా, చూప కుండా కళ్ళు మూసుకోవటం ఆత్మవంచనా, పరవంచనా అవుతుంది Popular కావటానికి నేను రివ్యూలు రాయటంలేదని చెప్పగలను అలాంటి పాప్యులారిటీ నేనెన్నడూ కోరలేదు

సామ్యవాదం సౌమ్యవాదం కావటానికి అభ్యంతరం లేదు పై తరగతులదే ఎప్పుడూ హింసా విధానం సామ్యవాదం హింసా విధానం అవలంబిస్తే అది ప్రతిహింస అవుతుంది గాని నిజమైన హింసా విధానం ఎన్నడూ కాదు మన దేశంలో social contradiction అన్ని దశలలోనూ ఉన్నది - బార్బారిజం నుంచి సామ్యవాదం దాకా అన్ని రకాల సామాజిక సిద్ధాంతాలూ అమలులో ఉన్నాయి విప్లవం మతం మీద జరగాలా, ఫ్యూడల్ సంబంధాల మీదనా, పెట్టుబడిదారీ మీదనా ? ఎన్నో విప్లవాలు వాయిదా పడిపోవటం చేత overall picture చాలా confusingగా ఉన్నది ప్రస్తుతం రాజకీయ శక్తులను హస్తగతం చేసుకున్న బూర్జువా వర్గం తాను అంతమొందించి ఉండవలసిన సాంఘిక శక్తులను గట్టిగా బలపరుస్తున్నది జనసంఘంలాంటి పార్టీని స్వతంత్ర పార్టీ రూపుమాపి ఉండవలసింది ఆ రెండూ ఏకమయ్యాయి ! నక్సలైట్‌లు మరో రాజకీయ సమస్యను పాక్షిక దృష్టితో, భవిష్యత్తులో పనికి వచ్చే దృష్టితో చూస్తున్నారని నా అనుమానం శ్రామిక వర్గం మీద ఇంకా మత శక్తుల ప్రభావమూ, ఫ్యూడల్ శక్తుల ప్రభావమూ పూర్తిగా పోలేదు అందుచేత శ్రామిక వర్గ నియంతృత్వ దశ కనుచూపు మేరలో లేదు ఉంటాను

❋

16-8-69

నమస్కారాలు మీ ఉత్తరం అందింది మీ కథ "మనిషి-మహిషి" ఎమెస్కో వాళ్ళ కలక్షన్‌లో వచ్చింది పుస్తకం ఇప్పుడే చేతికి అందింది కథ జ్ఞాపకం లేదు ఒక్కసారి మళ్ళీ చూస్తే జ్ఞాపకం వస్తుంది

నా రివ్యూలో critical standards ఉండవని modesty తో అన్నమాట కాదు విమర్శించే రచనలో ప్రస్తావించే ప్రతి విషయం మీదా authoritative గా చెప్పగలిగితేనే నిజమైన విమర్శ నా రివ్యూలు ఇతరులకు పనికి రావాలనే నా ఉద్దేశం కూడా ఇతర రివ్యూలలో కొన్ని చాలా చెత్తగా ఉంటున్న మాటా నిజమే

'ప్రతిభ'లో రాసిన వ్యాసాలు నాకు జ్ఞాపకం లేదు కాని ఆ రోజుల్లో రాసిన ఒక పరమ తుక్కు వ్యాసం మాత్రం జ్ఞాపకం ఉంది అందులో ఇంచుమించు ప్రతి మాటా అబద్ధమే పరిపూర్ణమైన అజ్ఞానంతో రాసిన వ్యాసం అది నేను అడపాదడపా రాసిన వ్యాసాలు అచ్చేస్తే సంపుటాలకు సంపుటాలు దిగుతాయి కాని వాటిని ఎవరూ అచ్చు వెయ్యరు అటువంటి stuff అమ్మదు

ఇక మీ సందేహాలు యువతరానికి తెలియవలసింది ఏమిటి ? ఒక్క ముక్క చెప్పాలంటే భౌతికవాదం యొక్క అంతరార్థం జనత అనే గలివరును కొన్ని వేల చిన్న చిన్న దారాలు కట్టిపెట్టి ఉంటాయి - మతం, దేవుడు, తప్పుడు నమ్మకాలు, కాలదోషం పట్టిన ఆచారాలు, అసత్య ప్రచారాలు, అజ్ఞానం, భయం, జీవితంలో వ్యష్టి పోరాటం (అంటే సమష్టి పోరాటం లేకపోవటం) వగైరా జాడ్యాలు వర్గ సమాజంలో ఉండే వ్యక్తి స్వాతంత్ర్యమల్లా ఎవడి సమస్యలతో వాడు కుస్తీ పట్టుతూ, వాటి యొక్క సమష్టి స్వభావాన్ని చూడలేకపోవటమూ, వాటి పరిష్కారానికి సమష్టి కృషి చెయ్యక పోవటమూ ఈ పరిస్థితికి విరుద్ధంగా యువకులు ఏ కృషి చేసినా అందువల్ల అంతో ఇంతో మేలు జరుగుతుంది కాని ముందు యువకులు తమ కళ్ళను తాము తెరుచుకోవాలి

అభ్యుదయ రచయితలు తమ జీవితం కలిగించే నిరాశలను ప్రజలలో తొలగించాలి జీవితంలో వ్యక్తుల వర్గ స్వభావాలను బట్టబయలు చెయ్యాలి పేరు మోసిన ఒక fire-eating అభ్యుదయ కవి నన్ను ఆక్షేపించాడు - "మనుషులలో వర్గ స్వభావం ప్రతి క్షణమూ కనిపిస్తుందా ?" అని అడిగాడు సమస్యలు పరిష్కారం చేసుకునే దగ్గిర తప్పకుండా కనిపిస్తుందన్నాను అంతమాత్రం చేత మధ్య తరగతి వాళ్ళు అధమ తరగతులకు సహాయపడరని కాదు వర్గ స్వభావాన్ని అర్థం చేసుకుంటూ పోయిన కొద్దీ వర్గతత్వం మిగిలిపోతుంది నేను ఇంతకుముందు చెప్పిన తుక్కు వ్యాసం రాసిననాడంత పెటీ బూర్జువాను ఈనాడు కాను కాని నా జీవిత విధానం పెటీ బూర్జువా పంథాలో ఉన్నంత కాలమూ ఆ పెటీ బూర్జువా వర్గతత్వ బీజాలు నాలో ఉండకపోవు పతితుల జీవితాలను కరుణామయంగా చిత్రించిన మాత్రాన వాళ్ళకు సహాయపడగలమన్న నమ్మకం నాకు లేదు వాళ్ళలో sefl-pity రేకెత్తించటమా, ధైర్యం పొయ్యటమా అన్నది ఆలోచించాలి

బీనాదేవి కథల్లో జీవిత సత్యం చాలా ఉంది మేధ కనిపించటం తప్ప ? హృదయం

అంటే sentiment మీద play చెయ్యటమే గదా నా రచనల్లోనూ హృదయం లోపించిందంటారు మిత్రులు ఉంటాను

*

2-9-69

నమస్కారాలు మీ ఉత్తరం అందింది "తెలుగు పాఠకుల స్థాయి" అనేది కొలవటం సాధ్యం కాదు సాధ్యం అయి అందరూ ఆ స్థాయిలో రచనలు చేసే పక్షాన రచనల్లో వైవిధ్యం పోతుంది అసలు రచయిత ఎన్నడూ అటువంటి అంచనాలతో - సినిమా ప్రొడ్యూసర్లు 'వేలిముద్రల వాళ్ళను' మనసులో పెట్టుకున్నట్టు - రచనలు చేయరు ప్రతి రచయితా తనలాంటి సంస్కారం గలవాళ్ళ కోసమే రాస్తాడు రచయితలకూ, పఠితకూ మధ్య ఉండే అగాధం వర్గ స్వభావాల వల్ల ఏర్పడేది మార్క్సిజం దృష్ట్యా ఇది క్లాస్ సొసైటీ ఉన్నంత కాలమూ ఉండేదే అంత మాత్రాన రచనలు జనసామాన్యానికి పనికిరాకుండా పోవాలని లేదు ఏ రచయితా తన సంస్కారాన్ని సాకుగా పెట్టి ఆ సంస్కారాన్ని అందుకోలేని వాళ్ళను హీనంగా చూడరాదు కార్మికులున్నారు వాళ్ళకోసం నేను రాయలేకపోతే, వాళ్ళ మంచిచెడ్డలను గురించి నా తరగతి వాళ్ళకు అర్థమయ్యేటట్టు నేనెందుకు రాయకూడదు "అర్థం చేసుకుంటే చేసుకోండి, లేకపోతే పొండి," అని రచయిత అనటం తటస్థించినప్పుడు కూడా తన వర్గం వాళ్ళతోనే అంటాడు తన సాటి వాళ్ళకు కూడా ఉపయోగించకుండా రాసినప్పుడే అంటాడు ఆ సంగతి మనం గుర్తించాలి

ఇంగ్లీషు మాటలు ఉపయోగించినా అవి తెలిసిన వాళ్ళ కోసం రాసేటప్పుడు తప్పులేదు టెక్నిక్ అన్నది ఎప్పుడూ ఉంటుంది అందులో గారడీలు మాత్రం స్వాతిశయం నాకు తెలిసినంత వరకు బీనాదేవి కథలు అర్థం కాలేదన్న మధ్యతరగతి వాళ్ళెవరూ కనిపించలేదు

మీరన్నట్టు ఎక్కువ మంది కాలక్షేపానికి చదువుతారు వాళ్ళు సాహిత్యం నుంచి ఎక్కువ లాభం పొందలేనివారై ఉంటారు

ప్రజాకవి, ప్రజా కవిత్వం అన్నవి ఒకప్పుడు చర్చకు వచ్చాయి ప్రజోద్యమాలున్నప్పుడు ప్రజా కవిత్వం విపరీతంగా పుట్టుకొచ్చింది "మా కొద్దీ తెల్లదొరతనము", "చేయెత్తి జై కొట్టు తెలుగోడా" లాంటివి ఎన్నో గేయాలు అందరి నోళ్ళా పలికాయి కాని నేను చూసినంత వరకూ ప్రజోద్యమాలకు సంబంధించకుండా ప్రజా కవిత్వం రావడం జరగలేదు "దేశమును ప్రేమించుమన్నా" కూడా ప్రజా నాట్య మండలి ఉద్యమంలోనే ప్రజలకు అందింది ప్రజా కవిత్వంలో పాండిత్యం ఉండదు

రాచకొండ రచనల్లో కనిపించే పాత్రలు ఏ వర్గాలకు చెందినవో, ఆ వర్గాల వారి కోసం ఆయన కథలు రాయటం లేదు అందుచేత ఆయన మధ్య తరగతి వారి హృదయాలు కింది తరగతి వారి పట్ల ద్రవించేటట్టు చేయటానికే పని చేస్తున్నారు అది కూడా ఒక దృక్పథమే ఆయనలాగా అందరూ కింది తరగతి పాత్రలను తీసుకు రాయలేరు చాలామంది తమ

తరగతి గురించే రాయాలి  రాసేటప్పుడు జీవితంలో వారికి కనిపించే 'బూచు'లను గురించి భయం పోగొట్టటం కంటే మంచి పద్ధతి ఏముంటుంది ? చందమామలో దయ్యాల కథలు చాలా వేశాం  అవి చదివితే పిల్లలకు దయ్యాలంటే భయం పోతుంది వాటి ఉపయోగమే అది

❋

25-10-69

నమస్కారాలు   మీ ఉత్తరం అందింది

ఏ సాహిత్యమూ జీవితాన్ని అంతట్నీ ప్రతిబింబించదు, ప్రతిబింబించలేదు  ఏ ఒకడి జీవితంలో ఒక్కనాడు జరిగినదంతా రాసినా మహాభారతమంత అవుతుంది  అంతట్నీ ప్రతిబింబించదు, ప్రతిబింబించలేదు  సాహిత్య లక్ష్యం సమగ్రంగా ప్రతిబింబించటం కాదు, వాస్తవంగా ప్రతిబింబించటం  Truthful గా ప్రతిబింబించటం  జీవిత సత్యం బయట పెట్టటం

సాహిత్యంలో ప్రచారం అంతర్గతంగా ఉండి తీరుతుంది  ఒక రకమైన జీవితపు విలువలకు అగ్రస్థానం ఇవ్వటం వాటికి ప్రచారమే  ఒకడు బాధ్యతా రహితంగా బతికి, సుఖాలలో ఓలలాడి, ఉన్నదంతా పోగొట్టుకుని, ఆత్మహత్య చేసుకున్నాడనుకుందాం  వాడి కథ రాసేవాడు "బతికితే అట్లాగే బతకాలి" అన్నది స్ఫురించేటట్టు రాయవచ్చు  లేదా, అది బతకటమే కాదన్నట్టు చెప్పవచ్చు  వాస్తవ జీవితంలో కూడా పోలీసులు కమ్యూనిస్టులను వేటాడి చంపుతున్నప్పుడు అది చూసి కొందరికి భయం కలిగితే, మరికొందరికి మరింత ఉత్తేజం కలిగింది

"సోషలిస్టు వాస్తవికత" అంటే సోషలిస్టు సమాజంలో వ్యక్తుల మధ్య ఉండే సంబంధాలను సృష్టించటమని నేను అర్థం చేసుకున్నాను

ఉదయాస్తమయాలలో సూర్యుడు పెద్దదిగానే గాక, oval గా కూడా కనిపించటం ఉంటుంది  ఇది optical effect refraction వల్లనే కలుగుతుందని నేను చదివాను  ఇందులో optical illusion కూడా ఉండవచ్చు  వెలగని బల్బులో ఉండే ఫిలమెంటు సన్నగా ఉన్నట్టూ, అదే వెలిగినప్పుడు ఇంకాస్త లావుగానూ ఉన్నట్టు మనకు తోస్తుంది  ఇది optical illusion  చక్షువు, జగచ్చక్షువుల నుంచి మీరు quote చేసినది చాలా అయోమయంగా ఉన్నది  నీటిలో ఏదన్నా rodను పెట్టినప్పుడు అది మరికొంచెం లావుగా కనిపించటం మనం చూస్తాం  అది refraction  ఉదయించే సూర్యుణ్ణీ, నడినెత్తిన వున్న సూర్యుణ్ణీ ఎవరు ఫోటోలు తీసి పోల్చి చూశారో నాకు తెలియదు

నేను అయిదేళ్ళుగా విరమించిన కథకుణ్ణే  విరమించి కూడా ఇతరుల పోరు మరీ దుర్భరమైనప్పుడు రాస్తున్నాను  ఇటీవలే ఆంధ్రజ్యోతి వారి కోసం ఒక కథ రాశాను  నాది కొంచెం slow retirement  ఉంటాను

❋

3-6-70

మీ ఉత్తరం అందింది మామూలు సందేహాలు ఎవరిని అడిగయినా తీర్చుకోవచ్చు నన్ను గురించిన సందేహాలు నాద్వారా తీర్చుకోవటం తప్పుకాదు

చిన్న కథ మనుష్యుల మధ్య గల సామాజిక సంబంధాలను వ్యక్తం చెయ్యగలదు కాని వాటిలో కలిగే మార్పులను వ్యక్తం చెయ్యలేదు అందుకు నవలే సరి అయినది

29-5-70 ఆంధ్రజ్యోతి వారపత్రిక సంచిక నాకు ఏ కారణం చేతనో అందలేదు రావిశాస్త్రిగారి 'రవ్వ' చదవలేదు మీ ఊళ్ళోనే ఉన్నారు కనుక అయననుంచే clarification పొందటం మంచిది నా దాకా రానవసరం లేదు

వర్తమాన జీవితాన్ని వాస్తవంగా చిత్రించటమే జరిగితే అందులోకి జీవిత వాస్తవికత రాక తప్పదు అది విప్లవం తేకపోవచ్చుగాని, అందులో విప్లవ బీజాలు ఉంటాయి రోడ్డు మధ్య కెమెరా పెట్టి మూడు గంటల పాటు షూట్ చేస్తే అది సినిమా చిత్రం కానట్టు, కళాదృష్టి లేకుండా వాస్తవ జీవితాన్ని banalism తో నింపితే అందులో విప్లవ బీజాలుండకపోవచ్చు కాల్పనిక సాహిత్యం వాస్తవ జీవితాన్ని చిత్రించేటప్పుడు కళాదృష్టి ఉంటుందని presume చెయ్యాలి

రాజారాంగారి కథల్లో వ్యక్తుల అనుభవాలు వాస్తవంగా ఉంటాయేగాని, జీవిత వాస్తవికత కొంత తక్కువే పెద్దిభొట్లవారి 'ధృవతార' చదవలేదు 'పంజరం' గుర్తు రావటం లేదు

శాస్త్రిగారి 'అల్పజీవి' జీవిత చిత్రణ అనలేం అది వ్యక్తి మనస్తత్వ చిత్రణ అందులోని వ్యక్తి చాలా అల్ప సంఖ్యాకులకు ప్రతినిధి - నేను సృష్టించిన కేయాస్ పాత్రలాగే రెంటికీ పోలికలున్నాయని కాదు కేయాస్ కథలకు సాహిత్యంలో స్థానమే లేదు

చందమామలో వెనక వైజ్ఞానిక విషయాలు ప్రచురించాం దాన్ని ఎత్తివేయించారు కామందులు ఉంటాను

❋

19-8-70

నమస్కారాలు మీ అనుమానాలు

1 నేను చెప్పినది రాజకీయ పార్టీలను గురించి - సిద్ధాంతాలనూ, ఆదర్శాలనూ గురించి కాదు పార్టీలకు strategy, tactics వగైరాలు ఎన్నో ఉంటాయి కళ ప్రజల దగ్గరికి short cut తీసుకోవాలి లేకపోతే రచయితలు కూడా రాజకీయపార్టీల పిల్లిమొగ్గలు వెయ్యాలి ఒకనాడు చైనాను ఆకాశానికెత్తాం, ఇంకోరోజు తిట్టాలి చైనా కాకపోతే రష్యా అనుకోండి

ఇంకో ఉదాహరణ "ప్రజలు విప్లవానికి సిద్ధంగా ఉన్నారా ?" అన్నది రాజకీయ ప్రశ్న "ఇవాళ కాకపోతే రేపు - లేకపోతే అయిదేళ్ళకు - ప్రజలు విప్లవానికి సిద్ధం కాకపోతే మోక్షం లేదు"' అన్నది విప్లవ రచయితల దృక్పథం

ఒకటి స్పష్టం చేయాలి విప్లవ రచయితల మధ్య రాజకీయ అవగాహనలో వ్యత్యాసం ఉండవచ్చు ఒక్కొక్కరు ఒక్కొక్క పార్టీని సమర్థించనూవచ్చు కాని సాహిత్యంలో తమ అభిమాన పార్టీనీ, దాని కార్యక్రమాన్నీ బాహాటంగా బలపరచటానికి ప్రచార రచన చేస్తే అది నిలవదు ఈ విషయం ఎవరికైనా సందేహం ఉంటే లోతుగా చర్చించాలి దాన్ని general terms లో చెప్పటం సులభం కాదు

2 "గురజాడే గిరీశం" అన్నది డా బుర్రా శేషగిరిరావుగారి మాట ఆ మాట వెనక ఉన్న వాస్తవాన్ని నేను చాలా వరకు శోధించుకున్నాను గిరీశానికి అనేక విషయాలలో ప్రవేశం ఉన్నది అనేక విషయాలను గురించి ఆధునిక భావాలున్నాయి అతను ఇతర పాత్రలలో barbarism చూడగలడు ఈ శక్తులు గురజాడవి గిరీశానివేననుకుంటే దానికి తగిన ఆధారం కనబడదు అతను శ్రోత్రియ కుటుంబంలో పుట్టినవాడే కాకినాడ, రాజమండ్రి, విశాఖపట్నం, విజయనగరం నమ్మకంగా చూశాడు ఒకవేళ పూనా వెళ్ళాడేమో కాలేజీ చదువు పూర్తి చెయ్యలేదు అందుచేత గురజాడను గిరీశం అత్యంత సన్నిహితమైన పాత్ర అనటానికి సందేహం లేదు

అక్కడి నలుగురూ పంపిన కథలు అందాయి ఇంకా చూడలేదు "విరసం" పుస్తక సంకలనానికి ఉంచమని రమణారెడ్డిగారు అన్నారు ఉంచాను ఉంటాను

❋

8-7-70

మీ ఉత్తరం అందింది కొన్ని విషయాలు మొన్ననే శ్రీశ్రీ నుంచి టెలిఫోను ద్వారా తెలిశాయి శ్రీశ్రీ, రమణారెడ్డి సరయిన దారికి వచ్చినందుకు నేను చాలా సంతోషించాను

శ్రీశ్రీనీ, నన్నూ, రమణారెడ్డినీ "విరసం"లో పెద్ద స్థానాలలో ఉంచవద్దని జ్వాలాముఖికి రాశాను ఆ ఉత్తరం అందలేదా ? విరసం, అరసం వాసన కొట్టటం అంత మంచిది కాదు దిగంబర కవులకూ, తిరగబడు కవులకూ ప్రముఖ స్థానం ఉండాలి మమ్మల్ని కార్యవర్గ సభ్యులుగా ఉంచుకుంటే సరిపోతుంది ఈ విషయం శ్రీశ్రీకీ, రమణారెడ్డికీ తట్టినట్టులేదు కొంచెం ఆలోచించండి

నాకు ఆంధ్రజ్యోతి దినపత్రిక మామూలుగా వస్తుంది గాని ఈసారి ఆది, సోమ వారాల పత్రికలు ఎందుకో రాలేదు మంగళవారంది వచ్చింది ఆంధ్ర పత్రికగాని, ప్రభగాని నాకు అందదు మీరు పంపే కటింగ్స్ చూసి వివరాలు తెలుసుకుంటాను

ప్రణాళిక కట్టుదిట్టంగా తయారు చెయ్యండి అందరినీ అడిగానని చెప్పండి తెలుగు వెలుగులో మీ స్టేట్‌మెంటు - open letter - మూడు భాగాలూ చదివాను చాలా correct గా ఉన్నది అది కరపత్రంగా వెలువడితే చాలామంది educate అవుతారు ఉంటాను

*

21-7-70

నమస్కారాలు మీరు పంపిన కథా, ఉత్తరమూ అందాయి నిన్న కథ ఇవాళ చదివాను యువలో ప్రచురించటానికి అభ్యంతరం ఉండదనుకుంటాను కాకపోతే ఆగస్టు సంచికలో పడదు దానికి కథలు అదివరకే బొమ్మలు వెయ్యటానికి పంపాం

ప్రజాశక్తిలో మోటూరి వారి తొలి వ్యాసం చూసి ఉత్తరం కూడా రాశాను వారా ఉత్తరాన్ని publish చేస్తారో లేదో తెలీదు విశాలాంధ్ర కటింగు కూడా తుమ్మల పంపారు దానికీ సమాధానం తుమ్మలకు personal గా రాశాను

చలసాని ప్రసాద్‌గాని, కె వి గాని నాకు మీటింగు గురించి ఏమీ రాయలేదు నేను 'తెలుగు సాహిత్యంలో కొత్త పద్ధతి' అని ప్రజాశక్తికి వ్యాసం పంపితే దాన్ని త్రిప్పి పంపారు ప్రభంజనానికి పంపాను అదిగాక, వరవరరావు సృజనకు అడిగితే ఒక వ్యాసం పంపాను

ఏమైనా కొంత సంచలనం కలిగింది అది మంచిదే ఈ విప్లవోద్యమం సాగించటం విషయంలో నాకు తొందర అవసరం అనిపించటం లేదు అంతకన్నా ముఖ్యమైనదేమంటే మన చిన్న గ్రూప్‌లో మౌలికమైన స్వల్ప అభిప్రాయ భేదాలుంటే వాటిని సరిచేసుకోవటం అవసరం అందుకు బెజవాడలో ఆగస్టు మొదటివారంలో కలుసుకోవాలన్నారు ఆ ప్రయత్నం ఏమైందీ మళ్ళీ తెలియలేదు రా వి శాస్త్రిగారు సంతకం చేసిన కాగితం (తీర్మానం) నా దగ్గిరికి సంతకానికి వస్తుందన్నారు అదీ రాలేదు

కె వి రమణారెడ్డిగారికి కొన్ని రిజర్వేషన్సు ఉండవచ్చు రా వి శాస్త్రిగారికీ ఉండవచ్చు అవేమిటో మనకు తెలియాలి

నక్సలైటు ఉద్యమం సాగిస్తున్నది తిరుగుబాటు మాత్రమేననీ, అలాంటి తిరుగుబాట్ల ప్రాతిపదిక మీదనే విప్లవాలు వస్తాయనీ నా నమ్మకం సాహిత్యోద్యమం రాజకీయోద్యమాల వెనక నడవరాదనీ, జీవితం వెంబడి నడవాలనీ నా విశ్వాసం ఒకప్పుడు నాకు కమ్యూనిస్టు పార్టీలో విశ్వాసం ఉండేది ఇవాళ ఉన్న మూడు కమ్యూనిస్టు పార్టీలలో దేని ఆశయం ఏమిటో నాకు తెలియటం లేదు ఇది నా అవగాహనలో తప్పే కావచ్చు నక్సలైట్లు కలకత్తాలో ఏం చేస్తున్నారో, వాళ్ళు మిగతా వాళ్ళందరినీ వదలిపెట్టి మార్క్సిస్టులను ఎందుకు చంపుతున్నారో నాకర్థం కాలేదు మన రాజకీయాలలో బోలెడంత rightism ఉన్నది Leftism ని అణగదొక్కటానికి అది ఏనాడన్నా ఏకం కాగలదు సిద్ధాంత విభేదాలను అడ్డంపెట్టుకుని ముక్కలు చెక్కలైన కమ్యూనిస్టులు ప్రజలకు దూరమైనారు కాని నక్సల్బరీలోనూ, ఇప్పుడు శ్రీకాకుళంలోనూ, ఇతర చోట్లా జరిగే agrarian revolts ను అర్థం చేసుకోగలను ప్రజలన్నా అర్థమవుతారుగాని పొలిటీషియన్లు అర్థమయ్యేటట్టు లేరు

రాజకీయ అవగాహనలలో వ్యత్యాసాలుండటం సాహిత్యోద్యమానికి మంచిది కాదు అందుచేత ఎవరి mental reservations వారు దాపరికం లేకుండా చెప్పుకుని, ఒకరి అవగాహనని మరొకరు సంస్కరించుకోవటం కూడా ఎంతో అవసరం అనుకుంటున్నాను ఉంటాను

❋

23-1-71

నిన్నటి ఉత్తరం అందింది

శ్రీశ్రీ 13, 14 తరవాత నన్ను కలవలేదు నాకు శ్రీశ్రీ తగలటం చాలా అరుదుగానే ఉంటున్నది దూడ గుంజ నుంచి బర్రె గుంజ దాకా అన్నట్టు నా జీవితం ఆఫీసుకూ, ఇంటికీ మధ్య తిరుగుతున్నది ఎప్పుడన్నా శ్రీశ్రీ కనిపిస్తే మెరుపు మెరిసినట్టు అరక్షణం కనిపించి మాయమవుతాడు

విరసం తీర్మానాలు బాగున్నాయి వీటిని మద్రాసు Hindu లో వెయ్యరు లాగుంది మిగిలిన పత్రికలేవీ నాకు రావు

విరసం All India basis మీద రావటానికి కృషి చేసే అవకాశాలుంటాయా ? జిల్లాల వారీగా organise కావటంతో బాటు, దేశం మొత్తంమీద, ముఖ్యంగా key centres లో ఏర్పడటం ఎంతో అవసరం

కథానికలు ఎప్పుడివ్వమంటే అప్పుడు అచ్చుకివ్వవచ్చు నా ఆలస్యం ఏమీ ఉండదు ఇన్ని పేజీలు అనుకోవటం ముఖ్యం ధనికొండ pressలోనే వేయిద్దాం ప్రభంజనం press వాళ్ళు కూడా work అడుగుతున్నారు కానీ అక్కడ పేపరు దొరకదు Proof reading కష్టమవుతుంది

కాళీపట్నం కథలు పూర్తి కావచ్చింది  శ్రీశ్రీ proofలు చూసినా అనేక తప్పులున్నాయి ఇలా అవుతుందని తెలిస్తే నేనే చూసి ఉందును

విశాఖకు తప్పక పోదామని అనుకున్నాను కానీ, ఇక్కడ నా పరిస్థితి అన్ని విధాలా అననుకూలంగానే ఉంటున్నది  ఉంటాను

❋

30-3-71

మీ ఉత్తరం అందింది  Cuttings చూశాను  శ్రీశ్రీతో Telephone లో మాట్లాడాను ఈ ప్రభుత్వానికి ప్రజలు mandate ఇచ్చింది నగ్నంగా బయటికి రావటానికే లాగుంది  ఝుంఝు popularity చూసి బేజారెత్తి ఉంటారు  "మార్చ్" ban చేసినప్పుడే చాలు పడుతున్నది అనుకున్నాను  ఈ ఎత్తు సాగనిస్తే వీళ్ళు ఫాసిజం కక్కి తీరుతారు  కాని దాన్ని సాగనివ్వని sections చాలా ఉన్నాయి  వాళ్ళందరినీ కూడగట్టుకుని fight చెయ్యాలి

Defence fund కు డబ్బు రెండు మూడు రోజుల్లో పంపుతాను

ఈ నెలాఖరుకు ఇక్కడ చిన్న meeting పెట్టి 'మార్చ్' గురించి press కు చెబుదామంటున్నాడు శ్రీశ్రీ  రాజమన్నారుగారు కూడా సంతకం చేశాడట  50 సంతకాలు పోగయ్యాయట  ఇంకా ఎక్కువ సంతకాలే పోగయి ఉండును  నేను తిరగటానికి బొత్తిగా పనికిరాని వాణ్ణి అయిపోయాను  శ్రీశ్రీ ఒంటరిగా తిరగవలసి వచ్చింది

Govt ఏం చేసినా ఆశ్చర్యపడే సమస్య లేదు  వాళ్ళు ఎంత దూరం వెళ్ళటానికి సాహసించారో తెలుసుకుని దానికి అనుగుణంగా మూవ్ కావటమే మన కర్తవ్యం

రెండో ప్రపంచ యుద్ధం మధ్యలో చాప్లిన్ Great Director రిలీజయింది  అందులో చాప్లిన్ యుద్ధం చెయ్యవద్దని సైనికులను హెచ్చరిస్తూ పెద్ద speech చెబుతాడు  దాన్ని ఆ యుద్ధం మధ్య కూడా ఎవరూ ban చెయ్యలేదు  ఝుంఝు AP వాళ్ళకి పచ్చి వెలక్కాయ అయిందా ?  ఉంటాను

❋

7-8-71

శ్రీమతి యామినికి,

అమ్మా,

నిఖిలేశ్వర్ మొదలైనవారి అరెస్టు గురించి మాకు 3వ తేదీనే తెలిసింది  మర్నాడు పత్రికలలో వార్త వచ్చింది  ఇందువల్ల మీ కుటుంబాలకు కలిగే సంతాపాన్ని మేము కూడా పంచుకుంటున్నాము  ఈ అరెస్టులు చాలా అక్రమమైనవని మా అందరి ఉద్దేశం  నేనూ, శ్రీశ్రీగారూ పత్రికకు ఉత్తరం రాశాము  కాని ఆ పత్రిక ఇప్పటి వరకూ దాన్ని ప్రచురించలేదు రేపు ఒక తీర్మానం తయారుచేసి అనేకమంది రచయితలచేత సంతకాలు చేయించి ప్రభుత్వానికీ,

పత్రికలకూ పంపబోతున్నాము ఆంధ్ర ప్రభుత్వం ఈ కవులను విడిచిపెట్టే దాకా దేశంలో ఆందోళన సాగి తీరుతుంది మీరంతా ధైర్యంగా ఉండాలని నా కోరిక ఇవి పాపిష్టి రోజులు నిజం నిర్భయంగా చెప్పేవారికి శాంతి ఉండదు ఈ సంగతి మీకందరికీ నేను వేరే చెప్పనవసరం లేదు హైదరాబాదులో మీటింగులు జరిగి, ఈ అరెస్టులను గురించి తీర్మానాలు చేసేటప్పుడు అలాంటి మీటింగులకు మీరు కూడా హాజరు కావటం మంచిదని నేను అనుకుంటున్నాను ఏమైనా మీరు ధైర్యంగా ఉండాలి పత్రికల వాళ్ళలాగా మేము చూస్తూ ఊరుకోము

*

24-3-72

*Dear Nikhil,*

నమస్కారం మొన్నటి కార్డు అందింది జయప్రద కాపీ కూడా ఇప్పుడే అందింది ఇలాంటి విమర్శలు విరసం మీద ఎందుకు వస్తాయో నేను అదివరకే చాలాసార్లు స్పష్టం చేశాను కొందరు రాజకీయ చైతన్యం గల యువకులు విప్లవం ద్వారా రాదగిన ఫలితాలు విప్లవసాహిత్యం ద్వారా రావాలని తొందరపడుతున్నారు విరసాన్ని విమర్శిస్తున్నారు వారి ఉద్రేకాన్ని అర్థం చేసుకోవచ్చు కాని వారి వాదనలను అర్థం చేసుకోవటం కష్టంగా ఉన్నది విప్లవ సాహిత్యోద్యమం ఒకరి బాబుగాడి సొమ్ముకాదు ఇందులో కొందరు నాయకులనీ, మిగిలినవాళ్లు followers అనీ నేను ఏనాడూ ఆమోదించలేదు ఇంకో రెండు రోజులలో విప్లవం రాబోతున్నదన్నట్టుగా గేయాలు రాసినా వారిని ఎవరూ వెనక్కు లాగలేదు ఇప్పుడు వస్తున్న విరసం సాహిత్యం పరాకాష్ఠ అందుకున్నదని ఎవరూ అనలేదు ఉద్యమం పైకి వెళ్ళటానికి గాని ముందుకి వెళ్ళటానికిగాని నాకు తెలిసి ఎవరూ అడ్డు పుల్లలు వెయ్యలేదు విశాఖ విద్యార్థులు ఎవరిని దేనికి తప్పుపట్టుతున్నట్టు ? ప్రజలలోకి వెళ్ళే సాహిత్య రూపాలు రావాలనీ, ప్రజలనుంచే విప్లవ రచయితలు రావాలనీ ఖమ్మం సభలో స్పష్టంగా అనుకున్నామే ! వచ్చే విప్లవ సాహిత్యాన్నీ, మామూలు సాహిత్యాన్ని కూడా విమర్శించవలసి ఉంటుందని విశాఖ రచయితలకు ఏనాడో చెప్పాను దాన్ని వాళ్ళు ఆచరించే ప్రయత్నంలో ఉన్నట్టు కూడా విన్నాను

ఇప్పుడు వస్తున్న విమర్శల వెనకాల ఉన్న వ్యక్తులు పాణిగ్రాహి పాటలను విప్లవ సాహిత్యం కింద పరిగణిస్తారా ? మావో గేయాలను విప్లవ సాహిత్యం కింద ఆమోదిస్తారా? "మంచు" అన్న గేయం మావో రాసిన ఉత్కృష్ట గేయం అంటారు దాన్ని చూసి మన విమర్శకులు ఏమంటారు ? మావో కవిత్వం నిండా classical references ఉన్నాయి వీళ్ళు మన భారతం నుంచి పద్యం ఉదహరించనియ్యరు ! గతంతో పూర్తిగా తెగతెంపులు చేసుకుంటేగాని విప్లవ సాహిత్యం కాదన్న నమ్మకం ఉన్నవాళ్ళు విమర్శకులుగా చలామణీ అవుతున్నారు

కొన్ని statements జయప్రదలో ఇలా ఉన్నాయి

"ఆ విధంగా (ఆంతరంగిక పోరాటం ఇంకా తీవ్రస్థాయిలో కొనసాగించటం ద్వారా) విప్లవ పోరాటంలో రచయిత పాత్ర ఏమిటో ఎంతో స్పష్టంగా నిర్ణయించగల్గుతాము " ప్రత్యక్ష విప్లవ పోరాటంలో రచయిత పాత్ర ఏమిటి ? రచయిత పాత్ర ఏదన్నా ఉంటే విప్లవానికి ముందే ఉండాలి రచయిత కూడా విప్లవంలో పాల్గొనవచ్చు - రచయితగా కాదు, విప్లవకారుడుగా

" బూర్జువా భావవాద విశృంఖలాలను బ్రద్దలు చేసిన శ్రామిక వర్గ మేధావులు ఉద్భవించనున్నారని భ్రమసి మురిసిపోయాము "

శ్రామిక వర్గ మేధావులను 20 మాసాలలో ఉద్భవింపజేసే శక్తి విరసానికి ఉన్నదన్న విశ్వాసాన్ని ఎవరు ప్రచారం చేశారు ? ఆ ప్రచారాన్ని నమ్మినవాళ్ళు ఎంతటి మేధావులు? కళాకారులు శ్రామికవర్గం నుండి రానవసరం లేకుండా అభ్యుదయ సాహిత్యోద్యమం కూడా సాగింది కాని విప్లవసాహిత్యోద్యమం సాగదు కాని వాళ్ళు రావటానికి అవకాశాలు లేకుండా చేసిన వారుంటే వారిని విమర్శించవచ్చు శ్రామిక వర్గ మేధావులు ముందుకు రానందుకు ఎవరినని తిట్టాలి ?

"యివన్నీ (?) విరసం రంగు మార్చకుండా దిక్కు మార్పించేందుకే ముందుకు తోసుకు వస్తున్నాయని మీరు యింకా గమనించలేదా ?" ఇది రాజకీయ పరిభాష కాదా ? విరసాన్ని "దిక్కు మార్చే" కర్తవ్యాలు ఏవి ? వాటిని ఎందుకు తూర్పారబట్టకూడదు ?

"విప్లవ ఆచరణ అంటే భయమూ, విప్లవ ఆచరణ పట్ల అలక్ష్యమూ, యధాపూర్వ స్థితి మీద మక్కువ - యివి మీ వాదనల్లో, సూత్రీకరణల్లో కొట్టవచ్చినట్లగుపించటం లేదా?" Keyword విప్లవ ఆచరణ ! విరసం సాహిత్య ఉద్యమం అన్న ఆలోచనే లేదు

"ఎంతటి సుదీర్ఘ విప్లవ చరిత్ర గలవాడైనా అన్యవర్గభావజాల బలం నుండి, తన ఆలోచన పైన దాని ప్రభావం నుండి తనను తాను కాపాడుకోవడం విప్లవకారునికి ఒక జీవితకాలపు పోరాటం అన్యవర్గ ప్రభావానికి నేను సదా అతీతుణ్ణి అని చెప్పేవాడూ, అట్టి ప్రమాదం నుండి అప్రమత్తతతో ఎప్పటికప్పుడు తన్ను తాను శుద్ధి చేసుకోడానికి బుద్ధిపూర్వకంగా ఎల్లకాలమూ నిరాకరించేవాడూ (ఇక్కడ రెండు రకాల లుచ్ఛాలున్నట్టు కనిపిస్తుంది !) విప్లవకారుడూ కాడు, మార్క్సిస్టు కాడు, శుద్ధ డాంబికుడు లేదా వర్గ ద్రోహి మాత్రమే ! ఇది నిజం కాకపోతే కృశ్చేవ్‌లూ, లీ-షావ్‌చీలూ, శ్రీపాద డాంగేలూ (అందరూ రాజకీయవాదులే !) చరిత్రకు దొరికేవారే కాదు " విరసం మీద చేసే విమర్శలో ఈ మాటలకు గల స్థానం ఏమిటి?

ఈ వ్యాసమంతా ఇలాగే ఉన్నది అయోమయం జాస్తి, ఇంకొకరి మార్క్సిస్టు వివేచనను గురించి ఊకదంపుడుకు దిగే వాళ్ళకు ఆవేశం తప్ప మార్క్సిస్టు అవగాహన లేకపోతే ఆ ఊక దంపుడును serious గా తీసుకోవటం నాకు తలనొప్పి ఆవేశం తన్నినప్పుడల్లా ఊరూ పేరూ లేకుండా ఏ పత్రికనో ఖరాబు చెయ్యటమూ, దానికి మనం సమాధానాలిచ్చుకోవటమూ - ఇది విరసానికే అయుక్షీణం

విరసం స్వరూపాన్నీ, విప్లవ రచయితల కర్తవ్యాన్నీ నిరూపించటానికి చాలామందిమి చాలా రాస్తున్నాం ఇందులో తప్పులు రావచ్చు వాటిని గురించి కూర్చుని చర్చించాలి గాని, general గా ఆకుకు అందకుండా పోకకు పొందకుండా అవాకులూ చవాకులూ రాసుకుంటూపోతే ఉన్న తప్పులు సరి అవుతాయా ? సమస్యలు పరిష్కారమవుతాయా ? ఈ విశాఖ విద్యార్థులకూ విరసం పోకడకూ మధ్య ఏర్పడిన contradiction ఎలాంటిది ? జయప్రద వ్యాసం దాన్ని resolve చెయ్యటానికి తోడ్పడుతుందా ?

మీరంతా రాజకీయాలు ఏమీ తెలీనివాళ్ళు కారు సాహిత్యం తెలియనివాళ్ళూ కారు విమర్శ వచ్చినప్పుడల్లా panicky అయిపోకండి విమర్శ ఉపకరించేదిగా ఉన్నదా, వినాశనాత్మకంగా ఉన్నదా, కేవలం ఉన్మాదంగా ఉన్నదా అని ఆలోచించండి లోగడ తప్పులు జరిగి ఉంటే ఒప్పుకుని దిద్దుకుందాం లేకపోతే అవతలి వాళ్ళని సరిదిద్దుదాం చేసేది ఏమీలేదు విప్లవసాహిత్యం పసిగుడ్డు దానికి ఎంతో భవిష్యత్తు ఉన్నది ఆవగింజలో అరభాగం కాలేదు సుదర్శనం విరసం విరోధి ఆయన ఛాలెంజి నేను చూడలేదు ఉంటాను

PS ఇలాంటివి వచ్చినప్పుడు మీరు చర్చించి మీ అభిప్రాయాలు కూడా నాకు రాస్తే చాలా వీలుగా ఉంటుంది

❋

29-5-72

మీ ఉత్తరం అందింది ఇవాళే చెరబండరాజు నుంచి కూడా ఉత్తరం వచ్చింది జవాబు రాశాను ఇళ్ళ సోదాలు వార్త ఇక్కడి పత్రికల్లో వచ్చింది ఇ వీ గాలి నిషేధం వార్త Mailలో పడిందట ఇక్కడి ఇతర పత్రికలలో రాలేదు నిషేధం order stupid గా ఉంటే కోర్టుకు వెళ్ళే తీరాలి

విప్లవ వాస్తవికత మీద సృజనలో మీరు రాసింది ఇంతకుముందే చదివాను సృజన ఈ పూటే వచ్చింది దీనిమీద concrete గా, ఉదాహరణలతో సహా వ్యాసాలు రావాలి

మీ ఆక్షేపణ చూశాను నేను మామూలు మనుషులు అన్నది working class కాదు మధ్యతరగతిలో majority కే ఆ మాటలు వర్తిస్తాయి ముఖ్యంగా సాహిత్యం సంబంధించినంత వరకు నేనింకా masses ను పరిగణించటం లేదు

కాని నేను చెప్పినది కొంతవరకు masses కు కూడా వర్తించవచ్చునేమో Revolutionary massesకు కూడా leadership ఉండాలని Lenin చెప్పినట్టే, revolutionary literature కూడా అవసరమనుకుంటున్నాను చీనా revolution పూర్తి అయిన 20 ఏళ్ళకు Proletarian Culture Revolution అవసరమయిందంటే దాని అర్థమేమిటి ? ఆ సమయంలో literature ను కూడా attack చేశారు గద అందుచేత విప్లవ సాహిత్యం ఆవశ్యకత విప్లవంతో పోదు విప్లవ వాస్తవికత ప్రజలముందు తారట్లాడుతూ ఉండక తప్పదు Soviet Literature లో ఈ దృక్పథం లోపించిందనే నేను దాన్ని తెప్పించటం మానేశాను

కథలు రాయటం మానుకున్న సమయంలోనే ఈ పని చేశాను (1964-65) నేను రాస్తున్న కథల్లాగే Soviet కథలు కూడా గాలిలో తేలుతున్నట్టు కనపడ్డాయి అయినా మీ విమర్శ ఉపయోగకరమే ఉంటాను

*

22-9-72

నమస్కారాలు మీ కార్డులు రెండూ అందాయి C S Rao గారి కథలు ఇంకా నాకు అందలేదు అందితే వీలు చూసుకుని ఒక ముందుమాట రాస్తాను

మంచికో చెడుకో విరసం కార్యవర్గం విరసం సభ్యుల ప్రవర్తన నియమావళి ఒకటి తయారుచేసింది దీన్ని రేపు జనరల్ బాడీ ఏదో ఒక రూపంలో ఆమోదించే పక్షాన ఆ నియమావళిని ఆమోదించలేనివారు ఎలాగూ రాజీనామాలు ఇవ్వవలసి ఉంటుంది

నియమావళిని గురించి నేను తప్పు పట్టను కాని దాని ద్వారా విరసం ఉద్యమం మరింత ముందుకు పోయే దశ వచ్చిందని నేను నమ్మలేకుండా ఉన్నాను దీనివల్ల మేలుకన్న కీడు ఎక్కువ జరుగవచ్చునేమో కూడాను

అయితే నియమావళిని తయారు చేసినవారినీ తప్పుపట్టడానికి లేదు మార్క్సిస్టులమని చెప్పుకుంటూ విరసం సభ్యత్వం పుచ్చుకున్నవారు బహిరంగ జీవితంలో కూడా మార్క్సిస్టు వ్యతిరేక లక్షణాలను బాహాటంగా ప్రదర్శిస్తున్నారు బూర్జువా రచయితల విశృంఖలత్వం (వ్యక్తివాదం) విరసంలో కనబడటం అవాంఛనీయం "ఇపుడు వీస్తున్న గాలి"లో తమ కథను ఇవ్వటానికి శ్రీపతిగారు నిరాకరిస్తే అందుకు కారణం ఏమిటో నాకు ఎవరూ చెప్పలేకపోయారు బెజవాడ మీటింగులో నేను విరసం తరపున ఒక పబ్లికేషన్ - ఓ చిత్తుకాగితంలాంటిదే అయినా - తెద్దామంటే అందుకు అభ్యంతరం చెప్పినవారు rational గా ఏ కారణమూ చెప్పలేదు ఇటువంటి mental reservations సరి అయినవి కావు మరి

రావిశాస్త్రిగారి మాటకు వస్తే ఆయన తాను మార్క్సిస్టునని గట్టిగా చెప్పుకోలేదు ఆయన చాలా personal freedom కావలసిన రచయిత ఆయన ధోరణిలో ఆయన సామాజిక విప్లవాన్ని గట్టిగా బలపరుస్తాడు బూర్జువా సంస్కృతికి భవిష్యత్తు ఉన్నదన్న నమ్మకం లేనివాడు ఆయన రచనలలో కూడా అలాంటి నమ్మకం లేదు కాని ఆయన బూర్జువా, పోనీ పెటీ బూర్జువా లాంటి జీవితమే గడుపుతున్నాడు

ఈ నియమావళి రచనలకన్న రచయితల వ్యష్టి జీవితాలకు హెచ్చు ప్రాముఖ్యం ఇస్తుంది ఈ గీటురాయి లేకుండా విరసం సభ్యుల మీద శత్రువులో మిత్రులో ఆక్షేపణలు తెలిపినప్పుడు వారిని సంజాయిషీ అడగటమో, మందలించటమో చేస్తే పని జరిగిపోయేది రావిశాస్త్రిగారు రాజీనామా ఇవ్వదలిస్తే నేను వద్దనను లోగడ ఆయన రాజీనామా ఇచ్చినప్పుడు కూడా నేను ఆమోదించమనే సలహా ఇచ్చాను ఆయన చేత దాన్ని ఉపసంహరింపజేశారు

అందుకు ఇప్పుడు నొచ్చుకుంటున్నారు విరసం సభ్యుడైనా కాకపోయినా ఆయన రచనలలో మార్పు ఉండదు ఈ దెబ్బతో విరసం ఆర్గనైజేషను బతికిపోయేటట్టుంటే విప్లవ సాహిత్యం ఉద్యమం దెబ్బతిన్నా రచయితలను ఆశ్రయిస్తుంది అభ్యుదయ సాహిత్యం అలాగే అయింది కాని ఈ నియమావళిని కొంతకాలం వెనకపెట్టేటట్టు చూద్దాం ఉంటాను

❋

7-12-72

మీ 3 ఉత్తరం ఇప్పుడే అందింది. నా ఉద్దేశం ఈ ముల్కీ నిబంధనల ఆందోళన కాంగ్రెసు (ఇందిరా గ్రూపు) వేడుక రాజకీయం అనేక చావుబతుకు సమస్యలను వెనక్కి నెట్టి ప్రజల్ని గాడిదలు చెయ్యటానికి దీన్ని లేవదీశారని నా అనుమానం ఇటు ఆంధ్రులూ, అటు తెలంగాణా వాళ్ళూ ఉద్యోగాల కోసం కొట్లాడుకోవటం చూస్తే పులివిస్తరాకుల కోసం కుక్కలు కాట్లాడుకోవటం లాగున్నది చివరకు ఈ సమస్య ఎలా పరిష్కరించినా ఉద్యోగులకన్న నిరుద్యోగుల సంఖ్యే హెచ్చుగా ఉంటుంది వాళ్ళు ఏదన్నా చెయ్యబూనిన నాడు ఈ రాజకీయాలు ఎగిరిపోతాయి

"ప్రత్యేక తెలంగాణాలో ప్రజారాజ్యం" అన్న నినాదానికి concrete basis ఉన్నట్టు నాకు తోచదు అక్కడి జీవితంలో contradictions ఒకప్పుడు ప్రత్యేకంగా ఉండిన మాట నిజమే గాని, ఈ 16 ఏళ్ళ కాలంలో వాటి స్వరూప స్వభావాలలో చాలా మార్పు వచ్చింది ఈనాడు తెలంగాణా ప్రజా సమస్యకూ, ఇతర ప్రాంతాల ప్రజా సమస్యలకూ ప్రత్యేకమైన తేడా ఉన్నట్టు నాకు గోచరించలేదు తెలంగాణా కన్న వెనకబడిన ప్రాంతాలూ, బాగా ముందుకు వచ్చిన ప్రాంతాలూ కూడా ఉన్నాయి ఇంకా ఇతర మిత్రులు ఏమంటారో చూద్దాం ఉంటాను

❋

5-1-73

కా వ తీర్మానాలు చూశాను వాటిని గురించి నాకు ఆక్షేపణ ఏమీ లేదు కాకపోతే ఆంధ్రలో ఇప్పుడున్న తిరుగుబాటులో రాజకీయాలు ప్రవేశపెట్టగల పార్టీ ఏదో, ఇది విప్లవరూపం ఏ విధంగా సంపాదించుకుంటుందో నాకు అర్థం కాలేదు మొదటి తీర్మానం ఆంధ్ర విభజనను సమర్థిస్తున్నదని శ్రీశ్రీ ఆరోపణ ఆ తీర్మానాన్ని ఆధారం చేసుకుని విరసానికి రాజీనామా ఇస్తానని కూర్చున్నాడు ఇది కార్యవర్గ తీర్మానమే గనక ఆక్షేపణ తెలపమని సలహా ఇచ్చాను శ్రీశ్రీ award పుచ్చుకొనటానికే తీర్మానించాడు అతను award తీసుకోవటానికి personal గా నాకు అభ్యంతరం లేదు కాని మన వాళ్ళందరూ sentimental గా resent చేస్తున్నారు గనుక ఇది సమస్య కాబోతుంది ఉంటాను

❋

22-1-73

మీ కార్డు అందింది ఇప్పుడు ఆంధ్రలో కనిపించే చైతన్యం కాంగ్రెసుది కాదు ప్రజలదే ప్రజా చైతన్యాన్ని మనం పొరపాటున కూడా తిరస్కరించలేం విభజన జరిగేదాకా ఈ వేడి చల్లారదు ఇందులో నాకు కనిపిస్తున్న చిన్న మంచి ఏమిటంటే దీనివెంట తీవ్రమైన కాంగ్రెసు వ్యతిరేకతా, ఇందిరా ద్వేషమూ ఉన్నాయి కాని వాటిని ఉపయోగపరచుకునే రాజకీయ పక్షం కనిపించదు విభజన జరుగుతుందే అనుకుందాం అందుకు అవకాశాలు లేకపోలేదు తరువాత ఏమవుతుంది ? ఆంధ్రకు ముల్కీ బెడద ఉండదు ఆపైన ఇంకేమీ ఉండదు ఈ ఉద్యమం విప్లవానికి దారి తీస్తుందనుకున్న వారికి కనువిప్పు కలుగుతుంది ప్రజలు మళ్ళా నిద్రపోతారు

తెలంగాణా మళ్ళీ నాలుగు అడుగులు వెనక్కి వేయటానికి ప్రయత్నిస్తుంది “నీ బాన్చని, నీ కాల్మొక్కుతా” అన్నది పునరుద్ధరణ కావటానికి స్థానిక దేశముఖులు ప్రయత్నించి, ఫ్యూడలిజము జెండా ఎత్తుతారు కాని ఆ ప్రయత్నం సాగకుండా మార్వాడీ, గుజరాతీ, పార్సీ డబ్బు సంచులవాళ్ళు వచ్చిపడతారు వాళ్ళకి ముల్కీ రూల్సు అడ్డంరావు ఫ్యూడలిజం బూర్జువాలతో రాజీపడి తీరాలి కేంద్రం అందుకు సహాయపడుతుంది తెలంగాణా వేరు పడినా అది తిరిగి 1948 దశకు పోలేదు తెలంగాణాలో విప్లవ స్థావరాలు ఏర్పడకుండా కేంద్రం ప్రయత్నించగలదు వరంగల్లు వాళ్ళ అంచనాలో భ్రమ ఉన్నట్టు నాకు తోస్తుంది విరసం వంటి ఉద్యమం విప్లవోద్యమాలను నడపలేదు ఇంకెవరన్నా నడిపితే బలపరుస్తుంది

విశాలాంధ్ర ఏకంగా ఉండాలన్నది ప్రస్తుతం కాంగ్రెసు అధిష్ఠాన వర్గం నినాదంగానే మిగిలింది సరిహద్దుకు అటూ ఇటూ విభజన కాంగ్రెసు వాదులున్నారు ఇవాళ CPI ఏమంటున్నదన్నది లెక్కకు రాదు అది ఒక రాజకీయ పార్టీయే కాదు నేను చెప్పేదల్లా ఏమంటే, విభజన జరిగితే జరగనీ దాని ద్వారా ఒరగబోయేది ఏమీ ఉండదని తెలుసుకుని ఉండటం మంచిది

శ్రీశ్రీ విరసంకు సమస్య తెస్తాడనే అనుకుంటాను అందుకు కూడా సిద్ధంగా ఉండటం మంచిది శ్రీశ్రీ award తీసుకోవటాన్ని అందరూ తీవ్రంగా వ్యతిరేకించటంతో కోతి పుండు బ్రహ్మరాక్షసి అయింది Sartre తో శ్రీశ్రీని పోల్చి లాభం లేదు Nobel awards లో రాజకీయాలు ప్రవేశించాయి అకాడెమీ అవార్డ్సులో విరసంను బాధించే రాజకీయాలేమీ లేవు ఆస్థాన కవికి ఉండే బంధాలు దీనికి లేవు అయితే విశాఖ వాళ్ళంతా శ్రీశ్రీ డబ్బు పుచ్చుకోవటాన్ని ఘాటుగా నిరసిస్తున్నారు అందరి sentiment కు విరుద్ధంగా పోవద్దని నేను శ్రీశ్రీకి చెప్పాను ఒకవేళ శ్రీశ్రీ award తీసుకుని resign చేస్తే ఎవరూ guilt feel కావద్దు ఎప్పటికైనా విరసం కుర్రకారు చేతుల్లోకి పోవాలి అప్పుడు గాని అది ఎదగదు మీ భార్యకు ఇప్పుడు కులాసాగా ఉందనుకుంటాను ఉంటాను

*

17-3-73

మీ 15 ఉత్తరం అందింది శ్రీశ్రీ ప్రభుత్వం నుంచి పదవులూ, కితాబులూ పొందటానికి నేను వ్యతిరేకినే గాని, అవార్డు డబ్బు పుచ్చుకోవటానికి ఏనాడూ వ్యతిరేకిని కాను వ్యతిరేకులుగా ఉండిన వారు నన్ను మార్చలేకపోయారు అది విరసంకు దక్కితే నాకు రెట్టింపు సంతోషం అది ప్రజల డబ్బు దాని ఉపయోగం ప్రజలకు ఈ విధంగా ఉంటుంది బాంకుల నుంచి కొల్లగొట్టిన డబ్బును కూడా విరసం నిషేధించనవసరం లేదు బహుశ నేను జనరల్ బాడీ సమావేశానికి రాలేకపోతాను ఉంటాను

❋

29-3-73

మీ ఉత్తరమూ, రెండు పుస్తకాలూ ఇప్పుడే అందాయి ఇప్పుడే క్రాంతి ప్రెస్ వాళ్ళు సావనీర్ గురించి టెలిఫోన్ చేశారు ఏప్రిల్ 12 లోపల తయారు చెయ్యటానికి ప్రయత్నించమనీ, కిందటిసారి కన్న పెద్దది ఉండకపోవచ్చుననీ, ఎంత ఉండేదీ నాకు సరిగా తెలీదనీ అన్నాను

నేనుగాని, KVR గాని మార్క్సిస్టు వ్యతిరేకమైన అభిప్రాయాలు ప్రకటించి ఉంటే వాటిని ఖండించటం అవసరమే గద విరసం సమైక్యత కోసం వాటిని కప్పి పెట్టటం అనవసరం నన్నడిగితే విరసం చాలా విషయాలలో compromise అవుతూనే వస్తున్నది దీన్ని నడిపే అసలు వాళ్ళు ఇందులోకి రావాలని నేను మొదటినుంచీ చెబుతున్నాను ఆ ప్రచురణ దొరికితే నాకు చాలా ఉపయోగంగా ఉంటుంది వీలుంటే పంపండి ఉంటాను

❋

25-4-73

నేను తెనాలి రావటం సాధ్యం కాదు విరసం వర్తమానం గురించీ, భవిష్యత్తు గురించీ నా అభిప్రాయాలు తెలిసినవే నేను మార్క్సిస్టునని చెప్పుకుంటున్నాను గాని మార్క్సిస్టు లెనినిస్టును కాను అలాంటి వాళ్ళకు విరసంలో స్థానం ఉండేదీ లేనిదీ కాస్త స్పష్టంగా తేల్చుకోవటం మంచిది మార్క్సిస్టుగాకుండా నన్ను అనుమానితుల జాబితాలో చేర్చారు అందుచేత విరసం భవిష్యత్తు తేల్చటానికి మంచి మార్క్సిస్టులు ఉన్నారని ఆశించవచ్చును ఉంటాను

❋

30-4-73

మీ 27 ఉత్తరం ఇప్పుడే చూశాను నేను నిష్ఠూరంగా react కావటం లేదు నా కన్నా more radical views ఉన్న వాళ్ళను నేను ఎప్పుడూ అడ్డను ఈ సందర్భంలో వాళ్ళ views పని చెయ్యవని నాకు గట్టి నమ్మకం అయినప్పటికీ వాళ్ళకు అవకాశం ఇవ్వటం

న్యాయం ఇదే political organisation అయి ఉంటే వాళ్ళ 'left deviation' ను లేదా 'extremism' ను సిద్ధాంతపరంగానో, tactics దృష్ట్యానో ప్రతిఘటించి తీరాలి విరసంను party lines లోకి లాక్కుపోవాలన్న ప్రయత్నాన్ని నేను మొదటి నుంచి చూస్తూనే ఉన్నాను అందుకు నా అభ్యంతరాలేవో చాలాసార్లు చెప్పాను ఇప్పుడు కొత్తగా చెప్పేదేమీ లేదు ఆర్గనైజేషన్ దెబ్బతింటుందని భయపడటం అనవసరమని పిస్తుంది విప్లవ సాహిత్యోద్యమం కొనసాగి తీరుతుంది అది ఇంతకన్నా ఘన విజయం సంపాదించకపోవటానికి కారణం ఆర్గనైజేషన్ లోపం కాకపోవచ్చు ఈ సాహిత్యాన్ని ఆహ్వానించే మధ్య తరగతిలో విప్లవ చైతన్యం పరిమితంగా ఉండటం కావచ్చు ఈ పరిస్థితుల ప్రభావాన్ని కూడా పరిగణించాలి కదా మన విమర్శకులు పరిస్థితులను పరిగణించటమే లేదో, లేక అవి నేను అనుకునే దానికన్న విప్లవానికి బాగా అనుకూలంగా ఉన్నాయో ఈ మద్రాసులో కూర్చున్న నాకు తెలియటం సాధ్యం కాదు

విరసం భవిష్యత్తు నిర్ణయించేటప్పుడు radical views కలవారిది తప్పు అన్న presumption తో బయలుదేరవద్దు వాళ్ళ point of viewను బాగా చర్చించండి నా view point గురించి కొత్తగా చర్చించేది ఏమీ లేదు

విరసం దాని కాళ్ళ మీద అది నిలబడాలన్నది నిజం ప్రజలతో బాటు అది నడవాలి ప్రజలకు స్పష్టమైన విప్లవ నాయకత్వం లేని పరిస్థితిలో విరసంను ఎటు తిప్పి నిలబెట్టాలన్నది చర్చనీయాంశం దాని స్వేచ్ఛాగమనానికి హద్దులు నిర్ణయించాలి ఇప్పుడున్న హద్దులు కొందరికి నచ్చటం లేదు అదే సమస్య ఈ సంస్థ ఎవరి అధీనంలో ఉండాలన్న దృష్టి మనకు వద్దు ఎవరు దీని భవిష్యత్తుకు మంచి మార్గాలు చెప్పినా చెప్పవచ్చు

నేను విప్లవ సాహిత్యోద్యమానికి నూటికి నూరుపాళ్ళు కట్టుబడి ఉండగలను కాని polemics లోకి జొరబడను వాస్తవ పరిస్థితిని గుర్తించగలను దాన్ని నాకన్న బాగా అర్థం చేసుకున్నవాళ్ళుంటే గ్రహించగలను విరసం వ్యవహారం క్రైసిస్‌లో పడితే విరసం constitution మార్చండి హెచ్చుమంది నిర్ణయం సరి అయినది విరసం సభ్యులు మార్క్సిస్టు - లెనినిస్టులు అయి తీరాలని ఉంటే ఆ విషయం ప్రణాళికలో చేర్చి, అలాంటివారు కాని వారిని తొలగిపోనివ్వాలి సభ్యులు మార్క్సిస్టు - లెనినిస్టులు కారని తప్పుపట్టి లాభం ఏమిటి ?

నా point of view కొత్తది కాదు విరసం ప్రధానంగా సాహిత్యోద్యమం దీని లక్ష్యం సాయుధ విప్లవాలను సమర్థించటమూ, ప్రోత్సహించటమూనూ విప్లవ సాహిత్యం యొక్క ఆశయం ప్రజాజీవితంలో గల విప్లవ పరిస్థితిని అన్వేషించటమూ, విప్లవావకాశాలను వ్యక్తం చెయ్యటమూనూ విప్లవ రాజకీయ పార్టీ ఏదైనా ప్రజలను విప్లవోన్ముఖులను చెయ్యటానికి కృషి చేస్తుంటే దానితో విరసం తప్పనిసరిగా ఏకీభవిస్తుంది కాని ప్రజలు వదిలిపెట్టినా రాజకీయ పార్టీలను విరసం అంటిపెట్టుకుని ఉండటం అసంభావ్యం ఈనాటి పరిస్థితులలో ఏ రాజకీయ పార్టీనీ విరసం గుడ్డిగా అనుసరించనవసరం లేదని నా నమ్మకం అయితే ఇది చర్చనీయాంశం పై విషయాలలో నా ఉద్దేశం సరి అయినదని ఈ విషయం బల్ల గుద్ది

చెప్పలేను  మీటింగుకు నేను వచ్చినా ఇంతకన్నా చెప్పేది లేదు  నేను రావటం ఏ మాత్రం సాధ్యమైనా వచ్చి ఉందును  కాని సాధ్యం కాదు  ఉంటాను

PS మేధావిగా, మార్క్సిస్టుగా, కార్యవాదిగా త్రిపురనేని మధుసూదనరావు గారిలో నాకు చాలా విశ్వాసం ఉన్నది  అయన చెప్పేది అందరూ శ్రద్ధగా వింటారని ఆశిస్తున్నాను

❋

9-6-73

మీ PC అందింది  తెనాలి సభ గురించి కొద్దిగా తెలిసింది  విరసం కార్యదర్శి చీటికీమాటికీ మారటం బాగాలేదు  ఇప్పటికి నలుగురు అయారు  రాజకీయ ధోరణులు పైకి వచ్చినట్టు విన్నాను  అలా జరగకుండా చెయ్యటం కష్టమే  అందుకే మొదటి నుంచి మొత్తుకుంటూ వచ్చాను  అది నాకే ఎదురయింది  సృజన దృష్టిలో ప్రతి తిరుగుబాటూ విప్లవంలాగే ఉంది  తిరుగుబాటుకు నాయకత్వమూ, ప్రణాళికా, సైనిక సమీకరణలూ, ఎత్తుగడలూ, స్థావరాలూ ఏమీ అవసరం లేదు !  ఉంటాను

❋

5-4-74

నమస్కారం  మీ 2 ఉత్తరం చేరింది  విరసం కా వ సమావేశాలను నేను హాజరు కానప్పుడు వాటికి కట్టుబడి ఉండి తీర్మానాలు ఆమోదించటం నా విధి  అయినా తీర్మానాలను గురించి నా అభిప్రాయాలు అప్పుడప్పుడూ తెలియజేస్తూనే ఉన్నాను  అయితే, నాకు రాజకీయ పక్షపాతం లేని కారణం చేత ఆ తీర్మానాలలో సెక్టేరియన్ లక్షణాలు గమనించలేదు  తీర్మానాలు విరసం spirit కు అనుకూలమా కాదా అన్నంత వరకే చూస్తున్నాను  రాజకీయ పాక్షిక దృష్టితో చూస్తే గాని సెక్టేరియనిజం తట్టదేమో  కాకపోయినా, కా వ లో ఒకే రాజకీయ దృక్పథం గల వారిని ఉండనిచ్చి మిగిలిన వాళ్ళు తప్పుకున్న తరువాత ఇలాగే జరుగుతుంది గద  ఉంటాను

❋

21-12-74

మీ 20 ఉత్తరం ఇప్పుడే అందింది  డాక్టరుగారు నన్ను strain avoid చెయ్యమని మళ్ళా చెప్పారు  విరసం అంతర్గత రాజకీయాల వల్ల నష్టం గురించి నేను మొదటి నుంచీ warn చేస్తూనే వచ్చాను  విరసం పైకి వచ్చినా, అణగారి పోయినా అందులో నా ప్రమేయం ఏమీ లేదు  నా ఆరోగ్య పరిస్థితిని బట్టి నేను ప్రయాణ శ్రమ మానుకోవాలి  మానుకుంటున్నాను కూడా  అందుచేత నేను మహాసభకు రాను  ఉంటాను

❋

19-2-75

నమస్కారం మీ 16 ఉత్తరం, పుస్తకం అందాయి పుస్తకం తీరికగా చూస్తాను అనంతపురం వివరాలు చాలామంది రాశారు జనశక్తి కథనం అంతా చదివాను

మీ విజ్ఞప్తి పత్రాన్ని నేను అమోదించను చారు మజుందారు వర్గీయులు భావించినట్టుగా, అనంతపురంలో విరసం సంస్థ గొప్ప విజయాన్ని సాధించిందని నేను అనుకోవటం లేదు దెబ్బతిన్నదని కూడా అనుకుంటున్నాను దాని వెనుక విప్లవ రాజకీయ విభేదాలున్న మాట నిజం - కొందరు కాదన్నప్పటికీ

అంతమాత్రాన సాహిత్య రంగంలో రెండు విప్లవోద్యమాలు అనవసరం దానికి అర్థం కూడా లేదు విప్లవ సాహిత్యోద్యమంలోనే పోలరైజేషన్ జరిగిందన్నది నిజం కాదు చారు వర్గీయులు ఒక రకం విప్లవ సాహిత్యమూ, తద్వ్యతిరేకులు మరోరకం విప్లవ సాహిత్యమూ సృష్టించే సమస్య లేదు

విరసంకు 'ఉన్నత' లేక 'విస్తృత' ప్రాతిపదిక ఏర్పడటం విషయమైతే నేను ఆరంభం నుంచీ భేదించాను (మోటూరు హనుమంతరావు గారితో) విప్లవ సాహిత్యోద్యమం మంది నిర్వహించేది కాదు, దాని ప్రభావం మంది మీద ఉండాలి

అనంతపురంలో చారు ఫోటోల ప్రదర్శనలకూ, నినాదాలకూ outrage అయినవారు విప్లవ రాజకీయాల దృష్ట్యా చారు మార్గం అమోదించలేనివారేగాన్ని విప్లవ సాహిత్యానికి అందువల్ల నష్టం కలుగుతుందనుకున్న వారు కాదు చిత్రం ఏమిటంటే, విరసంను కబళించటానికి పొంచి కూర్చున్న ప్రభుత్వపు పులి చెయ్యని పనిని రాజీనామా లిచ్చినవారు చేశారు !

నేను ఆ సభకు వచ్చి ఉంటే చారు నినాదాలకు నేను అభ్యంతరం చెప్పి ఉండను అది సరి అయిన పంథా కాదని నాకు నమ్మకం ఉన్నది కాని దాన్ని అసలు విప్లవ పంథాయే కాదని నేను అనలేను అవి adventurism అయితే దాన్ని విమర్శించవలసినది (ప్రస్తుతం) విరసం వేదికమీద కాదు అని నా విశ్వాసం అనంతపురంలో నా విశ్వాసం రుజువైనట్టే కనిపిస్తుంది

నేను విరసం నుంచి resign చేసే సమస్య లేదు నన్ను ఉపాధ్యక్ష పదవి నుంచీ, వర్కింగు కమిటీ నుంచీ తీసెయ్యమని గుంటూరు నుంచీ అడుగుతున్నాను విప్లవ సాహిత్యోద్యమంలో కూడా నేను తటస్థుడి స్థానంలోనే ఉన్నాను

విరసం నుంచి బయటికి వచ్చిన వాళ్ళు విప్లవ సాహిత్యానికి వ్యక్తిగతంగా కృషి చేయాలని సలహా ఇస్తున్నాను జైరాంకు కూడా ఆ మాటే రాశాను విరసం సంస్థ తాత్కాలికంగా చారుగ్రూపు చేతిలోకి వచ్చినా విప్లవసాహిత్యం ఏ గ్రూపుకూ గుత్తకాదు, కాజాలదు విరసం సభ్యుడైనా కాని ఒక రచయిత చాలా చక్కని నవల రాశాడు ఇంకా అచ్చు కాలేదు ఉంటాను

❋

15-7-70

నమస్కారాలు మీరు 11న రాసిన ఉత్తరం ఇప్పుడే అందింది దానిమీద వైజాగ్ స్టాంప్ 13వ తేదీగలది అయినా నిన్న అందలేదు సెన్సారు జరిగితే జరిగిందేమో ! నాకు వచ్చే ఉత్తరాలలో రహస్య సందేశాలుంటాయనుకుంటే అనుకునే వాళ్ళ కర్మ ! శ్రీశ్రీనీ, రమణారెడ్డినీ, నన్నూ 'విరసం'లో ప్రముఖ స్థానాల్లో ఉంచితే 'అరసం' మారువేషం వేసుకుంటున్నట్టుంటుందనీ, మమ్మల్ని వర్కింగ్ కమిటీలో ఉంచుకుని యువకులను, ముఖ్యంగా విప్లవ, తిరుగుబాటు కవులను ప్రముఖంగా ఉంచమనీ 'జ్వాలాముఖి' కి 3నే రాశాను కాని నా సలహా ఎవరికీ నచ్చలేదు శ్రీశ్రీని అధ్యక్షుడిగానూ, నన్నూ, రాచకొండనూ ఉపాధ్యక్షులుగానూ, రమణారెడ్డిని కార్యదర్శిగానూ ఉంచాలన్న idea చలసాని ప్రసాద్‌గారిది లాగుంది నగ్నముని గురించి నాకేమీ తెలీదు

అగస్టు I week లో బెజవాడలో సమావేశం కావాలన్నది నేనూ విన్నాను

విరసం ప్రణాళిక నాక్కూడా సరిగ్గానే ఉన్నట్టు తోచింది రమణారెడ్డి సంశయాత్ముడై రాస్తే, కరెక్ట్‌గానే ఉన్నదని రాశాను విప్లవ రచయితల సంఘం political outlook ప్రణాళికలో చేర్చటంలో తప్పులేదు London writers' Manifesto గురించి నాకు తెలీదు మీరు draft తయారుచెయ్యండి Discuss చేద్దాం

ఇప్పుడు వచ్చే కవిత (తిరుగుబాటు cum విప్లవం) అంతా statementary, Faith రూపంలో ఉన్నది చదివేవాళ్ళని చైతన్యవంతులను చేస్తుందనటానికి సందేహం లేదు 'విద్యుల్లత' నేను సొంతం చదవలేదు

Fiction లో విప్లవ ధోరణి గురించి నాకూ సరిగా అవగాహన లేకుండా ఉన్నది రెండు పద్ధతులు అస్పష్టంగా గోచరిస్తున్నాయి 1) విప్లవ జీవితం తల ఎత్తినచోట ఉన్న వాస్తవ జీవితాన్ని కళాత్మకంగా చిత్రించటం 2) చౌకబారు (pseudo) అభ్యుదయ వాదులను debunk చేస్తూ రాయటం రెండో రకం రచనలు విప్లవోద్యమాలకు పరోక్షంగా సహాయపడగలవనుకుంటాను కనీసం సాహిత్యం ఒక అడుగు ముందుకు పోతుంది

"విప్లవాన్ని ప్రోత్సహించే వస్తువు" అన్నది ప్రస్తుతంలో అర్థంలేని మాటేమో ఇప్పుడు జరుగుతున్నవి తిరుగుబాట్లేనని నా భావం ఆ తిరుగుబాట్లకు ప్రాంతీయతత్వం పోయి, పీడితవర్గం దేశం అన్ని మూలలా తిరుగుబాటుకు రడీ అయిననాడు విప్లవం ఆ విప్లవం తప్పనిసరి అనీ, మార్గాంతరాలన్నీ మోసంతో కూడుకున్నవేననీ మనం గట్టిగా నమ్ముతున్నాం "విప్లవ" అన్న పదం చేర్చటంలో ముందుచూపు ఉన్నదని నేను అనుకుంటున్నాను

నా మరొక Stand point స్పష్టం చెయ్యాలి విప్లవ రచయితలు రాజకీయ పక్షాల కొంగుపట్టుకు తిరగటం లాభంలేదు నేను ఇన్నేళ్ళూ ప్రజలను దృష్టిలో పెట్టుకుని రాశానుగాని, అభ్యుదయ రచయితల సంఘం కమ్యూనిస్టు పార్టీని అనుకుని నిలబడ్డప్పుడు కూడా కమ్యూనిస్టు పార్టీకోసం రాయలేదు మనం రాసేది ఏ రాజకీయ పక్షమైనా ఆమోదిస్తే ఆ పక్షం సరియైన

దారిలో ఉన్నదనుకునేటంత అహంకారం నాకున్నది రాజకీయ దృక్పథం మాటకు వస్తే నాకీనాడు ఏ కమ్యూనిస్టు పార్టీ దృక్పథమూ పూర్తిగా అర్థం కావటం లేదు మార్క్సిస్టులు ఇంకా పదవులతో ఏం సాధిస్తామనుకుంటున్నారో తెలీదు నక్సలైట్‌లు మార్క్సిస్టులను ఎందుకు చంపుతున్నారో తెలీదు కాని శ్రీకాకుళంలో ప్రజలు ఎందుకు తిరగబడుతున్నారో, భూస్వాముల్ని ఎందుకు చంపుతున్నారో తెలుస్తున్నది

జీవిత వాస్తవాలు రోజు రోజుకూ కొత్తవి కనిపించటం లేదా ? అభ్యుదయ రచయితలు హైదరాబాదులో మనకు కొత్త సత్యాలను ప్రదర్శించలేదా ? అభ్యుదయ రచయితల సంఘం పెట్టిననాడున్నంత అమాయకంగా ఉందా ఈనాటి జీవితం - సాహిత్య దృష్టిలో చూసినా ? బాగా ఆలోచించండి, ఎప్పటికప్పుడు మొగ్గ తొడిగే సత్యాలను నిరూపించే విప్లవాన్ని దగ్గిర చెయ్యలేమా ? ఉంటాను

❋

18-9-70

నమస్కారాలు "భయం" చేరటంలో ఆలస్యం జరగలేదు వచ్చినది వచ్చినట్టుగానే ఆర్టిస్టుకిచ్చి బొమ్మలు వేయించి, ప్రెస్‌కు పంపవలసి వచ్చింది ఒకరోజు ముందువచ్చి వుంటే చదివి ఉండేవాణ్ణి యువకు బొమ్మలు వేసేవాళ్ళు free-lance లు మీ కథ కవరులో నుంచి తీస్తుండగా ఆర్టిస్టు వచ్చేశాడు కథ చదువుతూ కూర్చుంటే మరి మూడు నాలుగు రోజులదాకా ఆర్టిస్టు అందడు ఆ పరిస్థితిలో కథ ఇచ్చేశాను పోనీలెండి, ప్రూఫులు చూసేటప్పుడు చదువుతాను

విరసంకి తప్పక కథ రాయండి ఇప్పటికి 10 కథలు వచ్చాయి అన్నీ మంచి స్టాండర్డులో లేవు మీలాటివాళ్ళ కథలు పడితే సంకలనం తప్పక విజయవంతమవుతుంది దీన్ని విరసం సదస్సు నాటికి పుస్తకరూపంలో తెచ్చే ఆశ లేదు ఇప్పుడిప్పుడే కథలు వస్తున్నాయి వచ్చే సంఖ్యనుబట్టీ, మనం వేసే పుస్తకం ప్రమాణాన్ని బట్టే, అన్నీ వేయటమో, కొన్ని సెలెక్టు చేసి వేయటమో చూడాలి

రావిశాస్త్రిగారు కూడా ఒకటి రాస్తే బాగుంటుంది ఆయనకు శ్రీశ్రీ రాసినట్టుంది నేను కూడా ఇవాళ రాస్తున్నాను మీకు కనిపిస్తే మీరు కూడా చెప్పండి

శర్మ (పురాణంగారు) అప్పుడప్పుడూ ఉత్తరాలు రాస్తూనే ఉన్నారు మీ దగ్గిర గంపల కెత్తినట్టు matter ఉందిగదా, కథ రాయటానికి వెనకాడతారెందుకు ? ఉంటాను

*

22-1-75

నమస్కారాలు మీ 19 ఉత్తరం ఇప్పుడే అందింది అనంతపురం సభల అనంతరం నాకు KVR నుంచీ, ప్రొద్దుటూరు convenor VS Prasad నుంచీ ఉత్తరాలు వచ్చాయి KVR కొంత అయోమయంలో ఉన్నట్టు చెప్పారు ప్రొద్దుటూరు గ్రూప్‌కు అయోమయం ఏమీలేదు వాళ్ళు మజుందారు గ్రూపును (విరసంలో !) ఖండిస్తున్నారు KVR అంచనా ప్రకారం విరసం దెబ్బతినటానికి రెండు గ్రూపుల తప్పూ ఉన్నది ప్రసాద్ లెక్కన తమ గ్రూపు తప్పు లేదు వాళ్ళవల్ల కూడా తప్పు ఉన్నదని నేను సమాధానం రాశాను రాజకీయ పార్టీలకు విరసం అతీతంగా ఉండకపోవటం వాళ్ళవల్ల కూడా జరిగింది కిందటిసారి వాళ్ళు కూడబలుక్కుని కార్యవర్గాన్ని బాయ్‌కాట్ చేశారు చారు గ్రూపుకు పూర్తి ground వదిలేసి, వాళ్ళు dominate చేస్తున్నారని తప్పుపట్టి ఏం లాభం ?

అసలు రెండేళ్ళుగా విరసంలో సాహిత్య విమర్శకన్న రాజకీయ ఘర్షణ ఎక్కువగా లేదా ? చారు గ్రూపువాళ్ళు విప్లవ భారమంతా తమ భుజస్కంధాలమీదే ఉన్నట్టు నటించలేదా ? చారు విప్లవం చితికిపోయింది అందులో ఎత్తుగడలలో తప్పులుండవచ్చు కాని చారు వ్యతిరేక గ్రూపువాళ్ళు విప్లవ సాహిత్యంలోనే చారుమజుందారు సాహిత్యం అంటూ వంకలు పెట్టటం అవివేకం జీవితం నుంచి పుట్టే సాహిత్యంలో ఎత్తుగడలుండవు చివరకు విరసం

అడ్డు పెట్టుకుని వాళ్ళమీద వీళ్ళూ, వీళ్ళమీదవాళ్ళూ కసి తీర్చుకున్నారు ఇలా జరుగుతుందని విరసం పుట్టిన మర్నాడు నేను ఊహించి, హెచ్చరిస్తూ వచ్చాను కాని ప్రయోజనం లేకపోయింది అరసంలో నాకున్న అనుభవంతో నేను హెచ్చరించగలిగాను అరసం కమ్యూనిస్టు పార్టీ అండన సాగి, అది దెబ్బతినగానే దెబ్బతినింది ఈ అనుభవం లేకపోతే నేను హెచ్చరికలు చేసి ఉండకపోదును

ఇప్పుడు నా బోటివాడి పరిస్థితి ఏమిటో తెలియటం లేదు నేను విప్లవ సాహిత్యాన్ని సృష్టించలేను విరసం ఉద్యమం నాకళ్ళ ఎదుట నీరుగారిపోతుంటే ఆపలేకపోయాను

ఈ అగ్గి ఇంతటితో చల్లారదు నిన్న వచ్చిన 'పిలుపు'లో నాగిరెడ్డి మురాను attack చేస్తూ వ్యాసం ఉన్నది - విరసం సందర్భంగానే "పిలుపు" కనీసం రాజకీయ పత్రిక సాహిత్యపత్రిక అయిన "సృజన"లో ఏం వస్తుందో చూడాలి

నాగిరెడ్డి గ్రూపువాళ్ళు విరసం సంస్థను విధ్వంసం చెయ్యటానికి ప్రయత్నించారని ఆరోపణ ఉన్నది నిజానికి వాళ్ళు attack చేసింది విరసంలోని చారు గ్రూపునుగా కనబడుతుంది చారుగ్రూపు విప్లవ సాహిత్యోద్యమాన్ని గుత్త తీసుకుంటేనే ఆ ఆరోపణ నిజమవుతుంది ఇదంతా మీ బుద్ధికి ఎలా తోస్తున్నదో కాస్త సావధానంగా నాకు రాయండి నేను మాత్రం విరసం నడుము విరిగిందని భావిస్తున్నాను ఇలా అవుతుందని ముందే warn చేశాను ఉంటాను

❋

23-8-72

*ప్రియమైన చెరబండరాజుగారికి,*

నమస్కారాలు మీరు పంపిన సభ్యుల ప్రవర్తనా సూత్రాలు అందాయి అవి చాలా పకడ్బందీగా ఉన్నాయి సిద్ధాంత రీత్యా అటువంటివి చాలా అవసరం కూడా చిక్కువాటిని అమలుపరచటం దగ్గర వస్తుంది గనక, దాన్ని గురించి ఆలోచించటం అవసరం ఒకటి విమర్శ, రెండు ఆత్మ విమర్శ

**విమర్శ** ప్రతి ఒక్కరూ ప్రతి ఒక్కరిమీదా అంతో ఇంతో నిఘా ఉంచాలి విరసం శత్రువులు (లేదా, గాడిలో తప్పి మిత్రులే) ఏవో పుకార్లు లేవదీస్తారు (ఉదా నేను మా అమ్మాయికి మంత్రాల పెళ్ళి చేసానని !) నమ్మినవారు వాటిని నమ్ముతారు నమ్మనివారు అది నిజమోకాదో తేల్చడానికి ఉపక్రమిస్తారు విరసం ఇలాంటి వేటలో ఎంత లోతుకు పోవాలన్నది tactical గా నిర్ణయించుకోవాలి ఇది తప్పనిసరి ఎందుచేతనంటే సూత్రాలు ఏర్పాటు చేసి వాటిని గాలికి వదిలెయ్యడం చాలా ఘోరం అంతకన్న సూత్రాలు చెయ్యకపోవటం మేలు

**ఆత్మ విమర్శ :** శ్రీశ్రీ సినిమాలలో ఉండటమా ? మానటమా ? హాలీవుడ్‌లో పదిమంది కమ్యూనిస్టులు పనిచేసారు వారిని Un American activities వాళ్ళు వేటాడారు ఆ పదిమందిలో Albert Maltz లాంటి అద్భుత రచయితలున్నారు Maltz Mexico లో దాక్కుని కూడా నాకు తెలిసినమటుకు 3 హాలీవుడ్ చిత్రాలకు మారుపేరుతో script రాశాడు

నేను చందమామకు కథలు రాయటమా ? మానటమా ? (రాయటం కాదనుకోండి, తిరగరాయటం) అందులో దయ్యాల కథలుంటాయి జ్యోతిషం కథలుంటాయి, అప్పుడప్పుడు దేవుళ్ళ కథలు కూడా ఉంటాయి

**సంశయం** చీనా కమ్యూనిస్టులు అచ్చుగా దయ్యాల కథలే ఒక పుస్తకంగా ఎందుకు వేశారు ? వాళ్ళు Publish చేసిన Historical legends లో చచ్చిపోయినవాళ్ళ ఆత్మలూ, folk dictis మొదలైనవి ఎందుకున్నాయి ? మనం జానపద సాహిత్యాన్ని పూర్తిగా విడిచిపెడతామా ? మరో ప్రశ్న - నేను నాటకాలను గురించీ, సంగీతం గురించి రాయవచ్చా? శాస్త్రీయమైన వ్యాసాలు రాసినా వాటిని విప్లవ సాహిత్యోద్యమంలో ఎలా సమన్వయించడం?

**కర్తవ్యం :** మనం నిర్ణయించిన నియమాలకు విరుద్ధంగా వెళ్ళినవారిని విరసంలో ఉండనివ్వరాదు కాని లోగడ రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి రాజీనామాను మనం ఆయనచేత ఉపసంహరింపచేశాము అది పొరపాటే అనుకోవాలి అలాగే పైన చెప్పిన విమర్శల, ఆత్మ విమర్శల సారాంశం తేలినాక మాలో ఇంకా అనేకమందికి విరసంలో స్థానం లేకపోవచ్చు ఇలాంటి వాళ్ళు విరసంకు అనుకూలంగా రాసేది మాత్రమే స్వీకరించబడుతుంది ప్రవర్తనా నిబంధనావళి లేని కాలంలో రచనలకే ప్రాముఖ్యం ఉండేది ఇప్పుడు వ్యక్తులకూ, వారి ప్రవర్తనకూ కూడా ప్రాముఖ్యం ఏర్పడుతున్నది

రేపు నేనీ ఉద్యోగం మానుకోగానే నా పాత రచనలన్నీ సంపుటాలుగా వేసుకుందామనుకుంటున్నాను అదంతా విప్లవ సాహిత్యం కింద చేరదు గనక నేను విధిగా విరసం నుంచి వైదొలగవలసి వుంటుంది

ఇలాంటి సమస్యలు ఆచరణలో తప్పనిసరిగా ఉత్పన్నమవుతాయి గనక ఆచరణ గురించి ఆలోచించటం ప్రారంభించండి ప్రవర్తనా నియమావళి గురించి నాకు ఎలాంటి అభ్యంతరమూ లేదని మళ్ళీ స్పష్టం చేస్తున్నాను ఉంటాను

❋

19-9-72

నమస్కారాలు నేను తిరిగి విరాళాలు సంపాదించటానికి సాధ్యంకాదు నేను ఇవ్వగలది ఇస్తాను ప్రవర్తన నియమావళి గురించి నాకు KVR కూడ రెండు ఉత్తరాలు రాశారు కర్తవ్యం గురించి ఒకరి భావాలకూ మరొకరి భావాలకూ కొద్ది కొద్ది వ్యత్యాసాలు ఉండేటట్టు తోస్తుంది ఈ వ్యత్యాసాలను సరిచెయ్యటం అవసరం

వ్యక్తిగత బలహీనతలవల్ల సాహిత్యానికి నష్టంలేదు గదా అని నేను నియమావళి అమలుచేయనవసరం లేదు అని ఎన్నడూ అనలేదు వ్యక్తుల బలహీనతవల్ల ఉద్యమం దెబ్బతింటుందన్న భావం మీరు ప్రకటిస్తే అలాంటిది నాకు అనిపించలేదని చెప్పాను మీరు నాయకత్వానికి ఉద్యమంలో ప్రధాన పాత్ర యిస్తున్నారు లోగడ "నాయకుల" మీద వచ్చిన విమర్శలకు ప్రవర్తనా నియమావళి జవాబు అనుకుందాం ఇప్పటి పరిస్థితిలో ఈ నియమావళి ప్రకారం ఉన్నవాళ్ళు ఎందరు నిలుస్తారో ఆలోచించటం తప్పుకాదు అవసరం కూడానూ శ్రీశ్రీగారి విషయంలో కొన్ని పట్టింపులూ, మరొకరి విషయంలో మరికొన్ని పట్టింపులూ వదులుకొంటూ పోయి, కొందరి విషయంలో మాత్రమే గట్టిపట్టు పట్టి ఒక వంక నియమావళికి అవమానమూ, ఇంకోవంక పక్షపాతమూ చెయ్యటం ఏం బాగుంటుంది ?

నియమావళిని గురించి నాకేవో అనుమానాలున్నట్టు మీరు KVR కు రాశారట నియమావళి చాలా చక్కగా వున్నదనీ, దాన్ని గురించి సందేహాలుంటే ఆ సందేహాలు తెలిపే వాణ్ణేననీ, దాన్ని అమలు చెయ్యటం దగ్గరే సందేహాలు వొస్తాయనీ రాశాను Mao అన్నట్టు breakfast విందులకు వర్గశత్రువులందర్నీ చంపిపారేద్దామన్న తీర్మానం వరకూ బాగానే ఉంటుంది

తీరా ఆచరణ దగ్గరికి వచ్చేసరికి అనేక మినహాయింపులకు తలఒగ్గటమో, లేదా కొందరు సభ్యులను వెళ్ళగొట్టటమో జరగాలి ఒక్క సమావేశంలో అందరి లోపాలూ సూటిగా బయటపడతాయని నేను అనుకోను - ఒకరిమీద ఒకరికి స్పర్థలూ, కావేషాలూ ఉండి బయటపెడితే తప్ప ఒక వంక ఆదర్శవాద లక్ష్యంలేక పోవటమూ, మరొకవంక మనలో ఆదర్శ వాదపు అవశేషాలు పూర్తిగా పోకపోవటమూ మన ఉద్యమాన్ని దెబ్బతీసే ప్రమాదం ఉన్నది

మార్క్సిజంలాంటి శాస్త్రీయమైన తత్త్వం అర్థం కావటానికి మనిషిలో శాస్త్రీయ దృక్పథం చాలా ఉండాలి అది minimum అనుకుంటాను అది అలా ఉంచి మన సంస్థలో ఇంకా "కొవ్వు" చేరలేదు బక్కగానే ఉన్నది కీర్తికోసమూ, డబ్బు కోసమూ sabotage చెయ్యటానికి ఇందులోకి అవాంఛనీయులు ఎగబడినప్పుడు క్షాళనకూ, శస్త్రచికిత్సకూ సరియైన సమయం వొస్తుందనుకున్నాను అయితే timing విషయం నాకన్నా అక్కడ మీకే బాగా తెలియవచ్చు ఉంటాను

❋

18-4-74

మీ 16 ఉత్తరం ఇవాళ ఉదయం ఇంటివద్ద అందింది జార్జిరెడ్డీ, అశ్వినీకుమార్ మీకు తెలుసునన్నమాట ఈ దేశం ఈ పరిపాలన ఏ స్థాయిలో ఉన్నదీ కళ్ళు తెరిచి చూడగలవాళ్ళకు జార్జ్‌రెడ్డి హత్య ఒకటి చాలు కాని మన మధ్యతరగతి ఒకంతట కళ్ళు తెరవదు బెజవాడలో ఇందిరాగాంధీని చూడటానికి లక్షమంది ఎగబడ్డారు ఈ ఇందిరాగాంధీ యు పి లో ఎలెక్షన్ మీటింగ్‌లో మాట్లాడలేకపోయింది చెప్పులు పడ్డాయి

విద్యార్థులు తమకు సరిగా చదువురావటంలేదని ఎందుకు ఆందోళన పడుతున్నారు? సరిగా చదువు నేర్చుకుని ఏం చెయ్యబోతారు ? సైన్స్‌లో నోబెల్ లారియేట్‌లు శుంఠలు కావచ్చుగద ! Basic Science Marxism దాన్ని ఒక Philosophy గా జీవితంలో ఉపయోగించటం కూడా కష్టమే Subjective కూ objective కూ ఉండే contradiction ఒకంతట resolve కాదు ఒకప్పుడు ఎవరన్నా "రష్యాలో ఉంటే ఎంత బావుణ్ణు !" అంటే నాకు ఆ కోరిక అవాస్తవం అనిపించేది మరొక దేశంలో మనం ఏ పాత్ర నిర్వహించగలం ? ఏమీలేదు

ఏదో ideal life ఊహించుకుని, మన ఉన్న జీవితాన్ని చూసి అసహ్యపడటం వల్ల frustration ఎక్కువవుతుంది మామూలు జీవితం జీవించాలి పెళ్ళి చేసుకోవాలి, చదవాలి, ఉద్యోగాలు సంపాదించాలి ఉద్యోగాలు దొరక్కపోతే రాళ్ళు కొట్టినా అది నిజమైన జీవితమే అయితే కమ్యూనిస్టు తనకు అందుబాటులో ఉండే జీవితంతో తృప్తిపడడు, పడలేడు దాన్ని main stream లోకి తీసుకుపోవటానికి తనకు సాధ్యమైన కృషి చేస్తాడు నాకు మన జీవితాలలో కనిపించే main stream విప్లవం కొన్ని కోట్లమంది తమకు సాధ్యమైనట్టుగా చెయ్యివేస్తే విప్లవం వచ్చి తీరుతుంది కొందరు ఔత్సాహికులు తమ ఒక్కరిద్వారానే విప్లవం తెస్తామన్నంత ఆవేశం కనబరుస్తారు అది భ్రమ అనుకుంటాను మరికొందరు విప్లవం కావాలనుకుని కూడా, "మిగిలినవాళ్ళున్నారు గదా, నేను ఒక్కణ్ణి చేతులు కట్టుకుంటేనేం ?" అనుకుంటారు వాళ్ళు దొంగలు విప్లవానికి విరుద్ధంగా ఎంత చిన్న కృషిచేసేవాడైనా మూర్ఖుడే ఈ దేశంలో విప్లవం వస్తే నిజంగా హతమారిపోయేవాళ్ళు గట్టిగా ఒకరుండరు మిగిలిన 99మంది కీ విప్లవం మేలు చేస్తుంది

Leadership అందరికీ సాధ్యం కాదు సాధ్యమైనవాళ్ళకు అపాయం ఎక్కువ ఉన్నది అపాయాన్ని లక్ష్యపెట్టకపోవటం leadership లక్షణాలలో ప్రధానమైనది Communist కు జీవితంమీద ప్రేమ ఉండాలి కాని అది వ్యక్తిగతమైన జీవితంమీద కాదు సామాజిక జీవితం మీద కమ్యూనిస్టు మామూలు ప్రజలకు విలక్షణంగా బతకాలని కూడా కోరడు అలా కోరటం egotism అవుతుంది మీరు చెప్పిన Ayn Rand పుస్తకం నేను చదవలేదు

జీవితంలో fail అయి కమ్యూనిజం కేసి రావటంలో దోషమేమిటి ? out of darkness into light వెనకటికి oppressed classes కిరస్తానీ మతం పుచ్చుకుని ఉద్యోగాలూ

డబ్బూ సంపాదించుకున్నట్టుగా, కమ్యూనిస్టు అయి జీవితం చక్కబరచుకోవటం సాధ్యంకాదు Some came to communism by a long road కొందరు జీవితం పచ్చబడగానే మార్క్సుకు సలాంకొట్టి తిరోగమించటమూ కద్దు అటువంటివాళ్ళు ఉండరాదనుకుని ఏం లాభం ? ఉండి తీరుతారు ?

మీకు సాహిత్యం (కథలూ, నవలలూ) ఎక్కువ మేలు చేస్తాయనుకోను Leftist books చదవండి మామూలు జీవితం జీవించటానికి hesitate చెయ్యనవసరం లేదు ఏ ఉద్యోగం దొరికితే అది చేసి, mainstream మీదినుంచి మాత్రం దృష్టి తిప్పవద్దు ఉంటాను

❋

25-6-75

నమస్కారాలు మీ 23 ఉత్తరం ఇప్పుడే అందింది శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారి మీద మీరు పరిశోధన చెయ్యటం చాలామంచి సంగతి మీరు చెప్పినట్టు ఆయన వీరేశలింగంగారి దారిలో వాడు కావటంచేత ఆయనకు జాతీయోద్యమం పట్ల సానుభూతి లేదు కాంగ్రెసు రాజకీయాలు ఆయనకు సరిపడలేదు ఆయన దృష్టి సంస్కరణల మీద ఉండేది అంతేగాక ఆయన "వీరాంధ్రుడు" ఆయన హిందీ వ్యతిరేకతకు కొన్ని తగిన కారణాలున్నప్పటికీ, అన్ని కారణాలతోనూ నేను ఏకీభవించలేకపోయాను

శాస్త్రిగారు ఫ్యూడల్ సంస్కృతినుంచి వచ్చినవాడు ఆయన భాషలో చాలా భాగం ఆ సంస్కృతి ఉండేది ఫ్యూడల్ పాత్రలచేత ఆయన మాట్లాడించినట్టు మరెవరూ మాట్లాడించలేరనుకుంటాను ఆయన భాషలో మరొక రహస్యం "మీరింతమంచి తెలుగు ఎట్లా రాస్తారు ?" అని నేనడిగితే, "ఆడవాళ్ళు మాట్లాడుకునేటప్పుడు వినండి వాళ్ళనుంచి మనం భాష నేర్చుకోవాలి" అన్నారు

కథల గురించి ఆయన నన్నొక ప్రశ్న వేశారు "మీరందరూ ఇంత క్లుప్తంగా కథ ఎలా రాస్తారు ? నేను కథ మొదలుపెడితే 40 పేజీలదాకా సాగుతుంది" అన్నారు "మీ రచనలో టెక్నిక్ లోపించటంవల్లనేమో ?" అన్నాను ఈ సంగతి ఆయన మరో విధంగా కూడా రుజువు చేశారు నేను కథ పూర్తిగా ఆలోచించకుండా రచన ప్రారంభించనంటే, ఆయన తాము ఒక్క సంభాషణ తట్టగానే కథ ప్రారంభించిన విషయం చెప్పారు మనం "టెక్నిక్" అనేది ఆయన పాటించలేదు ఆయన దృష్టిలో రచన చెయ్యటమంటే ఒక విందుభోజనం సిద్ధం చెయ్యటంలాంటిది అందులో ప్రతి మాటా, ప్రతి వాక్యమూ, ప్రతి వివరమూ రుచ్యంగా ఉండాలి ఇది కూడా ఫ్యూడల్ సంస్కృతికి చెందిన దృక్పథమే అనుకుంటాను

శాస్త్రిగారు చిత్తశుద్ధిలేని రచనలు చెయ్యలేదు ఆ మాట రూఢిగా చెప్పగలను 1939-45 యుద్ధం వచ్చాక సాహిత్యంలో వచ్చిన మలుపులు శాస్త్రిగారి రచనలను పెడగా నెట్టేశాయని నా అనుమానం ఆయన సంఘసంస్కరణ కూడా వదిలేసి పాతకాలపు ఇతివృత్తాలను తీసుకున్నట్టు నాకు తోస్తుంది

("సాహిత్య ప్రయోజనం" నేను వేయించలేదు పుస్తకం నాకు అందేదాకా అందులో ఏ వ్యాసాలున్నాయో నాకు తెలీదు )

సుబ్రహ్మణ్యశాస్త్రిగారు పాఠకుడికి అంతా తానే చెబితే మల్లాదివారు పాఠకుడికి ఏదీ తెలియనిచ్చేవారు కారు పండిత సంప్రదాయంలోనే ఈ రెండు ధోరణులూనూ అయితే శాస్త్రిగారు పాఠకుడికి ఎప్పుడూ సన్నిహితంగా ఉండేవారు కాని పాఠకుడికన్న ఒక్క పిసరు ఎత్తున ఉండేవారు

అనేక వృత్తులవాళ్ళ జీవితమూ, వారి భాషా సాహిత్యంలో ప్రతిబింబించాలన్న ఉద్దేశంతో "దినచర్య" అనే శీర్షిక నడపమని ఒక పత్రికను హెచ్చరించి, దానికి మొదటి రచన - అది కథ కూడా కాదు నేనే రాశాను ఆ శీర్షికతో రెండో కథ పడనేలేదు నాది అరణ్య రోదనం

ఇంగ్లీషురాని కారణంచేత శాస్త్రిగారి రచనలకు నష్టం జరిగిందనుకోను "ఆంగ్ల మానసపుత్రులు" రాసిన సాహిత్యంకన్న ఆయనది చాలా విలువైనది, శాస్త్రిగారిది "కిరస్తానీ భాష" అన్నవారికి తెలుగురాదనుకోవాలి శివశంకరస్వామిగారు ఒకప్పుడు నాతో "సుబ్రహ్మణ్యశాస్త్రి అభిప్రాయాలు నాకు సరిపడవు కాని ఆయన ఏది రాసినా చదవబుద్ధి అవుతుంది ఆయన భాష అంత బాగుంటుంది" అన్నారు 1935 ప్రాంతంలో అయితే వ్యక్తిగతంగా శాస్త్రిగారికి కుండిన limitations వల్ల ఆయన రచనలు "పాతసాహిత్యం" కింద చేరిపోక తప్పదనుకుంటాను ఈనాటి చురుకైన సాహిత్యపు పోకడల బీజాలు కూడా అందులో దొరకటం కష్టమని నా అనుమానం "సముద్రంలోని మంచుకొండలు" నేను చదవలేదు

కాంగ్రెసు ఉద్యమాన్ని ఆదరించకపోవటం మాత్రమే శాస్త్రిగారి తప్పు కాదు నేనూ ఆ ఉద్యమాన్ని ఆదరణతో చూడలేదు కాని జాతీయోద్యమం ఒక చారిత్రక సత్యంగా కూడా శాస్త్రిగారు భావించలేదు అది తప్పే జాతీయోద్యమం ఇంకో విధంగా నడిచి ఉండాలనుకోవటం వేరు అది అసలు అవసరమే లేదనుకోవటం వేరు కాంగ్రెసు వ్యతిరేకత దగ్గిర మేమిద్దరమూ కలిశాం 1931 ఉద్యమాన్ని హేళన చేస్తూ నేనొక కథ రాస్తే భారతివారు తిప్పి పంపారు శాస్త్రిగారు దాన్ని ప్రబుద్ధాంధ్రలో వేశారు

శాస్త్రిగారు "ఏంటీనాచ్" కారు కొందరు ఉత్తమ వేశ్యల విషయం నాతో ఆయన చెప్పారు వేశ్యాకులం ఎందుకు పుట్టినదీ ఆయనకూ సరిగా తెలుసుననుకోను, ఆయనకు తెలిసినది ఫ్యూడల్ యుగంలో వేశ్యలు కళలకు ఆటపట్టుగా ఉన్నారనేదే ఫ్యూడల్ యుగం దాటిపోయాక వేశ్యలు సంఘానికి ఎలా చీడపురుగు లయారో ఆయన అంతగా పట్టించుకున్నట్టు లేదు

ఆయన హిందీ వ్యతిరేకతకు ముఖ్య కారణాలు నాకు తెలిసినవి రెండు సాహిత్యంలో హిందీ తెలుగుకన్న హెచ్చయినది కాదు, హిందీ వ్యామోహంతో తెలుగులో ఉత్తరం ముక్క రాయలేని తెలుగు కుర్రాళ్ళు వందల సంఖ్యలో హిందీ చదువులకు ఎగబడ్డారు ఉత్తర దేశంనుంచి ప్రచారకులు వచ్చి తెలుగు పట్టణాలలో చేరి వందలకొద్దీ విద్యార్థులను చేరదీసి వాళ్ళచేత హిందీ చదువులు చదివించటం చూసి ఆయనకు రక్తం ఉడికిపోయింది అది జాతీయోద్యమంలో అంతర్భాగంగా జరగటం కూడా ఆయనకు నచ్చకపోయి ఉండవచ్చు ఆయన వాదాలను చాలామంది serious గా తీసుకోలేదు హిందీభాష ఒక తీవ్ర సమస్యగా ఎవరూ అప్పట్లో భావించలేదు అందుచేత శాస్త్రిగారు ఒంటరిగా పోరాటం సాగించవలసి వచ్చింది ఖద్దరు కూడా హిందీలాగే జాతీయోద్యమంలో భాగం

చిన్నకథ ఒకే శిఖరంగల కొండలాంటిది నవల అనేక శిఖరాలు గల పర్వతం లాంటిది నవలకు "గమనం" ఉంటుంది పెద్ద కథ ఒకే కొండ అయినా ఉపశిఖరాలుంటాయి గమనం లేకపోయినా వ్యాప్తి వుంటుంది ఇది ఒక నిర్వచనం మాత్రమే అన్ని నవలలూ ఈ నిర్వచనానికి కట్టుబడవు ఒకే సంఘటన గల నవలలు ఇంగ్లీషులో వచ్చాయి ఉదా Old man & the Sea

శాస్త్రిగారి "వడ్లగింజలు" పెంచి రాసినది ఆంధ్ర పత్రికలో సీరియల్‌గా వేశాం అది నవలలాగే తయారైంది శాస్త్రిగారి రచనలకు చిన్న కథా పెద్ద కథా నవలా అన్న మాటలు వాడటం అనవసరమేమో వాటి శిల్పాలను ఆయన ఏనాడూ పట్టించుకోలేదు

'ఆత్మబలి' ప్రచురణ అయిన నాటికి నేను ఆంధ్ర వారపత్రిక వదిలేసి బొంబాయిలోనూ, సిమ్లాలోనూ ఉన్నాను నాకు దాని సంగతి ఏమీ తెలియదు తరవాతా పుస్తకంగా కూడా చూడలేదు

శాస్త్రిగారిని గురించి నాకు తెలిసినవీ, తోచినవీ రాశాను అవి మీకు ఎంతవరకు ఉపయోగపడతాయో చూడండి రచయితగా ఆయన "పండితుల" బంధాల నుంచి బయటపడ్డారుగాని, "సంస్కర్తల" దృక్పథం నుంచి బయటపడలేదని నా సందేహం ఉంటాను - (ఈ సిద్ధాంత వ్యాసకర్త 23-6-1975 న శ్రీపాదవారికీ కథాసాహిత్యానికీ సంబంధించిన పెక్కు విషయాలు చర్చిస్తూ లేఖద్వారా వెలిబుచ్చిన అభిప్రాయాలకూ, సందేహాలకూ శ్రీ కుటుంబరావుగారు వ్రాసిన సమాధాన లేఖ)

నా లేఖను మీ thesis లో యధేచ్ఛగా చేర్చుకోవచ్చు సమకాలీన సాహిత్యంలో వీరేశలింగంగారి పేరు ఎవరెవరు వాడుకున్నారో 'బంగోరె'కు తెలియనిది నాకు తెలియటం సాధ్యంకాదు వేదం వెంకట్రాయశాస్త్రిగారికి వీరేశలింగంగారంటే పడదనీ, ప్రతాపరుద్రీయంలో పిచ్చివాడిచేత "వీరణ్ణి రాగణ్ణి మన్ను చేయిస్తాన్" అనిపించటంలో "వీరడు" వీరేశలింగమనీ నా చిన్నతనంలో చెప్పుకోగా విన్నాను (రాగడు ఎవరో తెలీదు) అందరికన్న ముందు వీరేశలింగంగారి పాత్రను తమ రచనలో (తమిళంలో) ప్రవేశపెట్టినవారు సుబ్రహ్మణ్యభారతి అయి ఉంటారా ? కన్యాశుల్కంలో వీరయ్యపంతులు వీరేశలింగంగారు అయి ఉండవచ్చునే వీరేశలింగంగారి ఉద్యమంపట్ల గురజాడకు గురి లేకపోయినా ఆయనను బాగా ఎరుగును వారి ఇంట గురజాడ దిగటం కూడా జరిగింది రాయనం వెంకటశివుడుగారు వీరేశలింగంగారి శిష్యుడు శ్రీపాదవారు శిష్యుడు కాదేమో ఉంటాను

*

12-11-75

నమస్కారాలు మనిషి అనుభవం నుంచి నేర్చుకోవటం అరుదని చూపటానికే 'అనుభవం' రాశాను పెద్దవాళ్లు చిన్నవాళ్లను అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తారు కాని అర్థం చేసుకోలేరు అది 'అనుభవం'లోనే కనబడుతుంది చిన్నవాళ్లు పెద్దవాళ్లను అర్థం చేసుకునే ప్రయత్నం చెయ్యరు అందుకు కారణం వాళ్లకు క్రమంగా పెద్దవాళ్లతో అవసరం తీరిపోతుంది అదే సమయంలో పెద్దవాళ్లు చిన్నవాళ్లమీద ఆధారపడే పరిస్థితి ఏర్పడుతుంది

మన ఆచారాలలోను, విశ్వాసాలలోనూ ఆటవిక భావాలుమహారణ్యంలాగా వ్యాపించాయి వాటిని రచనలతో ధ్వంసం చెయ్యటం సాధ్యం కాదు కాని నిజం తెలిసి ఉంటే పరిస్థితులు అనుకూలించినప్పుడు మనుషులు వాటి నుంచి బయటపడే అవకాశం ఉంటుంది ఆలోచింపచెయ్యటమే రచయిత పని ఉంటాను

❋

28-3-80

నాపట్ల మీ అభిమానానికి కృతజ్ఞుణ్ణి నాకు గుండె దౌర్బల్యం ఉన్నది అందుకోసం చందమామలో నేను కూర్చునే సీటు మేడ మీది నుంచి కిందికి మార్చారు నెలకు 200/- రూపాయల మందులు మింగి ఆరోగ్యాన్ని ఒక పద్ధతిలో నిలుపుకుంటున్నాను అయినా మనిషి ఎంతకాలం బతికాడన్నది లెక్కకాదు, బతికిన కాలంలో ఏం చేశాడన్నది ఎక్కువ మంది ఆడవాళ్లు ఈ దేశంలోనే కాదు, ప్రపంచంలోనే,"నేను ఏం చేశాను ? ఏం సాధించాను ?" అని ప్రశ్నించుకోలేని స్థితిలో ఉండడమే శోచనీయం

కళాకారులను మన నుంచి వేరు చేయనవసరం లేదు వాళ్లలో మనందరి అంశా ఉంటుంది లేకపోతే మనం వాళ్లను ప్రేమించలేం ఏ కళాకారుడూ ఇంకో లోకం నుంచి ఊడిపడడు సమాజంలో ఉన్న శక్తులే వాళ్లలో పరాకాష్ఠకు వస్తాయి అందుచేతనే వాళ్లు సమాజం వాళ్లు, సమాజం వాళ్లది

మన తెలుగువాళ్లు సామాన్యంగా పుణ్యాల కోసం ఏ తిరపతో, రామేశ్వరమో వెళ్ళే దారిలో మద్రాసులో దిగి ఇక్కడి "వింతలు" చూసి ఇళ్లకు పోతారు ఈ కాలపు వింతలలో స్టూడియోలు, షూటింగు చూడటమూ ఉంటున్నాయి తమకు అభిమానం ఉన్నవాళ్లను చూడటానికి వచ్చే మగవాళ్లే చాలా తక్కువ ఆడవాళ్ల మాట చెప్పేదేమిటి?

❋

1975

నమస్కారం  ఇటీవల ఆంధ్రజ్యోతి వార పత్రికలో ధారావాహికంగా వచ్చిన "బ్రాహ్మణులు" అనే వ్యాసం మీరు 'బుక్స్ అండ్ బుక్స్' ద్వారా పుస్తకరూపంలో ప్రచురించుకోవచ్చును

నాకు ఏమీ పారితోషికం ఇవ్వనవసరం లేదు

('బ్రాహ్మణులు' బుక్స్ అండ్ బుక్స్ ప్రచురించలేదు  విజయవాడలోని సమతా ప్రచురణ సంస్థ ప్రచురించింది )

❋

10-11-79

నమస్కారం  శ్రీ రంగం నారాయణబాబును ఎప్పుడూ నేను నలుగురిలో కలిశానేగాని మా ఇద్దరికీ వ్యక్తిగతమైన చనువు లేదు  అందుచేత ఆయనకు సంబంధించిన anecdotes కూడా నాకు తెలీవు  కవిత్వం గురించి నేను ఎప్పుడూ పెద్దగా పట్టించుకోలేదు  నా దగ్గర అతనిది ఏ పుస్తకమూ ఎన్నడూ లేదు  మా మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు కూడా జరగలేదు

❋

మానేపల్లి రాసిన ప్రశ్న

"    టి యస్  ఇలియట్ రచనలు 15, 16 ఏళ్ళ క్రితం చదివి ముగ్ధుడినయా ఇప్పుడు    పూర్వపు ఆనందం పొందలేకపోతున్నానెందుకు ?

(31-7-1980)

కొ కు

మీ ప్రశ్నకు నేను సమాధానం ఎలా చెప్పగలను ? మీ అనుభవాన్ని మీరే విశ్లేషించుకోవాలి  ఏనాడో కాలేజీ రోజుల్లో చదివిన షేక్స్పియర్ నిజంగా అంత గొప్పగా రాశాడా అని, 30 ఏళ్ళ తరువాత మళ్ళీ చదివితే ఇంకా గొప్పగా రాశాడనిపించింది  ఇది నా అనుభవం

(4-8-1980)

❋

24-6-78

మీరడిగిన ప్రశ్నలకు సమాధానాలిస్తున్నాను అవి మీకు ఎంతవరకు తోడ్పడతాయో తెలీదు

ఒకటి — గొలుసుకట్టు నవల అన్న అభిప్రాయం నాది కాదు నాకు ఆ ప్రక్రియలో నమ్మకం లేదు స్నేహితుల ఒత్తిడితో, రేడియోవారి ప్రోద్బలంతో ఒప్పుకున్నాను ఆ నవలలను నేను చదవలేదు నా దగ్గిర లేవు

రెండు — గొలుసుకట్టు నవలలు బెంగాలీలో మొదట వచ్చాయని విన్నట్టు జ్ఞాపకం రూఢిగా చెప్పలేను అది వ్యాపార సంబంధమైన ఐడియా (ఉద్దేశం) అనుకుంటాను సాహిత్య ప్రక్రియగా దానికి విలువ వుండదని నా నమ్మకం

మూడు — కొందరు రచయిత్రులు ఒక గొలుసుకట్టు నవల రాసినట్టు గుర్తు

నాలుగు — తెలీదు

అయిదు — ఏ విధమైన ప్రయోజనాన్నీ సాధించలేదు కనీసం పాత్ర పోషణ అయినా సరిగా నిర్వహించబడదు

ఆరు — సరీగా నా అభిప్రాయం కూడా అదే

ఏడు — ఈ నవలలను ఆస్వాదించేవారు సాధారణంగా రచనలలో శిల్పమూ, పాత్రపోషణా, 'ఐక్యతా' (unity) లేని రచనలతో తృప్తి పడేవారై వుంటారు

ఎనిమిది — ఒక ఖండంలో పాత్రల సమగ్ర రూపమూ, పరిణామమూ చిత్రించడం బ్రహ్మదేవుడికి కూడా సాధ్యం కాదు

తొమ్మిది — గొలుసుకట్టు నవల రాసినవాళ్ళం స్థూలంగా కథా పరిణామం గురించి చర్చించుకోను కూడా లేదు

పది — నేను గొలుసు కట్టు నవలలు చదవని కారణం చేత ఏమీ చెప్పలేను

పదకొండు — నాకు వివరాలు గుర్తు లేవు

పన్నెండు — తొమ్మిది చూడండి

పదమూడు — కర్షకులూ, కార్మికులూ సామూహిక ఉత్పత్తి చేస్తారంటే అది కళా ప్రక్రియ కాదు కళలలో కూడా సామూహిక కృషికి అవకాశం వున్న మాట నిజం అయితే అది పరిశ్రమలో లాగా కాదు ఒక రచయిత చిత్రించిన జీవితాన్నీ, జీవిత సమస్యలను ఇతర రచయితలు ముందుకి తీసుకుపోవచ్చు రచయితల కృషి మేళవించడానికి బదులు వారి పరస్పర ప్రభావాలు మేళవించవచ్చు, లేదా వికటించవచ్చు ఆధునిక సాహిత్య చరిత్రలో రెండూ జరిగాయని నా నమ్మకం అయితే ఇందుకు ఉపయోగపడేవి సమ సంస్కారం, లేక వ్యతిరేక సంస్కారం

పద్నాలుగు — యధార్థ చిత్రణం సిద్ధించదు

పదిహేను — ఇతరుల సంగతి నాకు తెలియదు నేను నా వంతు రాసిన మరుక్షణం దాన్ని పూర్తిగా మర్చిపోయాను

('ఆదర్శ జీవులు' తెలుగులో తొలి గొలుసు కట్టు నవల ఈ నవలా రచయితలు

ఆరుగురు కొడవటిగంటి కుటుంబరావు, పాలగుమ్మి పద్మరాజు, మునిమాణిక్యం, నరసింహారావు, త్రిపురనేని గోపీచంద్, శ్రీరంగం శ్రీనివాసరావు, చింతా దీక్షితులు ఈ నవల వీరిచేత రాయించి ఆకాశవాణి మద్రాసు కేంద్రం ద్వారా ప్రసారం (1947) చేయించింది అచంట జానకీరామ్ నవోదయ వార పత్రికలో అచ్చయింది

'తెలుగులో గొలుసు కట్టు నవలలు' అనే అంశం మీద కూరెళ్ళ విఠలాచార్య గారు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం ఫిల్ చేశారు ఆ సందర్భంలో విఠలాచార్య గారి ప్రశ్నలకి ఇవి కుటుంబరావు గారి జవాబులు సం॥)

*

14-9-78

గుంటూరు శేషేంద్ర శర్మగారి పేరు విన్నాను గాని, ఎరగను ఆయన పుస్తకం చదవలేదు సాహిత్యంపై రాజకీయ ప్రభావం ఉంటుందని బెదిరేవాళ్లు చాలామంది ఉన్నారు వాళ్లు అజ్ఞానులు రాజకీయాల ప్రభావం ప్రయత్న పూర్వకంగా కాకపోతే అప్రయత్నంగానైనా సాహిత్యం మీద ఉంటుంది ఇలాటివాళ్లు ఆమోదించే సాహిత్యం మీద పనికిమాలిన రాజకీయాల ప్రభావం ఉండి తీరుతుంది ఇలాటి రచనలకు జవాబిచ్చే వ్యవధిగాని ఓపిక గాని నాక్కూడా లేవు

ఈస్తటిక్ విలువలు అన్నది బూర్జువా భావన అని నిరూపించవచ్చు నాలో ఈస్తటిక్ సెన్స్ ఉన్నా లేకపోయినా, నా రచనలలో నేను దాన్ని ప్రచారం చెయ్యలేదు ప్రకృతి వర్ణననే ఈస్తటిక్ సెన్స్ అనుకోవడం పొరపాటు నా రచనల్లో ఉండేది మానవ ప్రకృతి నాకు "అందం' ' కన్న "సత్యం" ఇష్టం దీనికీ మార్క్సిస్టు కావటానికీ సంబంధం లేదు నేను 1942 దాకా మార్క్సిస్టును కాను అప్పటికి 12 ఏళ్లుగా కథలు రాశాను వాటిలో ప్రకృతి వర్ణనలు ఎందుకు లేవు ? మీతో అన్న పెద్ద మనిషిని అడగండి

"అతీంద్రియ శక్తులు" గురించి సందర్భవశంగా రాయవలసి వచ్చింది నేను రాసిన అసలు సంగతి "బుద్ధి కొలత" అతీంద్రియ శక్తులను గురించి వేరే రాయటం కేవలం పాఠకులను ఆకర్షించటానికే అవుతుంది

*

2-12-78

నమస్కారాలు మీరు నిన్న రాసిన ఉత్తరం ఇప్పుడే అందింది మీరు Dec '78 ఇంగ్లీషు చందమామలో చూసిన Two lamps కథా, బొమ్మా జూన్ '78 తెలుగు చందమామ నుంచి తీసుకున్నవి తెలుగులో అది "నిజాయితీ" అన్న పేరుతో పడింది ఆ కథ పంపినవారు ఇ యన్ పద్మ, భీమవరం అది మాకు వచ్చి చాలా కాలమయింది (ఒక్కోసారి ఒంటి పేజీ కథలు ఆమోదించిన సంవత్సరానికి గాని అచ్చుకావు) లోగడ ఆమోదించిన కథే కావటం చేత మీ కథ తిప్పి పంపాను ఇదే కథ దరిమిలా ఇంకా కొందరు కూడా పంపారు ఆమోదించని కథలను వెంటే తిప్పి పంపేస్తాను ఎందుచేతనంటే, ఇంకా చాలా "చందమామలు" వస్తున్నాయి చందమామలో ఏ కారణం చేతనైనా పడకపోయిన రచనలు ఇతర పత్రికలలో పడవచ్చు అలా పడుతున్నాయి కూడా చందమామ నుంచి తిప్పి పంపిన కథలతో నడిచే "పిల్లల" పత్రికలు లేకపోలేదు

"యువ"కు మీరు పంపిన రచన "అభ్యుదయ"కు ఎలా చేరిందో నాకు తెలీదు నాకిప్పుడు 'యువ' వ్యవహారేలేవీ తెలీవు వాళ్లకి రాయండి 'యువ' వాళ్ళు తమకు చేరిన రచనలను గురించి బహుశా శీఘ్రు నిర్ణయం చెయ్యరు చేసినా రచయితలకు చెప్పరేమో!

మీ పరిచయం అయినందుకు చాలా సంతోషం కె శ్రీనివాసరావు గారు ఇంగ్లీషు చందమామలో పనిచేశారు కదా ! ఆయన్ని అడిగానని చెప్పండి ఇప్పటి నా పరిస్థితిలో తెలిసినవారి రచనలు చూసే తీరిక కూడా లేకుండా ఉన్నది ఒకప్పుడు కొత్త రచయిత రచన కనిపిస్తే చదివి ఏదో ఒక నిర్ణయానికి రాకుండా ఉండేవాణ్ని కాను కవన శర్మ అనే పేరుతో రచనలు రావటం ('యువ'లోనేనేమో) చూశాను, కాని చదవలేదు ఉంటాను

❋

23-3-1979

నమస్కారం పదేళ్లుగా తెలుగులో వెలువడుతున్న వందలాది నవలల్లో నేను ఒక్క శాతం కూడా చదివి ఉండను అందుచేత 'నేటి తెలుగు నవల' గురించి రాయటం సాధ్యం కాదు క్షమించాలి

ఈ కారణం చేతనే వరంగల్లు సాహిత్య పాఠశాలకూ ఈ విషయం వ్యాసం పంపలేకపోయాను

*

Madras,
5-4-79

*Shri Madhav S. Gaikwad,*
1319 (old) Bhavani Peth,
PUNE - 411 002
(Maharashtra)

Sir,

This is to acknowledge your letter of 28th March

Your doubts seem to be due to your lack of familiarity with the classics The sloka you refer to is taken from HITOPADESA and it means exactly what we have said As you say, there may be any amount of virtue among the poor but it will not shine because of poverty There is another famour verse in Sanskrit which goes

यरुयास्ति विसं । सनर : कुलीन : । (1)

etc It also says all the virtues are to be found only in the rich man We do not and cannot invent such verses in Sanskrit We suggest that you contact a good Sanskrit scholar

Regarding the Rishis eating meat and wearing the skin, Siva is called "गज चर्माबर धारी" (wearer of the elephant skin) He did kill Gajasura and we had published this episode in CHANDOBA long ago Currently we are publishing the anecdotes about some famous Rishis who ate meat The Vedic rishis lived upon meat They sacrificed some 13 types of animals including man (dwipath - 2 legged) During the time of the Buddha the vedic sacrifice became such a drain on domestic cattle that a law was promulgated for the stopping of cow slaughter and everbody accepted it But the other animals were eaten Puranas abound in stories of the great rishis eating meat Agasthya ate and digested Vaatapi Another was given human meat in his food and cursed the giver Viswamitra was forced to eat a dead dog during a famine Even today Sanatanist Brahmans sit on deer skin and some carry it with them wherever they go In the RAMAYANA Sita narrates the story of a muni who obtained a sword and went on killing animals with it In the Mahabharata hundreds of Brahmans were guests to the

Pandavas and lived on the meat the Pandavas hunted Vegetarianism has come with the Jains Because our generation is being fed very faulty ideas about our ancients and their culture, CHANDAMAMA is trying to give a correct angle on our ancients and their culture

*Yours faithfully,*

**K.K. Rao**

for EDITOR

[యస్యాస్తి విత్తం స నరః కులీన ః
స పండితః సశ్రుత వాన్ గుణజ్ఞ ః
స ఏవ వక్తా స చ దర్శనీయ ః
సర్వే గుణా ః కాంచన మాశ్రయింతే

ఇది భర్తృహరి సుభాషితంలోని నీతి శతకం, అర్థపద్ధతిలో 33వ శ్లోకం ఈ శ్లోకంలో మొట్టమొదటి పాదం మాత్రమే కుటుంబరావుగారు ఉదాహరించారు పూర్తి శ్లోకం పొందు పరిచాం

ఏనుగు లక్ష్మణ కవిగారి తెలుగు అనువాదం కూడా అందిస్తున్నాం
ఏరునకు విత్తముగల
దానరుడు కులీనుడధికూడార్యుండతడే
ధీనిధి ధన్యుడు నేర్పరి
నానా గుణ గణము కాంచనంబున నిలుచున్

ఎవడికి ధనముండునో వాడే ఉన్నత వంశంలో పుట్టినవాడు వాడే పండితుడు వాడే వేదాలు చదివినవాడు వాడే గుణవంతుడు వాడే వక్త వాడే సుందరాంగుడు అంటే సకల గుణాలు బంగారం వల్లనే అబ్బుతాయి సం॥]

❋

28-5-79

నమస్కారం మీ 24 తేదీ కార్డు ఇప్పుడే అందింది మీ రచనలు సృజన, అరుణతారలలో చూస్తున్నాను కాని తాపీగా చదివే అవకాశం కలగటం లేదు నా కాపీలు ప్రచారంలో ఉంటున్నాయి నాకన్నా వాటిని శ్రద్ధగా చదవవలసిన వాళ్ళ చేతికి పోతున్నాయి నేను తాపీగా చదువుకోగలను అవి చదివి మీ వంటి రచయితలను గైడ్ చేసే స్థితిలో లేను విప్లవ సాహిత్యం ఎలా నడవాలో నాకన్న మీకు బాగా తెలుసు అదీగాక మీ రచనల భాష నాకు బొత్తిగా కొత్త తెలంగాణా మధ్యతరగతి భాషనాకు పరిచయమే గాని, బొత్తిగా అణగారిన జీవితాలతోనూ, వారి భాషతోనూ నాకు ఏ మాత్రమూ పరిచయం లేదు

ప్రజాసాహిత్య సంప్రదాయాలంటే మౌఖిక సాహిత్యమూ, మంది సాహిత్యమూ మాత్రమే కదా ! స్వయంగా నాకు ప్రజాకళా రూపాలలో అంతగా విశ్వాసం లేదు message కి తగిన media కావు ఈనాడు అందరూ సినిమా లాంటి వాస్తవిక రూపాలను చూడటమే గాక, సినిమా చెత్తను నిజమైన జీవితం అనుకున్నంతగా ఆలింగనం చేసుకుంటున్నారు అలాంటి జనానికి సుద్దులూ, బుర్రకథలూ లాంటి వాటి ద్వారా సందేశం అందుతుందా ? నాకు నమ్మకం లేదు నాటకాల ప్రభావం కూడా ఏమీ ఉంటున్నట్టు కనబడదు ప్రజల కోసం వాస్తవికతను చిత్రించగల రూపాలు రావాలి అవైనా ప్రజలలో నుంచే రావాలి నేను ఏదో వ్యాసంలో అన్నట్టు కొన్ని దృశ్య రూపాలు చచ్చు సాహిత్యాన్ని సజీవంగా ఉంచటానికే పనికి వస్తున్నాయి (కురుక్షేత్రం, హరిశ్చంద్ర లాంటి ఇతివృత్తాలు కథలుగా గాని, నవలలుగా గాని రాస్తే ఎవరైనా చదువుతారా ?) ఇప్పటికీ హరికథలుగా చలామణీ అవుతున్న సాహిత్యం ఏనాటిది ? బెంగాలీలు జాత్రా పునరుద్ధరణ గురించి అభ్యుదయ వాదులు తీవ్రంగా ఖండించారు విప్లవసాహిత్యానికి పనికి వచ్చే మౌఖిక సంప్రదాయాలు ఎవరన్నా చెబితేగాని నాకు తెలీదు కథలు, నవలలూ ఎవరికి వారు చదువుకున్నందువల్ల ప్రయోజనం చాలా తక్కువ మందికి పనికి వచ్చే రూపాలు కావాలి వాటిలో వాస్తవికతకు అనంతమైన అవకాశం ఉండాలి సినిమా నిశ్చయంగా అటువంటి సాధనం కాని అది ప్రజా శత్రువుల చేతిలో ఉన్నది

నాకు విశ్రాంతి చాలా తక్కువ ఉన్నదాంట్లో నేను సైన్సు పుస్తకాలు హెచ్చుగా చదువుతున్నాను అందులో కొంత స్వతంత్ర కృషి కూడా చేస్తున్నాను సగం ఆ కారణంగా సాహిత్యానికి దూరం అయినాను మీ రచనలను వీలు చూసుకుని చదువుతాను కాని మీరు చిత్రించే జీవితం తెలియకుండా ఎలా విమర్శించడం ? ఉంటాను

*

17-6-79

నమస్కారం మీ 5తేదీ ఉత్తరం శనివారం అందింది సినిమా సంస్కృతి మనకు అప్రస్తుతం కళా సాధనంగా దానితో పని ఉంటుది విప్లవాల అనంతరం రష్యా, చైనా వగైరా దేశాలలో దాన్ని బాగా వాడుకున్నారు White haired girl (చీనా) లో పాటగూడా ఉంచారు

వాస్తవికత పోలేదా అనినేను (1952)లో చీనా డెలిగేట్‌ను అడిగితే ఆ పాట జనానికి చాలా ఇష్టమనీ, స్టేజీ మీద దానికి గొప్ప applause వచ్చేదనీ, సినిమాలో అది లేకపోతే జనం disappoint అవుతారనీ చెప్పాడు

సినిమాయే కాదు, బూర్జువాలు సృష్టించిన ఉత్పత్తి సాధనాలలాగే బూర్జువా కళారూపాలు ప్రజలకు పనికి వస్తాయి అవి ప్రజా సంస్కృతికి వాహకాలుగా ఉండేటట్టు చూసుకోవాలి జానపద కళారూపాలను మార్చుకోవడం కన్నా బూర్జువా కళారూపాలను (వాస్తవికతకు హెచ్చుగా అనుకూలించే కారణంగా) మార్చుకోవడం తేలిక అని నా నమ్మకం చర్చించదగిన విషయం

యుద్ధ కాలంలో ప్రజానాట్యమండలి జానపద రూపాలతో జనాన్ని అపారంగా ఆకర్షించిన మాట నిజమేగాని, వాటి ఇతి వృత్తాలు ప్రజలవి కావు, స్థానికమైనవి కావు పాటలో మిలిటెన్సీ లోపించింది కారణం కమ్యూనిజం వచ్చేస్తున్నదన్న గుడ్డి నమ్మకం ఈ గుడ్డి నమ్మకం లేకపోయినట్టయితే జానపద రూపాలలోని విప్లవ చైతన్యం తెచ్చే మార్గాలున్నాయేమో అప్పుడే తేల్చుకుని ఉండేపని అది జరగలేదు

మీరు చెప్పే రూపాలు (సారధి కాళ్ల నాధ, పాండ                నాధ, బుడుగు జంగాల కధ) నాకు ఏమీ తెలీదు వాటిలోని విప్లవ సంస్కృతి, ప్రజా చైతన్యం తీసుకు రావటానికి అవకాశాలున్నాయేమో ప్రయోగాల ద్వారా తెలుసుకోవచ్చు ఏమైనా ఇతివృత్తాలు ప్రజా చైతన్యం నుంచే రావాలి మధ్యతరగతి వాళ్ల guess work అంత మంచి ఫలితాలియ్యదు కాని theory మీద ఆధారపడి ఏ కళారూపాన్ని నిషేధించనవసరం లేదు మంచి రూపాలు తయారయ్యే కొద్దీ పాతబడినవి వదులు కోవచ్చు

ప్రజాపోరాటాలు కళారూపాలను సంస్కరించగలదన్నది నిజమేగాని, dielecticalగా ఆ రూపాలు ప్రజా పోరాటాలను ఎగదోసే మార్గం కూడా చూడాలి

ప్రస్తుతం ఫ్యూడల్ ఇతివృత్తాలకు కాలదోషం పట్టినమాట నిజమేగాని, బూర్జువా సంస్కృతి జనం మీద ఇంకా కొంత బలంగా ఉన్నట్టు కనబడుతుంది కళల దృష్టిని వ్యక్తి నుంచి మంది మీదికి బలంగా తిప్పాలి అదే ముఖ్యమైన మార్పు అనుకుంటాను కళారూపాలు అంత ప్రధానం గాదు మౌఖిక సంప్రదాయాలు ఈ బొమ్మకు బొరుసు అంటే మందికి సంబంధించిన ఇతివృత్తాలు మంది కోసం !

సినిమా సంస్కృతిని దెబ్బ తీయడం కష్టం కాదు మధ్యతరగతి వాళ్ళే దాన్ని ఏవగించుకుంటున్నారు

*

28-6-79

మన మార్క్సిస్టులు చాలా మంది తమకు తెలియకుండానే డాగ్మాటిస్టులు (పిడివాదులు)     జ్ఞానం పదునెక్కటానికి సంస్కారం పొందాలి

పెట్టుబడిదారి సంస్కృతి తన స్వార్థం కోసం తయారుచేసుకున్న సౌకర్యాలు విప్లవానికి తోడ్పడతాయి

మార్క్సు అదనపు విలువ సిద్ధాంతానికీ ఫ్రాయిడ్ సిద్ధాంతాలకూ ఏమిటి సంబంధం? ఏమైనా ఉందేమో నాకు తెలీదు ఫ్రాయిడ్‌ది విశిష్టవ్యక్తి వాదమే ఆ మాటకు వస్తే పారాసైకాలజీ కూడా అంతే దాన్ని సామాజిక ప్రయోజనాలకు ఎలా ఉపయోగించుకోవాలో చెప్పినవారు లేరు యోగమూ, హిప్నాటిజం, అసాధారణ శక్తులూ అన్నీ విశిష్టవ్యక్తి వాదానికి చెందినవే అనాలి అంత మాత్రాన అవి శాస్త్రీయం కాలేనక్కర లేదు

చలం గారు భౌతికవాది అవునా, కాదా అన్న ప్రశ్నకు తావు లేదనుకుంటాను ఆయన ఇతర లోకాలను నమ్మలేదు భౌతిక సమస్యలను ఆధ్యాత్మిక పరిష్కారం బలపరచలేదు ఆడది స్వేచ్ఛగా వ్యభిచరించినంత మాత్రాన ఏమీ తలకిందులు కాదన్నది ఒక విధంగా పచ్చి భౌతిక వాదం అయినా ఆయన భౌతిక వాదంలో ఒక "విశ్వదృష్టి" లేదు పరిణామాల అవగాహన లేదు పదార్థం కన్న మనసుకు ఒక విధమైన ఆధిక్యత ఉన్నట్టు భావించాడు భావవాది లక్షణం గద ! ఆయన సాహిత్య రంగంలో "సామాజికుడు" కాడు తెలుగులో ఏ రచయితల ప్రభావమూ ఆయన మీద కనబడదు వాక్య నిర్మాణం దగ్గిరనుంచీ ఆయన రచనలలో అంతా ఆయన సొంతమే ఆయన ఒంటరిగాడని నేను స్పష్టంగానే చెప్పానే ! తాను సంఘ సంస్కర్త కానని ఆయనే చెప్పుకున్నాడు

తెలుగు సాహిత్య చరిత్రలో చలం రచనలను అభిమానించినంత మంది ఇంకే రచయితనూ ఈ శతాబ్దిలో అభిమానించలేదని, ఆయన పోయినాక స్పష్టంగా తెలియవచ్చింది కాని చలం రచనలు సమాజానికి పెద్దగా అపకారం చెయ్యలేవని నా నమ్మకం ఆయనిది "శవ సాహిత్యం" అన్న రచనను ఎవరైనా పట్టించుకున్నారా ? నాకు తెలియ రాలేదు

నాకు మీవంటి వారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడం కన్న ముఖ్యమైన పనులేమీ లేవు ఉంటాను

*

6-6-80

"జ్యేష్ఠ" తన విమర్శలో ప్రజాసాహిత్యమూ, జానపద సాహిత్యమూ ఒకటే నన్నట్టు రాశాడు ఈ ఉచ్చులో మనం చిక్కుకోరాదు శ్రీశ్రీ తరచు చెప్పే రెండు రకాల సాహిత్యంలో ఒకటి జానపద సాహిత్యమే నేను చెప్పేది అది కాదని నా వ్యాసంలో ముందే స్పష్టం చేశాను అయినా జ్యేష్ఠ దాన్ని గ్రహించనట్టు నటించాడు

జానపద సాహిత్యం అన్నది సంప్రదాయ సాహిత్యంతో పనిలేనివాళ్లు తమ సంస్కృతినీ, మనోభావాలను ప్రకటించటానికి ఎప్పటికప్పుడు సృష్టించుకుంటూ వస్తున్నది ప్రజాసాహిత్యం అది కానే కాదు జానపద సాహిత్యం "పలాయన" సాహిత్యమే, కాని ప్రజాసాహిత్యం అన్నది సంప్రదాయ సాహిత్యంలో కొత్త పరిణామాలు తెస్తూ అందులో అంతర్భాగంగా చేరిపోతూ వస్తున్నది

"ప్రజ" అనే మాటకు నిర్వచనం అన్ని కాలాలలోనూ ఒకటిగా లేదు ప్రబంధ యుగం మీద తిరగబడిన పోతన భాగవతాన్ని "ప్రజా సాహిత్యంగా" రచించాడు ఆనాటి వాళ్లు అందరూ దాన్ని అర్థం చేసుకోగలవాళ్లే

"ఆధునిక" సాహిత్యానికి ఎక్కువగా అంటుకుపోని రాయలసీమ వంటి ప్రాంతాలలో "పామర" భాషలో కూడా గ్రాంధిక భాష ఛాయలు కనిపిస్తాయి రాయలసీమలో చాలా మంది సందర్భ శుద్ధిగా భారతం నుంచి "కోట్" చెయ్యటం నాకు తెలుసు

వేమన పద్యాలు ప్రజా సాహిత్యం - జానపద సాహిత్యం కాదు

ఉత్తర ప్రదేశ్‌లో నెహ్రూ తన చిన్నతనంలో గ్రామాలలో పర్యటించుతూ, మామూలు రైతులు తులసీ రామాయణం నుంచి తమ జీవితాలకు అన్వయించే సూక్తులు వల్లించటం విని నిర్ఘాంతపోయాడు కబీర్‌దాస్, సూర్‌దాస్, తుకారాం లాంటి "భక్తి" కవుల రచనలు జానపద సాహిత్యం కాదు ప్రజా సాహిత్యం వేమన పద్యాలూ అంతే

గత శతాబ్దాల ప్రజాసాహిత్యం ఈ నాటికీ ఇంకా కొన్ని ప్రాంతాల వర్తమాన సాహిత్యంగా ఉపయోగపడుతున్నదంటే ఆ ప్రాంతాల జీవితం బాగా వెనకపడిఉన్నదన్నమాట విప్లవ సాహిత్యం నిజమైన ప్రజాసాహిత్యంగా చలామణీ కావటం ఏ ప్రాంతంలో జరిగితే ఆ ప్రాంతంలో జీవితం ఉన్నత పరిణితికి వచ్చిందని భావించాలి ఇది దృఢంగా, శాస్త్రీయంగా బలపరచవలసిన ప్రతిపాదన అని నా నమ్మకం

మధ్యకాలంలో సామాజిక సంస్కృతిని గుత్తకు తీసుకుని సాహిత్యపు విలువలు తమతోనే పరాకాష్ఠ చెందాయన్న పోజు పెట్టిన మధ్య తరగతి వాళ్లు జానపద సాహిత్యాన్ని ఆకాశానికెత్తేశారు యెంకి పాటల లాంటివి అమితమైన ప్రచారం పొందాయి అయితే ఆ యెంకి పాటలు కూడా త్వరలోనే జానపద వాసన పోగొట్టుకుని, అచ్చమైన భావకవిత్వంగా పరిణమించి "ఎన్నెలంతా మేసి యేరు నెమరేసింది"

ఇది తప్పక ఎస్కేపిజమే అదే ప్రజా సాహిత్యమని ప్రచారం చేసేవాళ్లు విప్లవ సాహిత్యానికి ప్రబల శత్రువులు కాగలరు

వీలయినంత మందితో ఈ విషయం చర్చించి నేను చెప్పేదానిలో పొరపాటు ఏమన్నా ఉంటే నాకు రాయండి ఉంటాను

❋

16-6-80

మీ 12 ఉత్తరం ఇప్పుడే అందింది ప్రజా సాహిత్యం గురించి మనకు స్పష్టమైన నిర్వచనం ఉండాలి ప్రజలకు ఎడంగానూ ప్రజా జీవితానికి శత్రువులుగానూ ఉండదలచినవారు తప్ప సమాజంలో అందరూ ప్రజలే మేధావులనూ, ధనికులనూ, దోపిడీదార్లనూ మినహాయించి అట్టడుగువాళ్లనే ప్రజలుగా భావించటానికి మనం అలవాటు పడ్డాం ఇది పొరపాటు ఈ "ప్రజలు" అన్ని కాలాలలోనూ ఉన్నారు వర్గ సమాజం ఏర్పడక ముందు అంతా ప్రజలే

అటు తరువాత దోపిడీకు గురి అయినవారు, దోపిడీలో భాగం పంచుకోనివాళ్లు "ప్రజలు" అనిపించుకుంటూ వస్తున్నారు ఏ యుగంలోనైనా ప్రజాసాహిత్యం అనాటి సమాజానికి అభ్యుదయకరమైనది మధ్య యుగాలలో వచ్చిన తిరుగుబాటు రచనలన్నీ మత వాసనగలవే, కాని అది ఆనాటి ప్రజాసాహిత్యం బమ్మెరపోతన, తులసీదాసు లాగా, కబీర్‌లాగా, తుకారాంలాగా ఆనాటి ప్రజాకవి

రాయలసీమవారి మీద గ్రాంధిక భాష ఎవరూ రుద్దలేదు ప్రజా బాహుళ్యం మీద ఎవరూ భాషను రుద్దలేరు అది చరిత్ర విరుద్ధం పరిణీతం కాని వ్యావహారికం గ్రాంధికానికి దగ్గరగా ఉండటం సహజం "నేను వానింటికి పోయుంటి" అని రాయలసీమ వాళ్లు అనే నోటిమాట" నేను వాని ఇంటికి పోయి యుంటిని" గ్రాంధికం "నేను వాళ్లింటికి పోయా" అన్నది సర్కారు వ్యావహారికం చిన్నయసూరి వచ్చి రాయలసీమలో అందరినీ భారతం కంఠస్థం చెయ్యమన్నాడా ? అసంభవం యుపిలో రాయనూ, చదవనూ రాని కర్షకుల చేత తులసీ రామాయణం ఎవరు కంఠస్థం చేయించారు ? అది తమ సాహిత్యం అనుకున్నాక వాళ్లే చదివించుకుంటారు, కంఠస్థం చేసుకుంటారు

ఇంతకూ నేను తేల్చుకోదలుచుకున్న అంశమేమంటే మనం విప్లవ సాహిత్యం అని సృష్టిస్తున్నదానిలో ప్రజలు తమదిగా భావిస్తున్నది ఏది ? ప్రజలను కదిలించ లేకుండా ఉన్న దేది? ఇది తెలియటం చాలా అవసరం ప్రజల స్థాయి మనకు అవగాహన అయేది ఈ ప్రశ్నకు వచ్చే సమాధానంతోనే

జానపద సాహిత్యానికి పరిణామం అంటూ ఉండదు ఈనాటి సినిమాలలాగా అది ప్రజలకు వినోదం ఇయ్యవచ్చు, కాని ప్రజలకు చైతన్యం ఇయ్యదు మనం దాన్ని గురించి ప్రస్థావించనవసరం లేదని నా ఉద్దేశం ఇప్పుడు రెండు సాహిత్యాల చర్చ చివరకు జానపద సాహిత్యం మీదకి పోయింది ! "జ్యేష్ఠ" పాచిక పారింది ! ఇందుకే నేను ముందుగా హెచ్చరిస్తూ మీకు రాసాను ఇక ఆంధ్రజ్యోతిలో సాగే చర్చ మనకు ఉపకరించదు

శ్రీశ్రీని సస్పెండ్ చెయ్యటం గురించి అక్కడ విరసం సభ్యులు ఏమంటున్నారు ? ఇక్కడ ఒకరిద్దరితో మాత్రమే మాట్లాడగలిగాను ఉంటాను

*

10-7-80

నమస్కారాలు మీ 8 ఉత్తరం అందింది జ్యేష్ఠ గురించి మనం పట్టించుకోనవసరం లేదు ప్రతి విప్లవ పరిస్థితి వెనకా ఇటువంటి రకాలు ఉంటారు కాని వారి కృషి చరిత్రను సృష్టించదు చివరకు చరిత్రలో మిగలనన్నా మిగలరు

సందర్భ శుద్ధి లేకుండా మార్క్సనూ, ఇతరులనూ "కోట్" చేసే దురలవాటు మనవాళ్ళకూ ఉన్నది వాళ్లు చెప్పినది మనకు విజ్ఞానంగా పనికివస్తుంది ఆచరణకు పనికి

వచ్చే జ్ఞానంగా ఉపయోగపడదు ప్రతి కొత్త ఆచరణ వెంటా కొత్త జ్ఞానం రావాలి అది మార్క్సిస్టు విజ్ఞానం మీద ఆధారపడి ఉండాలి జ్ఞానానికీ, విజ్ఞానానికీ ఉండే తేడా గురించి సృజనలో రాశాను దాన్ని గురించి ఎవరుగాని పట్టించుకున్నట్టూ, చర్చించినట్టూ నాకు తెలియలేదు అదేదో నా వ్యక్తిగత విషయం కాదు గద ! అందులో నిజం ఉంటే అందరికీ పనికి వస్తుంది అందులో అవగాహన లోపం ఉంటే దాన్ని చర్చ ద్వారా సరిదిద్దాలి పూర్తిగా తప్పు అవగాహన అయితే గట్టిగా ఖండించాలి ఏదీ జరక్కపోతే ఏమనాలి ?

కాళీపట్నం రామారావుగారు చాలా కాలం క్రితమే తండ్రి పోతే శాస్త్రోక్తంగా ఉత్తర క్రియలు చెయ్యవలసి వచ్చి ఆ పరిస్థితిలో విరసం సభ్యుడుగా ఉండటం విరసం ఆదర్శాలకు విరుద్ధమనే రాజీనామా చేశారు ఎం టి ఖాన్ ప్రస్తుతం ఒక పుస్తక ప్రచురణ సంస్థలో భాగస్వామిగా ఉంటున్నాడు ఆయన రాజీనామా సంగతి నాకు తెలీదు శ్రీశ్రీ రాజీనామా గురించి పత్రికల్లో వచ్చింది ఏమైనా ఎప్పటికైనా వీళ్లెవరూ విరసంలో ఇమడరు నేను కూడా విరసంలో అనవసరమే విరసం విప్లవ సాహిత్యం సృష్టించే వాళ్లది ప్రజలది మధ్య రకం వాళ్లు ఏదో ఒక దశలో జారిపోక తప్పదు కొంతకాలం వీళ్ల పేర్లు విరసం ప్రతిష్ఠకు ఉపయోగపడి ఉండవచ్చు

ఈనాటి భారతీయ రాజకీయ ధోరణుల గురించి నాకు ఏమీ తెలీదని చెప్పాలి విప్లవేతర పార్టీలకు ఆదర్శాలు లేవు విప్లవ పార్టీలు చీలి ఉన్నాయి ఏ సిద్ధాంతాలు వాటిని వేరు చేస్తున్నాయో తెలీదు అంతేగాని ప్రజలు ఏ స్థితిలో ఉన్నారు ? వారిలో విప్లవ చైతన్యం రావటానికి అడ్డంగా ఉన్న సాంఘిక, సాంస్కృతిక, రాజకీయ విశ్వాసాలు ఏవి ? వాటిని ఏ పద్ధతిలో నిర్మూలించాలి ? అన్న విషయం ఎవరికీ పట్టినట్టు లేదు నా మటుకు నేను సాహిత్యానికీ, ప్రజలకూ మధ్య ఉన్న అడ్డుగోడలు అన్వేషిస్తాను

❋

23-7-60

నమస్కారాలు మీ ఉత్తరం అందింది విరసం యువకులను కలవలేకపోవటం నాకు మాత్రం ఏం సంతోషం ? నేను వెర్రెత్తినట్టు సాహిత్యం గురించి రాస్తున్నది వాళ్ల కోసం కాదా? సాహిత్యానికీ, ప్రజా సాహిత్యానికీ మాండలిక భాషల మూలంగా గండి ఏర్పడి ఉండటం నాకు ఘోరంగా కనబడుతున్నది అరసం ప్రజా సాహిత్య స్వరూపం గురించి శ్రద్ధ పట్టి ఉంటే ఈ gap ఎప్పుడో పూడేది విప్లవ సాహిత్యం కొద్దిమంది నుంచే రావటానికీ, అది కూడా కవితల రూపంలో ఉండటానికీ ఇదే కారణమేమో చర్చించటం అవసరం మంచి కవిత injection లాగా పనిచేస్తుందిగాని, పుష్టి కలిగించేది వచన సాహిత్యమే శ్రీశ్రీని వందలకొద్దీ పిల్ల కవులు అనుసరించారు ఆనాడు 'కన్యాశుల్కాని'కీ, తరవాత 'ప్రజల మనిషి'కీ ఇప్పుడు 'కొలిమంటుకున్నది'కీ, అనుకరణలు ఏవి ? తోడుంటే అక్టోబరులో రావటానికి ప్రయత్నిస్తాను

❋

5-8-60

మీ బోటి వాళ్ళకు మాట ఇయ్యటం అంటేనాకు చాలా భయం వారం రోజులుగా నాకు మళ్ళీ రోజూ జ్వరం వస్తున్నది మామూలు రక్తపరీక్షలో వ్యాధి పరిస్థితి తెలియలేదు ప్రత్యేక పరీక్షలు చేయించుకోమన్నారు ఇవాళ 2 X-Ray Photos తీయించుకోమన్నారు ఈ వయసులో ఏ కొత్త రోగం వచ్చినా ఏళ్ళ తరబడి మందులు తీసుకోవాలి కిందటేడు ఇదే నెలలో వచ్చిన రోగానికి ఇంకా మందు తీసుకుంటూనే ఉన్నాను నాకు అప్పుడిలాటి వాడు తెనాలిలో డా॥ పి దక్షిణామూర్తిగారు నవంబరులో నన్ను పరీక్షించి నాకు సరి అయిన మందులూ, డోసులూ నిర్ణయించారు ఇప్పుడు కూడా ఆయనకు నా ఆరోగ్య సమాచారాలు చెప్పుకుంటూనే ఉంటాను చెప్పవచ్చిందేమిటంటే ఆయన కోసం అయిదేళ్ళ అనంతరం మద్రాసు విడిచి ప్రయాణం చేశాను అది కూడా నా భార్య నా వెంట ఉంటే అంతేగాని నేను ప్రయాణాలు చెయ్యడం అంత వివేకమైన పని కాదు

విరసం ఉద్యమం కమ్యూనిస్టు పార్టీల తోకపట్టుకుని పోరాదు, వాటిని గాలికి వదిలేసి మనదారి మనం చూచుకుందాం అనుకోనూరాదు రాజకీయంగా కమ్యూనిస్టు పార్టీలో వైఫల్యాలకూ, విరసం ఉద్యమానికి కొంత సంబంధం ఉంటుంది రెండింటి గమ్యమూ ఒకటే గనక కాని విరసం సంస్థ "రాజకీయ" పొరపాట్లు చెయ్యటం ఎలా ఉంటుందంటే కమ్యూనిస్టు పార్టీలు "సాహిత్య" పొరపాట్లు చేసినట్లుంటుంది

మన విప్లవ మేధావులు విప్లవం చేయి చాస్తే అందేటంత దగ్గిరగా ఉన్నట్టు పొరపడ్డారు కారణం విప్లవం స్వభావం అర్థం కాకనేమో మెరికల్లాంటి యువకులు విప్లవోద్యమంలో బలి అయితే, వాళ్ళ చావులను మామూలు హత్యలుగా భావించారు "కౌంటర్ రివొల్యూషన్ ఉండడం సహజమే" అన్నట్టు వాళ్ళు భావించలేదు రివొల్యూషన్ చట్టబద్ధమైనట్టూ, ఎన్‌కౌంటర్ పేర పోలీసులు పట్టుబడిన వాళ్లను కాల్చి చంపటం చట్టవ్యతిరేకమైనట్టూ ప్రవర్తించారు విప్లవం పిక్నిక్ కాదని మావో చెప్పినది కూడా మనవాళ్ళు సరిగా గ్రహించలేదు

మన దేశంలో నిజమైన పారిశ్రామిక చైతన్యం ఏనాడూ బాగా పాతుకోలేదు యుద్ధకాలంలో భారత కమ్యూనిస్టు పార్టీ తమ పార్టీ అన్నట్టు ప్రవర్తించిన బొంబాయి కార్మికులు స్వరాజ్యం వచ్చి అధికారం కాంగ్రెసుపరం కాగానే కమ్యూనిస్టులను బలపరచవలసిన ఆవశ్యకత గుర్తించక, ఎన్నికల్లో గెలిచే పార్టీ వెంటపడ్డట్టే కాంగ్రెసుకు అమ్ముడయ్యారు రాజకీయ చైతన్యం కాని ఏ చైతన్యమూ ఈనాడు నిజమైన చైతన్యం కాదు

బుద్ధి కొలత గురించి నేను రాస్తున్నది అర్థం కాకపోతే వదిలెయ్యండి నాకే సరిగా తెలీని అనేక శాస్త్ర విషయాలను ఆధారం చేసుకుని ఆ సిద్ధాంతానికి రూపుదిద్దుతున్నాను

❋

8-9-79

మీ heart attack గురించి అప్పుడే విన్నాను కాని young people తేలిగ్గా recover అవుతారు 60 ఏళ్ళకు నాకే infarction వచ్చింది అది infarction అని 1977 లో ECG తీసుకున్నదాకా తెలియదు దానికి మందు కూడా తీసుకోలేదు దానంతట అదే నయమై ఉండాలి 2 mts unconscious గా పడిపోయి recover అయాను అంతే

Servical Spondiitis చాలా compatable అనుకుంటాను Myalgia of the chest ఉన్నట్టే neck కు కూడ effect అవుతుంది Myalgia of the chest కు హోమియాలో మందులున్నాయి (Right chest) కు Sangumarcea ఇస్తారు మంచి హోమియో వైద్యుణ్ణి consult చెయ్యండి జబ్బు నయమైనా constitution లో అది దాగి వుండొచ్చు Rhustox (colchium) వగైరా drugs ఉన్నాయి

"There are now no deceases, except drug deceases" అని ఒక డాక్టరుగారు Hindu లో స్పష్టంగా రాశారు

Folk forms వాడరాదని dogmatic గా చెప్పడం తప్పు అవి జనాన్ని attract చేస్తాయి Realism కు పనికిరావు మనం revolutionary arts ను revolutionary economics లాగా, బూర్జువా forms నుంచి evolve చెయ్యాలి బూర్జువా content లో మార్పు రాగానే బూర్జువా form లో corresponding మార్పు తప్పనిసరిగా వస్తుంది Revolutionary art forms develop అయ్యేదాకా folk form వాడవచ్చు కాని అది end మాత్రం కాదు ఆలోచించండి

విరసం కార్యవర్గ తీర్మానం సరియైనదైతే rigid గానే ఉండాలి కాని అందులో absurdity ఉంది మనం మామూలుగా Marxist truth ను Marxist knowledge గా భ్రమపడుతున్నాం ఇది చాలా unmarxian Knowledge should follow actual conditions & preceed action Knowledge comes after action అన్న Meaningless idea విరసం కార్యవర్గ తీర్మానంలో ఉన్నది Idea comes before action అన్నందుకు, idea concrete conditions నుంచి రానవసరం లేదని నేనన్నానను కున్నట్టున్నారు రాసినది చదవటం, చదవకపోవటానికి ఇది మంచి example అవుతుందేమో!

నేను నిశ్చయంగా resign చేస్తున్నాను There is absolutly nothing I can do to విరసం - విప్లవ సాహిత్యోద్యమం Also I feel too far away from the institution as it exists గుడ్డి కన్ను మూసినా, తెరచినా ఒకటే నేను resign చెయ్యటం ఎవరినీ ఏ విధంగానూ బాధించనవసరం లేదు I am moving forward in some other direction too ఒక్క విరసం direction లోనే movement లేదు విరసంలో లేకపోయినా నేను ఎవరినీ abandon చెయ్యబోవటం లేదు You should understand me without mental reservations or prejudices ఉంటాను

❋

14-9-79

నమస్కారాలు చెరబండరాజు గురించి సృజనలో చదివి బాధపడ్డాను Brain tumors క్కూడా హోమియోలో మందులున్నాయి కాని serious case tinker చెయ్యటం ఎట్లా ?

Arts లో content నూ form నూ వేరు చెయ్యటం సాధ్యంకాదు ఏ folk form కూడా realism కు అవకాశం ఇయ్యదు బుర్రలూ, తంబూరా, అడుగెయ్యటమూ లేకుండా బుర్రకథను ఊహించలేం తోలుబొమ్మలు లాటివి హీన సంస్కృతిని ప్రతిబింబించటం వల్ల feudal culture లో కూడా వాటికి తక్కువ స్థానం ఏర్పడింది వీధి భాగవతాలలో ఒకప్పుడు హాస్యంపేర సంఘ విమర్శ ఘాటుగా ఉండేదట నేను (65 ఏళ్ళ క్రితం) చూసేనాటికే వీధి భాగవతాలలో Slavish attitude వచ్చేసింది చివరకు పెటీ బూర్జువాలు ఆస్వాదించిన స్టేజి నాటకాలలో కూడా పద్యాలూ, పాటలూ, పాత్రపోషణ అధ్వాన్నంగా ఉండటమూ జరిగింది స్థానంలాంటి talented actor సత్యభామ వేషం కట్టి కృష్ణ పాత్రతో గాక audience తో flirt చేసేవాడా ?

అయితే ఇది old cultures ను సజీవంగా ఉంచటానికీ, తెలిసినవే మళ్ళీ మళ్ళీ నెమరువేయటానికీ పనికివస్తాయి వాటిద్వారా కొత్త భావాలు ప్రజాస్వామ్యానికి impart చెయ్యటం అసాధ్యమని నా నమ్మకం నేను పొరపాటు పడుతున్నానేమో తెలీదు ప్రజా నాట్యమండలి విషయం చెప్పారు గనక, అది ఏం చేసింది ? హిట్లర్ భాగోతమూ, క్రిప్స్ రాయబారమూ వీధినాటకాలుగా వచ్చేనాటికి particularly నాజర్ బెంగాలు కరువూ, తరువాత రాయచూసిన పల్నాటి చరిత్ర గూడ అంతే కాని the only thing while looked to the future was మా భూమి A realism form without music as an organic part of job

ఈ folk forms ను ఎలా మార్చితే /new message నీ truth నీ ప్రచారం చెయ్యగలవో కొత్త కళాకారులు form & content నూ match చేసి చూపితే గాని ఉత్త theory తో తెలుసుకోలేం ఉదాహరణకు తోలుబొమ్మల realistic form సినిమా దీన్ని review గా గానీ, analysis గా గాని convey చెయ్యటానికి ఉపయోగించటం లేదా ! The form is actually being misused But if well used it is a tremendous form బొంబాయిలో హమ్‌రాహి చూస్తుంటే దాని impact తెలిసింది అందులో ఒక black leg పెట్టుబడిదార్ల దగ్గిర లంచం పుచ్చుకుని, దణ్ణం పెట్టి తనను కనిపెట్టి ఉండమంటాడు Half the audience shouted at him in spontaneous rage సినిమా గురించి ఆలోచిస్తూంటే నాకు రెండు ideas వస్తాయి 1) Folk forms can be made realistic by suitable techniques 2) They can be wonderfully useful to rouse the people or make them aware of reality Of course existing order అటువంటి arts ను suppress చేస్తుంది But that is part of the cultural struggle Litera-

ture ban కావటం లేదా ? Art must be nationalist as form నిజమే కాని folk forms, as they are, nationalist కావు అదే వచ్చిన చిక్కు

Capitalist mode of production is inimical to art అన్నది కూడా నిజమే ఎందుకంటే capitalist society లో అన్ని కళలూ commercialize అవుతాయి (Tolstoy stage settings చేసే carpenters ను చూసి, art కు ఇంత పెట్టుబడి కావాలా అని ఆశ్చర్యపడలేదా !) మనం ఇంకా వెనకబడి ఉన్నాం మన Main cities లో కూడ ఈనాడు నాటకాలూ, గానసభలూ capitalist ventures అన్ని సభలవాళ్ళూ పాటకచేరీలు తగ్గించి సినిమాలు వేస్తున్నారు, Madras లో ఎందుకు ? పాటకచేరీకి invest చేసే few hundreds కూడా గిట్టటం లేదు

అందుకని మనం capitalist society లో arts ను ఎలా abandon చేస్తాం ? వాటి అవసరం నానాటికీ పెరుగుతున్నది గదా ? Cheaper forms effective గా ఉండే మార్గం చూడాలి అదొక పెద్ద R & D affair (Research and Development)

ఆంధ్రజ్యోతి వాళ్ళు, నేను రాసిందంతా వేస్తారనుకోకండి వాళ్ళ నా వ్యాసాలు అరడజను పైగా వెయ్యలేదు నన్ను ముఖ్యంగా బాధిస్తున్నది మనవాళ్ళు Marxism మతంగా చెయ్యటం Marxist సత్యాలు కూడా (Marx ప్రకారమే) absolute truths కావు వాటిని అసందర్భంగా ఎందుకు ఏకరువు పెడతారు ? ఉదాహరణ Being determines consciousness ఇది సత్యమే కాని దీనికి limitations లేవా ? దీని నికరమైన అర్థం consciousness indicates the state of being దీనికి లిమిటేషన్ ఏమిటంటే consciousness cannot go beyond the state of being మధ్యతరగతి వాళ్ళ consciousness గాని proliterian consciousness గాని వాళ్ళ being కు అనుగుణంగా ఉన్నదా ? Becoming అనే dialectical process లేదా ? Mao పనిపెట్టుకుని proletarian consciousness తెచ్చుకోలేదా! Proletariat నుండి revolutionary leaders రారా ? Actual truth ఏమంటే Being and consciousness act upon each other Otherwise కోట్లాది జనం యొక్క being revolution ద్వారా ఎట్లా మారుతుంది ? consciousness ను being stage దాటించడానికి being లోనే మార్పు తేవాలి గద

అటువంటిదే మరో statement-consciousness can not change until the material conditions which are responsible for it change ఇది one-sided truth కాదా ? Actual గా రెండూ mutual change కలిగిస్తాయి

ఏమైనా మనవాళ్ళు, show off marxists గా తయారవుతున్నారా ? మనం రాసేది ఎవరి జ్ఞానాన్నైనా ఆవగింజంత పెంచుతున్నామా అని నా బాధ

చాలా రాశాను నేను విరసంలో ఉండటం విరసంకే దండగ కాని మీవంటి మిత్రులకు, అవకాశం దొరికితే రాస్తాను మనలో కొందరు పీఠాధిపతులుండొచ్చు నేను కాను Every word I write must & should be discussed and estimated ఉంటాను

*

28-10-79

నమస్కారాలు ఈ మధ్య సోదా చేశారంట మీ ఇల్లేనా ? ఏమిటి విశేషం ? ఆ రోజు పౌర్ణమిగాని, అమావాస్యగాని అయిందా ?

నా వ్యాసాలు మధుసూదనరావుగారు edit చేస్తున్నారట కళాసాగర్ వ్యాసాలు రావటంలేదు అంతా కులాసాగానే ఉన్నాం మీరంతా కులాసా అని తలుస్తాను

❋

11-2-80

ఎన్నికలను గురించి frontier analysis అంతా జ్ఞాపకం లేదు అందరూ ఒక్క విషయం మరచిపోయినట్లు కనిపిస్తున్నారు దాదాపు 50% వోటర్లు అన్ని పక్షాలవారికి against అయినారు వోటు చెయ్యలేదు Congress (I) కి mandate ఇచ్చినవాళ్ళు గట్టిగా 30 శాతం వోటర్లు లేరు కాని వోటు చేసినవాళ్ళు political attitudes లేనివాళ్ళు జనతా, జనతా (s) వెధవలమీద reaction తప్ప నాకేమీ కనపడలేదు

విరసం పుట్టక మునుపు అరసం ఆడిన నాటకానికీ, కాకినాడ affair కూ ఏమీ సంబంధం లేదు KVR కూడా మీలాగే ఆందోళన పడుతున్నాడు What are you afraid of ? మతం పుచ్చుకున్నవాళ్ళ మధ్యనే ప్రచారకులు వెళ్ళే పరిస్థితి మతానికి క్షయం ఆరంభమైనప్పుడు ! మతం వ్యాప్తి కావాలంటే ప్రచారకులు కొత్తవాళ్ళ దగ్గరికే వెళ్ళాలి విరసం ప్రభావం Recede అవుతుంటే మీ భయాలకు అర్థం ఉండొచ్చు ఇప్పుడు లేదు తెనాలిలో లయన్స్‌క్లబ్ మెంబర్లకూ, రోటరీ క్లబ్ మెంబర్లకూ శ్రీశ్రీ విప్లవం బోధించాడు అవాంఛనీయమా ? వాళ్ళు వేసిన ప్రశ్నలకు ముఖంమీద గుద్దినట్లు ఇద్దరమూ సమాధానాలు చెప్పాం అరసం వాళ్ళు శ్రీశ్రీని ఈ విధంగా acknowledge చెయ్యదలిస్తే మనం అభ్యంతరం ఎందుకు చెప్పాలి ? శ్రీశ్రీకి వెళ్ళాలని లేకపోతే మనం పంపాలని నేను అనను Why should we give the impression of cowardice to face our retractors ? "శ్రీశ్రీ ఎందుకు వెళ్ళాలి ?" అంటున్నారు మీరు "ఎందుకు వెళ్ళగూడ"దని నేను అడుగుతున్నాను సోసులాంటివాళ్ళను శ్రీశ్రీలాంటి వాళ్ళ కాంతిలో కొంచెంసేపు కనబడనియ్యండి వాళ్ళ దీపాలు ఆరిపోయాయి మన దీపంనుంచి వాళ్ళు వెలిగించుకునే అవకాశం ఉంటే మనకేం నష్టం ? M V Sastri దూరంగా ఉండటం సబబే He can contribute nothing to spoil their image సాహిత్య కళాభిమానులకన్న ఈ ex సాహితీపరులు తీసిపోయినట్లు ఎందుకు భావిస్తున్నారు మీరు ? జాగ్రత్తగా ఉండాలి గదా అన్న మీ మాటలో ఏదో ఫియర్ ఉన్నది అది అనవసరం They have to fear us

❋

5-4-80

నా వ్యాసం Souvenir లో వేసుకోవచ్చును

శంకరాభరణం success కు Music తోడ్పడుతున్నది అయితే అది actual గా classical music కాదు The same loud film music somewhat restricted

Balamuralı was saying yesterday evening to me "Where ıs శంకరాభరణం ın the picture ?" He must be right Much of its phenomenal success is due to its negative qualities no sex, no love scenes on the lawns, no fights Even to me this was a terrible relief As for the rest, the picture is a total failure from the stand point of realism and a very mild success as a fantasy It should have been a total fantasy Still I think this film has broken the back of formula films very effectually As such it may be a brake on the usual

*

2-5-80

మీ inland అందింది విరసం Manifesto లో Marxism - leninism - Mao-Tsetung thought అన్నదాన్ని గురించి నా అభిప్రాయం చెబుతాను ఇందులో మొదటిభాగం నా సొంతం కాదు కాని నాకు నిజమనిపించింది

1 Marxist can belong to any walk of life and adopt Marxist philosophy to his own life This is more or less what I have been doing for nearly 40 years

2 Marxist-Leninist must be a politician pursuing leftist politics

No 3 నా interpretation

3 You can't be a Marxist-Leninist and a follower of Maoist thought without being an active revolutionary

ఈ stand point విరసం ఒప్పుకుంటే విరసం సభ్యులు Marxists కావటం compulsory మిగతావి optional Marxists కాకుండానే విరసం సభ్యుడు కావచ్చుననేవాళ్ళూ ఉన్నారు కాని అది nonsense అదే అయితే ఎవరైనా విరసం సభ్యుడు కావచ్చు విప్లవ సాహిత్యోద్యమం విప్లవమేననేవాళ్ళు Manifesto లో ఉన్నది మార్చటానికి ఒప్పుకోరు ఆలోచించండి

కృష్ణాబాయిగారు విజయవాడ వెళ్ళారా ? ఉంటాను

*

20-6-80

నిన్నటి మీ inland last post లో అందింది మన lineలో లేని వాళ్ళకు మీరు literature గురించి Marxist దృష్టితో 2 గంటలు మాట్లాడటం మనకు పెద్ద asset

నాకూ, మిగిలినవాళ్ళకూ ఒక తేడా ఉన్నట్టు నాకు తోస్తున్నది సాహిత్యం గాని, సంగీతంగాని, సినిమాగాని నేను analytical గా ఆలోచించేటప్పుడు కొన్ని ప్రశ్నలు వేసుకుని

సమాధానాలు వెతుకుతాను అవి నాకు satisfactory గా ఉన్నప్పుడు వాటిని నలుగురి ముందూ పడేస్తాను మనవాళ్ళు ఆ పని చెయ్యటం లేదనీ, పాత సిద్ధాంతాలకే revolutionary orientation ఇచ్చి తృప్తి పడ్డారా అనీ అనుమానంగా ఉంది నా అనుమానానికి basis ఏమిటంటే విప్లవ సాహిత్యం distinct part play చేసే వివరణ ఇయ్యక, దాన్ని విప్లవకార్యాచరణతో equate చేశారు This was patently wrong

మనం మొట్టమొదట ప్రజాసాహిత్యాన్ని clear గా define చెయ్యలేదు విప్లవ రచయిత ప్రజలనుంచి వేరైనట్టూ, వాడు ప్రజలలో ఒకడుగా మారి ప్రజల కోసం రాయాలన్నట్టూ ఒక idealistic picture creat చేశారు ఈ అపోహకు కారణం కొంత వరకు Mao రచనలు కావచ్చు కాని Mao చెప్పిన సందర్భం వేరు అది continuing revolution మనం విరసం ప్రారంభించినది విప్లవకార్యాచరణకు కేవలమూ అనుబంధంగా కాదు సాహిత్య సంప్రదాయ దృష్టిలో potential revolutionary class కూ actual revolution కూ మధ్య చాలా వర్గాలున్నాయి మధ్యతరగతి పౌరలు అందాం ఈ వర్గాలలో ఉన్న internal contradiction ఏమిటంటే, వాళ్ళు art form లో జీవితం తాలూకు revolutionary truth ను ready గా accept చేస్తారు Revolution ను accept చెయ్యరు Thus భావ విప్లవం అని మనం అనేది ఈ classes కు ముందు తెప్పించాలి ఏదో ఒక stage లో వీళ్ళు విప్లవాన్ని బలపరచవలసిన వాళ్ళు

ప్రజలు అంటే ఎవరు ? Narrow class interests కోసం mental గా segregate చేసుకున్నవాళ్ళు తప్ప అందరూ ప్రజలే ప్రజా సాహిత్యం చాలా wide & comprehensive phenomenon దానికి సాహిత్య లక్షణాలు ఉంటే అందరినీ ఆకర్షిస్తుంది

ఈ fundamental question pose చెయ్యకుండా, విరసం కవులు విప్లవకారుల కోసం రాయాలనీ, అసలు వాళ్ళు విప్లవకారులేననీ రకరకాల భావాలు వ్యాప్తిలోకి రానిచ్చారు రాజకీయ విప్లవోద్యమంతోబాటు విరసం ముడిపడి ఉండరాదని నేను 1970 నుంచీ అంటున్నప్పటికీ ఈ సంస్థను రాజకీయాలు influence చేశాయి రాజకీయ కారణాల వల్ల విరసం చీలింది ఇవాళ కూడా విరసంలో revolutionary political party కి అవసరమైన క్రమశిక్షణను KVR లాంటి వారు ఆరాధించవలసి వస్తున్నది Purity వేరు, discipline వేరు మనవాళ్ళు డిసిప్లిన్ పేర purity ని propagate చేస్తున్నారా ? డిసిప్లిన్ అన్నది నియమాల ఉల్లంఘన - మన నియమాలలో శ్రీశ్రీ ఏ మీటింగుకు వెళ్ళగూడదో ఉన్నదా ? Penalty clauses ఉన్నాయా ? ఇది శంకర పీఠంవారి మనస్తత్వం నియమాలు మనం పెట్టుకున్నవి మారతాయి వాటిని sacrosanct గా చూడటం silly విరసం సభ్యుడు కావటమే assertion of liberty ఇందులో మళ్ళీ liberty మీద ఆంక్ష ఏమిటి ? విరసం సభ్యుడు ఒక తప్పే చేయగలడు Revolutionary principle ను abandon చెయ్యటం లేదా undermine చెయ్యటం ఏమైనా నేను విరసంలో ఉండి కూడా లేనట్టుగా ఉన్నవాణ్ణి గనక నా opinion కు అంత value ఉండదు

కాకపోతే సికిందరాబాద్‌లో విరసం సభ్యులు gherao చేసినప్పుడు శ్రీశ్రీ ప్రవర్తన గురించి రామకృష్ణ రాస్తానన్నాడు అతని ఉత్తరం కోసం ఎదురు చూస్తున్నాను

మీరు అవకాశం చిక్కినప్పుడల్లా విప్లవ సాహిత్యం గురించి బసవరాజులాంటి వాళ్ళతో కూడ చర్చించండి మనం ఎవరినీ వెలివెయ్యనవసరం లేదు కాని horrible fact ఏమిటంటే chronic anti-virasam tendencies కొందరిని anti-literature చేస్తున్నాయి బసవరాజు విషయంలో అది నిరూపించటానికి ప్రయత్నించాను అతను కొలిమంటుకున్నది చదివి అది ఎంత గొప్ప రచనో తెలిసికోలేని obsessionలో ఉన్నాడు

అతను ఇంకో mischief కూడా చేశాడు ప్రజా సాహిత్యాన్ని జానపద సాహిత్యం రొచ్చులోకి దింపి రెండూ ఒకటేనని మనవాళ్ళనే mislead చేశాడు అల్లం రాజయ్య, వేణు ఇద్దరూ mislead అయ్యారు నేను రాజయ్యకు ప్రజాసాహిత్యం జానపద సాహిత్యం కాదని detailed గా రాశాను అతను నా point ఒప్పుకున్నాడు గాని, ఒకప్పటి ప్రజలకు తులసీ రామాయణమూ, పోతన భాగవతమూ వాళ్ళ సాహిత్యమేనన్నది నమ్మశక్యం కానట్టున్నది Entire Bhakti movement was revolutionary and belonged to the people ఇది కూడా మన విరసం members కు సరిగా తెలీదేమో ! ఉంటాను

*

23-6-80

"Sartre wanted a dialectical relationship between the intellectual and a truly proletarian party There must be cadres inside the party following a maximum descipline but there must be also those outside, with the maximum freedom and the minimum of discipline Such intellectuals should enjoy the freedom to criticise even a working class party and government when those deviated from their historical roles " [Frontier 14-6-80]

This has been my attitude (approximately) with regard to the relation between Virasam & CPI ML In view of the action to be taken against Sri Sri in the general body meeting in October, this view may be discussed to see if it suits Virasam in order to avoid future complications Virasam pretending to be a political revolutionary party has been somewhat childish in my view, though Varavara Rao assured me that some actual revolutionaries are members of Virasam That should not mean all Virasam members should be treated as CPI ML members

*

11-7-80

నమస్కారాలు మీ 7 ఉత్తరం జ్యేష్ఠను మీరు ఎందుకు serious గా తీసుకుంటారు? అతని వంటి వాళ్ళకు followers అంటూ ఉండరు ఎవరన్నా అతన్ని ఖండిస్తే అది

అతనికి triumph Like the devil quoting scriptures, he quotes Marx నిజానికి ఈ జబ్బు మనవాళ్ళలో కొందరికి ఉన్నది

విప్లవ సాహిత్యం గురించి నేను వేరే సాహిత్యంగా ఆలోచించటం లేదు Dialectical గా అది traditional literature తాలూకు revolutionary development గానే రావాలి కాని తెలుగు సాహిత్యం విషయంలో (అన్ని జాతీయ సాహిత్యాల విషయంలోనూ కూడానేమో !) ఒక gap ఉన్నది అభ్యుదయ సాహిత్యం దాకా ఈ gap ఎవరూ feel కాలేదు నవ్య సాహిత్య పరిషత్తు వాళ్ళు అరసంను అవలీలగా ఆలింగనం చేసుకున్నారు (Political bigots మాట అలా ఉంచండి ) విరసం దగ్గరికి వచ్చేసరికి ఈ gap ఎందుకు వచ్చిందంటే ప్రజల భాషలో ప్రాంతీయ భేదాలు ఉండటం వల్ల అని నేను provisional గా అనుకున్నాను విప్లవ సాహిత్యం నిరక్షర ప్రజానీకానికి వినిపించాలిగాని, కనిపించి ప్రయోజనం లేదు కాని ప్రజల భాషలో 100, 150 మైళ్ళకొక dialect గా ఉంది ఇన్ని dialects కూ అరసం సాహిత్యంలో చోటు చేసి ఉండవలసింది అలా జరగలేదు మనవాళ్ళు కమ్యూనిస్టు రాజకీయ ఆర్థిక సిద్ధాంతాలకు సాహిత్యంలో ఇచ్చిన విలువ సాహిత్య పరిణామానికి ఇయ్యలేదు It get ignored కాకపోతే జానపద రూపాలు అని చిందులు తొక్కి చాలా effort waste చేశారు దాని ఫలితంగా జరిగిందేమిటి ? ఉత్తమ సాహిత్యంగా పరిగణించదగిన విప్లవ రచనలు అక్కడక్కడా వెలువడుతున్నా (కొలిమంటుకున్నది, కొన్ని పాటలు నాకు తెలిసినవరకు) వాటితో అన్ని ప్రాంతాల ప్రజలనూ కదిలించటం అనుమానాస్పదంగానే ఉంటున్నది కా రా గారి కథలు మంచి ఉదాహరణ వాటిని తెలంగాణా వాళ్ళకు చదివి వినిపించినా వాళ్ళలో కళ ద్వారా రావలసిన, రాదగిన సామాజిక చైతన్యం రప్పించలేం అలాగే తెలంగాణా భాషలో రాసిన నాటకాలు ఇతర ప్రాంతాల వారికి ఆడి చూపించి రక్తి కట్టించలేం ఈ gap ఎట్లా పూడుతుందంటే చెప్పలేను కాని ఈ gap ఉన్నంత కాలమూ ఒక ప్రాంతపు ప్రజల కష్టాలు ఇంకో ప్రాంతపు ప్రజలకు పట్టవేమో "స్వాతంత్ర్యం" "స్వరాజ్యం" అని అరిచాం కాని అందులో implications గురించి మనం ఆలోచించలేదు

*

12-7-80

నిన్న రాసిన ఉత్తరంలో నేను సాహిత్య పరిణామాలలో ఈనాడున్న gap గురించి రాస్తూ, లోగడ వచ్చిపోయిన ఇంకో gap గురించి రాయటం మరిచాను అది గ్రాంథిక భాషావాదంతో వచ్చినది ఆ దిక్కుమాలిన వాదం తెలుగులో ప్రజాసాహిత్యం అనేది అసాధ్యం చెయ్యటానికి వచ్చింది గిడుగూ, గురజాడా యుద్ధం చేసి శిష్ట వ్యావహారిక భాషావాదం పెట్టి పరిణామం కొనసాగనిచ్చారు 'శిష్ట' శబ్దం గురించి ఆక్షేపణ వచ్చినట్టుంది రాసేవారంతా శిష్టులు కారా అన్నాడు గిడుగు గుంటూరు నవ్యసాహిత్య సదస్సులో

మీరు ఈనాటి ప్రజాసాహిత్యం విప్లవ సాహిత్యం తప్ప మరేదీ అయే అవకాశం లేదనీ వాదించేటప్పుడు ఈ gap గురించి కూడా గుర్తుంచుకోండి Gap fill అయేదాకా రెండు సాహిత్యాలు తప్పవు గదా !

*

7-5-80

మీ ఉత్తరం అందింది

బుద్ధికొలత వ్యాసాలు విరసంకు సంబంధించినవి కావు  రాజకీయ సామాజిక విప్లవరంగంలో ప్రతివాడూ ముందుగా మార్క్సిజం-లెనినిజం, మావోయిజంలో ఆరితేరాలనటం అర్థంలేని మాట  నిజమేగాని విరసంలో ఆ అర్హత లేనివాడు ఎందుకు పనికివస్తాడో నాకు తెలీదు  కనీసం మార్క్సిజం తెలియకపోతే విరసం పునాది కూడా అర్థం కాదు  సాహిత్య రంగంలో మావోయిజం నుంచి తెలుసుకోవలసింది కూడా చాలా ఉంది  లెనినిజం ఎంతవరకు ఈ రంగానికి అవసరమో నాకు స్పష్టంగా తెలీదు

ఉంటాను

❋

19-6-80

శ్రీ ఎస్ ఎస్ రామకృష్ణారావుగారికి,

మీ 17 ఉత్తరం అందింది చాలా సంతోషం మీరు కూడా విరసం, జైలు చవిచూశారన్నమాట ఇది ఒక విశ్రాంతి సమయంలాగా, ఏ activity లేకుండా ఉన్నది అందుచేత కొన్ని fundamentals గురించి మనకు ఉంటూ వస్తున్న అభిప్రాయాలను తిరగదోడుతున్నాను నేను చాలావరకు సందేహాలు లేవదీస్తాను అందరూ ఆలోచించి సమాధానాలు తేవాలి అల్లం రాజయ్యకూ ఇతరులకూ రాస్తున్నాను మీరు కూడా ఈ correspondence group లో చేరి మీ అభిప్రాయాలు చెప్పవచ్చు శ్రీశ్రీని గురించి తప్పక రాయండి నేను అతన్ని గట్టిగా తప్పుపట్టటం లేదు

మీరు చెప్పిన మూడు పుస్తకాలూ నేను చదవలేదు Slogans కు అర్థం ఎట్లా చెప్పటం ? 'నా వాంఛలే వాస్తవికత' అనేది సందర్భం తెలిస్తే గాని అర్థం కాదు తీరా అర్థం తెలిస్తే అందులో ఏమీ లేకపోనూ వచ్చు వినిమయ వస్తువులే ప్రజల నల్లమందు అన్నది కొంతవరకు గ్రహించవచ్చు ఒకప్పుడు రేడియో కొని పై క్లాసుకు వెళ్ళిపోయామనుకునే వాళ్ళుండేవారు, ఈనాడు TV sets గులాబీలు కోరినా విప్లవం గొప్పదని నమ్మటం నాకు సాధ్యం కాలేదు గులాబీలు revolutionary values లో అంత ముఖ్యమైనవా ? ఉంటాను

*

19-7-80

నమస్కారాలు మీ కార్డు, inland అందాయి నేను హైద్రాబాద్ రావటం పడదు రోజూ తీసుకునే మందులు వెంట తెచ్చుకోవచ్చు లేకపోతే హైదరాబాద్‌లో కొనవచ్చు కాని వాటి side effects నుంచీ, భోజనంలోనూ, routine లోనూ జరిగే irregularities గురించీ నేను రోజూ పుస్తకాలు చూసి హోమియో మందులు వేసుకుంటాను ఊళ్ళోనే ఎక్కడన్నా పెళ్ళికి వెళితే ఎంత జాగ్రత్తగా తిన్నా పెళ్ళి తిండి దెబ్బతీసి, ఇంటికి రావటం యజ్ఞం చేసినంతపని అవుతుంది ఆఫీసుకు ఆఫీసు కారులో వెళ్ళి వస్తాను కాని ఇంకెక్కడికన్నా నేను ఒంటరిగా బయలుదేరితే నా భార్య తాను కూడా వస్తానని పట్టుబడుతుంది ఒంటరిగా నేను ఎక్కడ ఏమైపోతానోనని ఆవిడ భయం అదీ పరిస్థితి !

విరసం సభ్యులు నన్ను చూసి పొందే లాభం ఏమీ లేదు నేను రాస్తున్నదే నోటితో చెబుతాను నాతో చర్చలు జరపదలచిన వాళ్ళు నాతో ఉత్తర ప్రత్యుత్తరాలు చేస్తూనే ఉన్నారు

విరసం నుంచి ఎవరన్నా తప్పుకుంటే లోపం ఆర్గనైజేషన్‌లోనూ, ఆర్గనైజర్స్‌లోనూ ఉండవచ్చు విరసం సభ్యులు సంస్థ గురించి కూడా శ్రద్ధ వహించటం మంచిది ఉంటాను

*

9-8-80

నమస్కారం నన్ను మీరంతా ఒత్తిడి చేసి విరసం సభలకు రప్పించటం బాగా లేదు నా ఆరోగ్యం ఏమీ బాగా ఉండటం లేదు మళ్ళీ పది రోజుల నుంచీ రోజూ జ్వరం తగులుతున్నది రెండు X-rays తో సహా 9 tests చేయించుకున్నాను కాని ఇంతవరకు జ్వరానికి కారణం తెలియలేదు (డాక్టరుకు) నాకు నేను చేసుకునే వైద్యం కేవలమూ కొత్తగా వచ్చిన రోగ లక్షణాల వరకే అసహాయ స్థితిలో నేను రెండేళ్ళపాటు ఇంగ్లీషు మందుల కాటు తిన్నాను ఇవాళ కూడా అవి రోజూ వేసుకుంటూనే ఉన్నాను నాకు తోడు కావాలంటే మీరంతా ఉండరని కాదు నా routine జరిపేటందుకు నా భార్య వెంట ఉండాలి ఆవిడ ఉండబట్టే తెనాలి రెండు రోజులపాటు వెళ్ళగలిగాను ఆవిడ రావటానికి పడకపోవచ్చు ఎందుకంటే లిబియా నుంచి మా అమ్మాయీ, అల్లుడూ, వాళ్ళ పిల్లలూ వచ్చేస్తున్నారు పిల్లల్ని స్కూళ్ళలో చేర్పించాలి ఈ ఏర్పాట్లన్నీ నా భార్యే చూస్తున్నది నా వల్ల కాదు నేను ఎక్కువ దూరం నడవలేను మెట్లెక్కలేను హోమియో మందులు అందుబాటులో లేకపోతే జరగదు

నా ఉద్దేశం ఈ సభల ముఖ్య కర్తవ్యం విరసం ఉద్యమానికి మరింత వేగం అందించటం సభలు జరుగుతున్నకొద్దీ ఉద్యమం సన్నగిల్లుతున్నది చదివేవాళ్ళు తక్కువై, వినేవాళ్ళు ఎక్కువైనారని వరవరరావు అన్నది నిజం వినేవాళ్ళకు పనికివచ్చే సాహిత్యం చదివేవాళ్ళ ముందు పెడితే ఉద్యమం సాగదు ఆత్మ విమర్శ అని కల్లబొల్లి మాటలతో తృప్తిపడి లాభం లేదు పరిస్థితిని శాస్త్రీయంగా విశ్లేషించాలి నేను ఎంత రాసినా సాహిత్యం దృష్ట్యా రాస్తున్నాను తప్ప విప్లవ సాహిత్య సృష్టి ప్రచారం (ఆచరణ) దృష్ట్యా ఇంత దూరాన ఏమీ తెలుసుకోలేను అదీ నా పరిస్థితి ఉంటాను

*

11-7-80

శ్రీ యన్ వేణుగోపాల్‌గారికి,

"జ్యేష్ఠ" రాసే nonsense చూడడం శుద్ధ దండగ అయితే అతను మిమ్మల్నందరినీ చిన్న ఊబిలోకి దింపాడు నేను ప్రజాసాహిత్యం అన్నదాన్ని అతను జానపదసాహిత్యం అన్నాడు రెంటికీ సంబంధం లేదు దాన్ని గురించి సృజనకు రాశాను అయితే ఏ కారణం చేతనో నాకు చాలా ముఖ్యమనుకున్నది ఒక్కోసారి సృజనకు అంత ముఖ్యంగా తోచదు అందుచేత, జానపద సాహిత్యానికీ, ప్రజా సాహిత్యానికీ నేను చెప్పిన తేడా సృజనలో వచ్చినదాకా నమ్మకం లేదు

చర్చ ఆపటంలో కుట్ర ఉంటుందనుకోను అది ఏనాడో గాడి తప్పింది నేను మొదట రాసింది అచ్చుగా విప్లవ సాహిత్యాన్ని సమర్థించటానికి కాదు, సంప్రదాయ సాహిత్యంలో దానికి చోటు ఉండేటట్టుగా అది పరిణామం కాకపోవటం గురించి విరసం పెద్దలంతా చూస్తూ ఊరుకున్నారెందుకు ? కావలిస్తే జ్యేష్ఠను సృజనలోనో, అరుణతారలోనో విమర్శించవచ్చు నేను మాత్రం జ్యేష్ఠలాంటి కృత్రిమ మార్క్సిస్టులకు జవాబులు రాయను వాళ్ళ సిద్ధాంతాలను ఎవరూ పాటించరు అంతకన్న విప్లవ రచయితలకు పనికివచ్చే చర్చలు ఎంతైనా చేయవచ్చు మార్క్సుని పచ్చి విప్లవ వ్యతిరేకి ఉదహరిస్తుంటే అతన్ని గమనించకుండా పోవడం కూడా ప్రోత్సాహమే ! ఉంటాను

*

31-7-80

Dear Dr Dakshinamurthi Garu,

I am bringing my trouble to you taking advantage of your kind promise to help me at any time(1) I am enclosing results of tests made yesterday My doctor does not know the reason for the high ESR and wanted me to undergo a number of rare (?) tests in our Vijaya Hospital But I am hoping that what is obscure to my doctor may be clear to you Of course I'll get the test done as soon as possible But I would value your advice immensely The changes you made in the prescription seems to have done a lot of good to me and I am still following it

2 Persantine 100, 3 Cyclasin and 3 Iseptin with 1 Eption at night

Kindly see what you can make of the results of the test

The same doctor has treated me in 1977 for TB of the Kidney with a full course and says it is not likely to return

I hope your cultural activities are going strong

(1) 25-11-79న తెనాలి క్లాసికల్ ఫిలిం సొసైటీ వారు కుటుంబరావు, శ్రీశ్రీలకు అభినందన సభ జరిపారు ఆ సందర్భంలో డాక్టర్ పాటిబండ్ల దక్షిణామూర్తిగారి వద్ద కొకు, శ్రీశ్రీలు పరీక్ష చేయించుకున్నారు అప్పటికి కొన్ని ఏళ్ళ కిందటనే గుండెపోటు వచ్చి వుండిన కుటుంబరావుగారి ECG దాని ప్రభావాన్ని ఇంకా చూపింది

*

7-8-80

Thank you very much for your prompt reply and keen interest in me I only waited for the results of tests to come They have just come and here they are

| | |
|---|---|
| Blood picture | RBCs are normocytic but shows polychrombia Lencoctyles & Platelabs appear normal |
| Urine | Bance jones protein is not present in sample |
| Haematology | |
| Total RBC 3 | 28 million per mm |
| Hb | 10 gm% |

| | |
|---|---|
| Total WBC 6,500 | |
| Differential count | P 59%, L37%, E3%, M1%-B-O |
| Acid Posphates | 3 31M |
| Prostatic | 1 4 ,, |
| Albumin | 3 5 gms% |
| Total Orectrin | 6 3 ,, |
| Gobuiln | 2 8 ,, |

Serum Protein electrophospeceis shows a distinct elevation of alpha 2 globulin fraction

Besides these, they tool 2 X-rays of Chest & Abdomen I did not receive them because they want to repeat the chest X-ray and I shall be going there in a few minutes

From the results of the tests you should be able to conclude what is wrong with me and I request you to give me your diagnosis unhesitatingly, so that I can make use of Homeo drugs to treat even the worst diseases And I am not going to be demoralized even if it turns out I have cancer in any part of my body

Only I am sorry for the trouble I am giving you

*

16-8-80

Thank you for your letter of the 14th In the meantime I saw my doctor He is puzzled and wanted me to take a vital test (?) (Typhoid) and if necessary bone-marrow test too ! He actually wanted me to continue Bactrim for 4 more days but I didn't because it seemed to make me more sick than even the fever I still get the fever & suppress it with crocin tablets and nobody suspects that I am having daily attacks of low fever It keeps me falsely 'normal' but as a homeopath I really don't like taking it Until the fever is otherwise aborted I don't mean to have a choice except taking crocin 2 tablets a day in one dose

I had a prolonged attack of Malaria in 1927 while studying at Vijayanagaram and my doctor suggested 2 tablets of Metakalpin once and another 2 a week later It falls due on 19th

Since you want me to continue I'll try Bactrim for four more days

I'll start Rancol (?) right away I've here 52 tablets with me which I occassionally take I can take them regularly along with Rancol And I'll change to Protinules twice a day, morning & afternoon

If you can give me a ten day's notice[1] I shall see what I can contribute on Bhanumathi, in many respects a unique figure in Telugu films

(1) ఈ ఉత్తరం రాసిన మరురోజే కుటుంబరావు చనిపోయారు ఉత్తరం 18న డాక్టర్ గారికి అందింది డాక్టరుగారు తెనాలిలో పరీక్షించినప్పుడే, కొకు గుండె క్రమం తప్పి కొట్టుకోవడం గుర్తించారు లోజ్వరం, రక్తహీనత - వీటికి కారణాలేమిటో డాక్టర్లు యింకా తేల్చి చెప్పకముందే హఠాత్తుగా గుండెపోటు వచ్చి చనిపోయారు ఇలాంటిది "డాక్టర్లకు సుపరిచితమైన సంఘటనే-ఆశ్చర్యకరం కాదు" అని డాక్టర్‌గారు రాశారు

❋